# 1

వారంరోజుల బట్టి మంచుగడ్డలు కరిగిపోతున్నాయి. శీతాకాలం క్రమంగా నిష్క్రమిస్తోంది. గాలి అన్నది బొత్తిగా లేకుండాపోయింది. రాత్రిపూట ఆకాశంలో చుక్కలు మిణుకు, మిణుకు మంటున్నాయి. ఆకలిగొన్న తోడేలు కళ్ళవలె, వెన్నెల్లో మంచు మెరుస్తోంది.

రాత్రి రెండు గంటలైంది. లోకం నిద్రపోయింది. ఊరంతా మాటు మణిగింది. ఊళ్లో వీధులన్నీ నిర్మానుష్యంగా వున్నాయి. చివరకు కుక్కలుకూడా ఏపొయ్యినో, ఏగాడినో ఏమూలనో చేరి, మునగదీసుకొని పడుకొని వుంటాయి. చలికి ముడుచుకుపోతున్న పొట్టలో కప్పు టీ పోసుకురావటానికి ముసలి కాపలాదారు యింటికెళ్ళినట్టున్నాడు. బహుశా అతను పొయ్యికి ఎదురుగా కూర్చొని టీ కాచుకుంటూ వుండవచ్చు. మంచు దుప్పటి కప్పుకొన్న యిళ్ళ కప్పులు వెండివలె తళతళ మెరుస్తున్నాయి. మబ్బుపింజల ఆకృతి పొందిన పొగల తెరల వలె చెట్లగుబుర్లు కన్పిస్తున్నాయి. గ్రామమంతా ఖాళీగా, బోళాగా, ముద్దుముచ్చటలు గొల్పుతోంది.

ఒకయింట్లో మాత్రం యింకా దీపాలు వెలుగుతూనే వున్నాయి. కిటికీ తలుపుల్లోంచి దీపాల వెలుగు బయటకు దూసుకొస్తోంది. ఇంటిలో గొంతులు బయటకు విన్పిస్తున్నాయి.

తలుపు తీసిన చప్పుడో, వేసిన చప్పుడో. ఇంటి వసారాలో, గుంజలను ఊతగాగొని, వణుకుతూ వృద్ధుడొకడు నెమ్మదిగా తచ్చట్లాడుతున్నాడు కదలలేక నిలబడి పోయాడు. వణుకుతూ, గొణుగుతూ పాడుతున్నాడు:

"నాకే గనుక బంగారు కొండే వుంటే..." ఆగిపోయిన కంఠం మరి పెగలటంలేదు. నిశ్శబ్దాన్నిచూసి భయపడినట్టున్నాడు. కాలు ముందుకు సాగలేదు. గుండెల్లోరాయి పడింది. వెనుతిరిగిచూశాడు. చూడకకాలుతో తన్నిన బక్కెట్టు వాలిపోయింది. గొణగొణధ్వని చేస్తూ నీరు కారిపోతోంది. తలుపు గభాలున తెరచుకొంది. ఉవ్వెత్తున వరదవలె వెలుగు పరచుకొంది. జనంతోసుకుంటూ బయటకొచ్చారు. వారి కాళ్ల క్రింద మంచు బెడ్డలు నలగిపోయాయి.

"ఇగ్నాత్ తాత, ఇగ్నాత్ తాత. నీ వెక్కడ ?"

"ఎందుకలా గొంతుచించుకుంటావ్ ? తాత నీ ప్రక్కనే వున్నాడు."

"ఇవనోవా నాటుసారాయి బాగా తలకెక్కింది"

"కన్పించటంలా? పదండి"

కంగుమంటున్న కంఠధ్వనులతో నిశ్శబ్దం అదరి, చెదరి పోయింది.

యువకుడూ, యువతీ ఒకే కోటులో దూరి, ఒకరికొకరు కావిలించుకొని, యింట్లోనుంచి, వసారాలోకి వచ్చి వెడలిపోతున్న అతిథులకు వీడ్కోలు చెప్తూతున్నారు.

"ముసలాడిని వెంటనే యింటికి తీసుకుపో. లేకపోతే, ఎక్కడో మంచులోదూరి, నిద్రపోతాడు. ఈ రాత్రికి ఇక్కడే వుంచితే పోతుంది." అన్నాడు యువకుడు,

"నేనా? పిల్లేదు. నేను...స్వ...తంత్రు....ణ్ణి. నేను.... స్వతంత్రుణ్ణి."

"అలాగే. తాతా. అంత కాక ఎంత? సరే పోదాంపద. నూతన వధూవరుల నోములుపండి, ఆనందరాశి కొండంతగు గాక."

"వచ్చేయేడు ఈ పాటికి పసిపాప పారాడాలి."

మంచుబెడ్డలు కాళ్ళకిందపడి నలిగిపోతున్న ధ్వని.... దూరదూరంగా జరిగిపోతోంది. వణుకుతున్న, గొణుగుతున్న వృద్ధకంఠం యింకా విన్పిస్తూనేవుంది:"నాకేగనుక బంగారు...." మధ్యలో ఆగిపోయింది. ముచ్చటయిన ప్రశాంతత తిరిగి నర్తిస్తోంది.

"చూశావా, స్నేహా, ఇదే తీరు....మన జీవితానికిదే నాంది." అన్నాడు యువకుడు. యువతి యువకుణ్ణి యింకా గాఢంగా కౌగలించుకొంది.

పెళ్లి అయిపోయింది. కొద్దిమంది అతిధులతో, అతి నిరాడంబరంగా జరిగిపోయింది. కోడికూసేదాకా సాగించక పెందరాళే పూర్తిచేశారు.

# 2

ఫ్యోడార్ సొలొవికోవ్ ట్రాక్టర్ టీముకు నాయకుడు. సరదాజీవి. ఎల్లప్పుడూ హుషారుగావుండే యువకుడు. నృత్యం చేయడానికైనా, కుస్తీ పట్టడానికైనా అతను ఎప్పుడు పడితే అప్పుడు తయారు. పొడుగ్గా, చలాకీగావుంటాడు. నొక్కులు తేరిన జుట్టు, చూడముచ్చటగా వుంటుంది. నృత్యం చేయటంలో మేటి; కుస్తి పట్టటంలో దిట్ట. అందుకే అతనంటే ఆడపిల్లలు పడిచచ్చి పోతారు.

ఖ్రోయ్స్తావో ప్రాంతంలోని గ్రామ సోవియట్‌లో ఫ్యోడార్ టీముపనిచేస్తున్నది. గలీనా జ్లోబినా గ్రామ సోవియట్ కార్యదర్శి జోయా అలెగ్జాండ్రొనోవా ఉపాధ్యాయిని. గుండ్రని ముఖం. వీరిద్దరూ ఎప్పుడూ ఎడమొఖం పెడ మొఖంగా వ్యవహరిస్తారు.

జోయానుగురించి గలీనా అంటుంది: "జోయా పట్టి ఆకతాయి. డాబులు జాస్తి." గలీనానుగూర్చి జోయావ్యాఖ్యానిస్తుంది: "అతి వయ్యారంగా నడుస్తూ. మగాళ్ళదృష్టిని ఆకర్షించాలన్న రంధి గలీనాకు జాస్తి." ఈ పడతులిద్దరూ ఈ విధంగా ఒకరినిగురించి మరొకరు ఆడిపోసుకుంటుంటారు అయితే వీరిద్దరు ఫ్యోడార్‌ను మాత్రం తమవలలో వేసుకోలేకపోయారు. అతను ఇద్దరితోను స్నేహం చేస్తున్నాడు. ఒకరోజున జోయాను

వెంటపెట్టుకు షికారుకు బయలుదేరుతాడు. మరొకరోజున గలీనాను తన యింటికి తీసుకుపోతాడు. ఇదీ వరస.

ఇది ఇలావుండగా ఖ్రోమ్‌స్తోవోలో పని చేయటానికి కొత్తగా వ్యవసాయశాస్త్రంలో పట్టాపొందిన యువతి ఒకామె అక్కడికి వచ్చింది. ఈమె చక్కనిదుస్తులు ధరించి, చూడటానికి అందంగానే కన్పిస్తుంది. జోయాకుగానీ, గలీనాకుగానీ ఈ సంగతి తెలియదు. ఫ్యోడార్ "మెషిన్ ట్రాక్టరు స్టేషన్"కు వస్తాడని తెలిస్తేచాలు, ఆమె చక్కగా సింగారించుకొని, అతని రాకకు ఎదురు చూస్తుంటుంది; కలుసుకొన్నప్పుడు అతనితో మామూలిధోరణిలో అంటుంది.

"ఫ్యోడార్, నిజంగా నీలో ప్రతిభ, ప్రజ్ఞ నిద్రాణంగా వున్నాయి. వాటిని ఎందుకు అభివృద్ధి చేసుకోవ్? ఇవ్వాళ సాయంత్రం క్లబ్‌కు వెళదాంపద. రిహార్సల్స్ ప్రారంభిద్దాం."

అలాంటి సమయాల్లో తనలోని గొప్పతనం తలుచుకొని ఫ్యోడార్ గర్వపడతాడు. ఆమెవెంట క్లబ్‌కెళ్లి రిహార్సల్స్‌లో పాల్గొంటాడు. జిప్సీడాన్స్ చేస్తాడు. ఒకవేళ రిహార్సల్స్ లేకపోతే వారిద్దరూ కలసి సినిమాకు పోతారు.

ఏమైనా సమయం రానేవచ్చింది. లారీడ్రైవరు వాస్యెల్యుబిమోవ్ మాటల్లో చెప్పాలంటే, ఫ్యోడార్ "పూర్తిగా వలలోపడిపోయాడు; బాగా ఊబిలోదిగి పోయాడు."

శీతాకాలపు తొలిమంచు జల్లుతోపాటు ఖ్రోమ్‌స్తోవోలో "పంటసిరి" ఆనువాతీగా వస్తోంది. పంటసిరి చేతికొచ్చినప్పుడు రైతులు పండుగ జరుపుకొనే సంప్రదాయం ప్రాచీనమైనది. అయితే నాటికి, నేటికి జరుపుకొనే పండగరూపం మార్పు చెందింది. అంతే.

క్లబ్‌లో ప్రసంగాలు, వినోద కార్యక్రమాలు, విందులు, తెల్లవారేదాకా జానపదనృత్యాలు- ఇవీ ఈనాటి పండగ కార్యక్రమాలు.

చుట్టుప్రక్కల కొన్ని మైళ్ళదూరంలోగల గ్రామాల నుంచీ, శివార్లనుంచీ యువతీ యువకులు వచ్చి ఈ నృత్యాలలో పాల్గొంటారు. కార్యక్రమంలోని ప్రతీఅంశం అతి హుందాగా అరంభంమవుతుంది. చివరకు గోలతో, గగ్గోలుతో సందడితో సమాప్తమవుతుంది.

పెట్యారి జికోవ్ వాయిద్యంచేత బూనతాడు. యువతీ యువకులు నృత్యం ప్రారంభిస్తారు. ఫ్యోడార్ సాధారణంగా ఇతరులు బలవంతంచేస్తేగాని నృత్యానికి సిద్ధంకాడు. నృత్యం ప్రారంభించాడా పదిమంది ప్రశంసలు పొందవలసిందే. అందుకు తిరుగులేదు.

చుఖ్నానది అవల క్రై గొరొదిషే జిల్లాలోని సుఖోబ్లినోవో నుంచి ఒక యువకుడు వచ్చాడు. అతని పేరు చిజోవ్; ట్రాక్టర్ డ్రైవర్. వాస్య ల్యుబిమోవ్ మినహా చిజోవ్‌ని ఎవరూ ఎరుగరు. చిజోవ్ ప్రక్కనే, నీలి సిల్కుదుస్తులు ధరించిన యువతిఉంది. ముద్దులొలికే ముఖం. ఎత్తైన గుండ్రనైన వక్షోజాలు. ఆమె కాలు కదిపితే హంసనడక జ్ఞప్తికొస్తుంది. కాకి ముక్కుకు దొండపండు అన్నట్టు, చిజోవ్ ప్రక్కన ఆమె నిలబడితే అందచందాలు సరిగా అతికినట్టు కన్పించదు. చిజోవ్ అందగాడని చెప్పేందుకు వీలులేదు.

ఎందుచేతనో గాని ఫ్యోడార్ ఈదఫా అడగటమే తడవుగా, మారుచెప్పకుండా, డ్యాన్స్ చేయటానికి సిద్ధమయ్యాడు.

నృత్యవలయంలోకి వచ్చి రావటంతోనే రష్యన్ నృత్యం ప్రారం భించాడు. చక్కరులు కొట్టుతూ, కొట్టుతూ కొత్తపిల్ల దగ్గర కొచ్చి ఆగిపోయాడు. నృత్యంచేదాం రమ్మంటూ ఆమెను ఆహ్వానించాడు. వళ్ళు విరుచుకోకుండా, సునాయాసంగా. చివరకు పిరుదలవరకు వేలాడుతున్న పొడుగాటి జడలుకూడా కదలకుండా ఆమె ఫ్యోడార్ తో కలసి నృత్యం పూర్తిచేసింది. మళ్లీ వెళ్ళి చిజోవ్ ప్రక్కనే నిలబడింది.

సామూహిక నృత్యం ప్రారంభం కాబోతున్న సమ యంలో ఫ్యోడార్ తిరిగి నీలిదుస్తుల పిల్లదగ్గరకి పోయాడు

ఆమె నేత్రాలు విశాలంగా, నేరేడు పళ్లను పోలి వున్నాయి. కనుబొమ్మలు కాస్త పొడుగు; దట్టం. చెక్కిళ్లు గులాబీ రేకులవలె వున్నాయి. ఆమెతో డ్యాన్స్ చేస్తున్నంత సేపు నాటు పొగాకు వాసన ఫ్రోడార్ నాసికారంధ్రాలను చాలా యిబ్బంది పెట్టింది.

"చిఖోల్లి నోవ్‌లోని యువకులంతా అట్లాంటి వారేనా? అంటూ ఫ్యోడార్ చిజోవ్ వైపుచూశాడు.

"అట్లాంటివారేనా అంటే"

"చూపడానికి అసహ్యంగా....అయినా ఖ్రోమ్‌స్తావోకు వచ్చి ఇక్కడ హాయిగా జీవించరాదా?"

ఆమె నేత్రాలలో చిరునవ్వు మెరుపుమెరిసింది. కాని వెంటనే చూపు అధోముఖమైంది.

"ఉదాహరణకు నీవు ఇక్కడకు వచ్చేయవచ్చుగా."

"కావచ్చు."

నృత్యం పూర్తయింది. ఈసారి ఆమె చిజోవ్ దగ్గరికి వెళ్ళలేదు. ఫ్యోడార్ చెంతనే నిలబడిపోయింది. ఫ్యోడార్ మనసులో మమతను ఆమె యిట్టే గ్రహించింది. ఆమె అనుకొన్నట్టే జరిగింది ఫ్యోడార్ ఆమె కొంగు వదిలితే వట్టు.

చిజోవ్ ఒకమూల జేరి, గుడ్లురుముతూ చూస్తున్నాడు. ఫ్యోడార్ ఏమీ చలించలేదు. ఇంతకీ నిర్ణయించుకోవలసింది ఆమె.

పెద్ద పెద్ద మంచు రేణువులు ఆమె ముంగురులపైన, భుజాలపైన, దుస్తులపైన దట్టంగా పేరుకొన్నాయి. ఆ యువతి చేతిని ఫ్యోడార్ గట్టిగా పట్టుకొని, ముందుకుసాగాడు. వారిద్దరు చెట్టపట్టాల్ పట్టుకొని, నడక ప్రారంభించారు. ఆమె వూరు చాలా దూరం. నడుస్తూన్నంతసేపు వారు నోరువిప్పితే వట్టు. ఆమె మౌనముద్రలో హుందాతనం దోబూచు లాడుతోంది. ఫ్యోడార్ సిగ్గుపడిపోతున్నాడు. పరిహాసాలాడటంలో అతను మొనగాడు. అయితేనేం? గొంతు పెకలటంలేదు. మంచు దట్టంగా పట్టిందేమో దారి సరిగా కన్పించటంలేదు. దీపకాంతితో దీప్తిచెందిన, సంగీతంతో మార్మ్రోగుతున్న క్లబ్ హాలును వెనకనే వదిలి వారు చాలాదూరం వచ్చేశారు. ఆసందడి, ఆ నవ్వులు అన్నీ యిప్పుడు వారికి కేవలం కలగా, లీలగా తోచాయ్. మంచురేణు ప్రవాహాసిక్తమైన ప్రశాంత ప్రపంచంలోకి వయనిస్తున్నట్లు వారి కనిపించింది. ఇది వారిలో భయోత్పాతం కల్గించలేదు ఆనందసౌరభం చిలికించింది. జట్టుగా, కలిసి కట్టుగా వున్నారామె. ఇంతకన్నా కావలసిందీ, కోరుకోతగ్గదీ ఇంకేముంది?

మారారు. మరి ఇంకా వారిద్దరు దేనికోసం, ఎవరికోసం తగవు లాడుకోవాలి? ఫ్యోడార్ వారిద్దరికీ మస్కా యిచ్చాడాయె! ఫ్యోడార్ ఈమధ్య అసలువారితో మాట్లాడ్డమేలేదు. రెండు రోజుల కొకసారి ఫ్యోడార్ అమడన్నరమారం నడచి, సుఖోల్లి నోవాకు వెళ్ళి తిరిగొస్తున్నాడు.

గలినాతో, జోయాతో, వ్యవసాయ శాస్త్రజ్ఞురాలుతో ఫ్యోడార్ ఆడుతూ, పాడుతూ, కాలక్షేపం చేశాడు. కాని అసలు విషయంవచ్చేసరికి, సనేమీవీల్లేదు పొమ్మన్నాడు.

స్తేషా ప్రతిసారీ, మామూలు ప్రకారం అతనికి స్వాగత మిస్తుంది: నవనీతంచిందే తన చిరుచేతులతో ఆమె అతని చేతు లను అందుకొంటుంది. అనురాగం చిలికే, ఆనందంగొలిపే కళ్ళతో అతని కళ్ళల్లోకి చూస్తూ: అతన్ని మరిపించి మురి పిస్తోంది. ఆ చూపులలోనే భావాలు ప్రసారం చేస్తుంది: నాకు తెలుసు, సఖా? నీవు నన్ను పదలలేవు. వీడి ఒక్కక్షణం గడప లేవు. నాతోనే నీకు స్వర్గం. అంతా తెలుసు. నిజానికి నాకూ నీతోనే స్వర్గం. నిజం దాచనేల?"

చివరకు ఒకరోజున ఫ్యోడార్ తనమిత్రుడు వాష్టిల్యూచి మోవ్‌తో ఫిర్యాదుపూర్వకంగా చెప్పాడు కూడా: "స్తేషా చాలా మంచిపిల్ల. అయితే ఆమెలో ఒకేఒక లోపం వుంది: నోరు విప్పి, మనస్సు విప్పి, చెప్పలేదు." ఈమాటలు మిత్రునికి చెప్పటమైతే చెప్పాడుకాని, చెప్పిన వెంటనే ఫ్యోడార్ నాలిక కరుచుకొన్నాడు. ఎందుకు చెప్పానా అని బాధపడ్డాడు. వారం రోజులదాకా స్తేషా ముఖం చూడలేకపోయాడు. తానన్న మాటలు ఆమె చెవికి సోకితే, చేరతే...నిజంగా భయపడ్డాడు.

అంతా విచిత్రం! అతనికి గుండె నొప్పిలేదు. రక్త ప్రసారం మామూలుగానే వుంది. అయినా స్తేషాను చూడక పోతే, చెప్పరాని, చెప్పలేని బాధ భరింపశక్యం కాని బాధ. ఏదో తెలియని బలీయమైన పాశం అతనిని ఆమె చెంతకు, ఆమె లేత చేతులవైపు- నిశ్చలమైన ఆమె నయనద్వయం కేసి పడలాగు తున్నట్టున్నది. అందుకే రెండురోజుల కొకసారి అమడన్నర దూరం దేవుడా అంటూ నడుచుకొంటూ వెళ్ళి, యింటికి తిరి గొస్తున్నాడు.

స్తేషా యిల్లు చిన్న పూరిల్లు. వూరిచివరన వుంది. ఆ వూరిలోని వెన్నపూసఫ్యాక్టరీలో తనిఖీపని చూసే గుమస్తాగా ఆమె పని చేస్తున్నది. మొదటిసారి ఆమె తల్లిదండ్రులు ఫ్యోడార్‌కు అన్నివిధాల నచ్చారు.

స్తేషా తండ్రి వృద్ధుడే అయినా దృఢకాయుడు. భౌమికపుష్టి బాగా కలవాడు. ఓ రోజున ఫ్యోడార్‌ను పిలిచి, ఖండితంగా చెప్పేశాడు.

"చూడబ్బాయి, మారోజుల్లో యిలాంటి వ్యవహారాలు లేవు. అసలు ఆ రోజులే వేరు. ఇది నాఅంతట నేను నీతో ప్రస్తావించవలసిన విషయం కాదనుకో. అయినా కాలం మారి పోయింది. ఈరోజుల్లో ఏమైనా చెల్లుతుంది. అందుకని నేనే చెప్పదల్చుకొన్నా. జాగ్రత్తగా విను. నీవేమో మా అమ్మాయి కొంగు పట్టుకొని అదేపనిగా తిరుగుతున్నావు. మరి మా ముస ల్దానికీ, నాకూకూడా ఇష్టమేననుకో. చాలామందికన్నా మేము హాయిగానే బ్రతుకుతున్నాం. మాకుమాత్రం కావలసిందే ముంది చెప్పు? నీవు చూస్తూనేవున్నావుగా, లంకంతవుంది ఈ

ఇల్లు. సగభాగం ఖాళీగానే వుంటోంది. కాబట్టి ఎందుకొచ్చింది కాని, నీవుకూడా వచ్చేసి, మాతోపాటే ఈ యింట్లోవుండిపో. అంతా కలిసి హాయిగావుందాం!"

స్త్రేషా సిగ్గుదొంతరల అంతరాల లోతోలుచూస్తూ వింత వింత అనుభూతుల కాంతుల మిరుమిట్లుతో కళ్ళను క్రిందకు దించేసుకొంది. స్త్రేషా తల్లి వృద్ధురాలు. దబ్బపండువంటి గుండ్రని మొఖం. కరుణ తొణికిసలాడుతూంటుంది. తండ్రికి చెప్పిన మాటలకు తల్లి అనురాగ పూర్వకంగా తలూపుతూ—

"అవును నాయనా, నీవు ఇక్కడకు వచ్చేయటమే బాగుంటుంది. కొడుకులు కలిగే అదృష్టం ఎటుతిరిగీ మాకు లేకపోయింది. అల్లుడైనా కొడుకైనా నీవే మాకు."

కాబోయే అత్తమామల ఎదుట నోరుమెదపలేని అల్లుడు బయటకొచ్చి, తన అభ్యంతరం తెలిపాడు;

"అసంభవం. సమష్టి వ్యవసాయ క్షేత్రాన్నీ, నా మెషీన్, ట్రాక్టర్ స్టేషన్‌నూ వదలిరావటం చాలా కష్టం. అక్కడ నేను ఎన్ని సంవత్సరాలు పనిచేశాను! మొదట నేను మామూలు డ్రైవరను. ఇప్పుడో శాఖకే అధినాయకుణ్ణి, అయినా ఆ స్నేహితులందరినీ వదిలిరావటం మాటలా?"

"ఉన్న ఊరును వదిలిరావటం నీకు కష్టమైతే, ఇంటినుంచి కదిలిరావటం నాకు మరింత కష్టం. అయినా ఇక్కడకు వచ్చేస్తే నీకొచ్చిన లోటేమిటి చెప్పు? ఇక్కడా తగినంతమంది ట్రాక్టరు డ్రైవర్లు లేరు. నీవు రావాలేగాని. వచ్చిన మరుక్షణం నిన్ను శాఖ అధినేతగా నియమిస్తారు. నిజం" అంది స్త్రేషా.

అసలు ఫ్యోడార్ అలవాట్లే వేరు. అతను తన ట్రాక్ట రును కట్టుకొన్న భార్యకన్నా అతిగారాబంగా చూసుకొం టాడు. ట్రాక్టరును వదిలి వుండలేడు. శీతాకాలంలో ట్రాక్టర్లను బాగుచేస్తుంటే, మరమ్మతుల కేంద్రం దాపుల్లోనే ఒకగది అద్దెకు తీసుకొని, అక్కడే వుండిపోయేవాడు. దూరప్రాంతం లోని పొలాలలో దుక్కిదున్నుతుంటే, రాత్రిపూట ట్రాక్టర్ల ప్రక్కనే, ఆ పొలాల్లోనే అతని మకాం.

ఫ్యోడార్ తండ్రి ఏడేళ్ళక్రితం పరలోకగతుడయ్యాడు. అతని తల్లి ఎక్కడో, నాలుగు ఆమడల దూరాన, ఒక కుగ్రా మంలో నివసిస్తోంది. వృద్ధాప్యం వచ్చినా, పనిపాటలు చేయవల సిన అగత్యం లేకపోయినా. ఊసుపోక వూరికే కూర్చోలేక, కాలం గడపక, ఇప్పటికీ ఏదో ఒక పనిచేస్తూ, ఎంతో కొంత సంపాదిస్తూనే వుంది. ఫ్యోడార్ అన్న పెద ఉద్యోగంలో వున్నాడు. గనుల ఇంజనీరు. కావలసినంత డబ్బు నెల నెల ముసలితల్లికి పంపిస్తున్నాడు. అయినా ముసలివాళ్ళ తీరే వేరు. ఏపనీ లేనిదే వాళ్ళకు పొద్దుపోదు.ఉన్న ఒక మేక, చిన్నబంగాళా దుంపతోట, మంచి, చెడ్డలు చూసుకొంటూనే, ఆ ముసలితల్లి యింకా పై పనులు కూడా చేస్తూ సంపాదిస్తోంది. ముసలివాళ్ళ ఓపికకు చెప్పుకోవాలి.

ప్రతినెల రెండుమూడు బిస్కట్ పొట్లాలు, రెండు మూడు వీశెల పంచదార, రెండుమూడు పౌనుల టీ పొడరు పట్టుకెళ్ళి, తల్లికిచ్చి వస్తుంటాడు. వెళ్ళినప్పుడల్లా కావలసిన కట్టెలుకొట్టి, తెచ్చి, పేళ్లువేసి, ఎండబెట్టి, తల్లికోసం భద్రపరు స్తుంటాడు. మేకకు కావలసిన మేత తెచ్చి పడవేస్తుంటాడు.

"ఒరే అబ్బాయ్, ఆఫీసాళ్ళతో మాట్లాడరా, నామాట విని, ఇక్కడకు బదిలీ చేయించుకో." అని ప్రతిసారీ తల్లి ప్రాధేయపడుతుంది. అయినా తల్లిమాటను ఫ్యోడార్ లెక్క పెట్టలేదు. ఇక్కడకు బదిలీకావటం నాకు యిష్టంలేదు పో అంటే తల్లి ఎక్కడ బాధపడి పోతుందోనని, "ఒప్పుకోరులేవే, అమ్మా" అంటూ ఫ్యోడార్ చిన్న అబద్ధం ఆడేస్తూవచ్చాడు.

ఫ్యోడార్ ట్రాక్టరు డ్రైవరు. తనవృత్తే సర్వస్వం అనుకొనే స్వభావం అతనిది. తల్లివున్న ప్రాంతం అంతా అడివి మయం. అక్కడ ట్రాక్టర్లతో ఆటే పనివుండదు. ఉన్న నాలుగు ట్రాక్టర్లు ఎక్కువకాలం షెడ్డులోనే వుంచవలసి వస్తుంది. అయినప్పుడు తాను అక్కడకు బదిలీ చేయించుకొని చేసేదేమిటి? సోమరిలాగా, సోంబేరులాగా తిని తిరగటమేగా? అని ఫ్యోడార్ తలపోస్తుండే వాడు.

ఎట్టకేలకు, ఏమైనా కానివ్వమని, ఫ్యోడార్ నిర్ణయించు కొన్నాడు: ఆమె వూరికి తరలివెళ్ళవలసిందే ఏమైనా సైషా పంతమే నెగ్గింది. ఫ్యోడార్ మెత్తపడక తప్పలేదు.

మిత్రులెవ్వరూ అతనిపెళ్ళికి రాలేదు. వారంతా ట్రాక్టర్ల మరమ్మతుల కార్యక్రమంలో మునిగి తేలుతున్నారు. క్షణం తీరికలేదు. చివరకు కొడుకు పెళ్ళికికూడా రాలేకపోయింది. రావటం మాటలా. అసలే అరవైయేళ్ళ ముసల్ది అందులో ప్రయాణ సౌకర్యాలు బొత్తిగా లేని ప్రాంతం. అందులో గొడ్డుచలి. రోడ్డుపై పడిగాపులు పడి, అదృష్టవశాత్తు దొరికే లారీలకోసం ఎదురుచూస్తూ, ఇత్యాది తిప్పలన్నీ అవ్వద్దురాలు పడగలదా?

ఫ్యోడార్ మాత్రం వూరుకున్నాడా? పెళ్ళికి తల్లిని రప్పించటమెలాగా అని చేయవలసిన యోచనలన్నీ చేశాడు. గుర్రాన్ని చూసి పంపి స్తే సరిపోతుందనుకొన్నాడు. క్రోమ్ స్తోవో క్షేత్రంలో గుర్రంకూడా. దానిని ఒకరోజు యివ్వమని అడుగుదామనుకొన్నాడు. కాని, ఆ క్షేత్రాన్ని వదిలిపెట్టి వచ్చినందుకు అక్కడి అధ్యక్షుమహాశయుడు తనంటే అసలే మండిపోతున్నాడు. ఇంకా గుర్రాన్ని ఇవ్వమని అడగటమెలా? వీల్లేకపోయింది. పోనీ, అత్తవారి వూరిలో గుర్రాన్ని పంపుదామంటే, నిన్నగాక మొన్న వచ్చిన తాను నోరుతెరచి ఎలా అడగ్గలడు? ఎంతగా యోచించినా లాభం లేకపోయింది.

పెళ్ళికానుకగా పెళ్ళికొడుకు తల్లి కడివెడు తేనె, పసందైన తేనె, పంపించింది. దానితోపాటు ఒక కూజానిండా నికారసైన బీరుని, పెళ్ళికూతురికి బహుమతిగా సిల్కుషాల్‌ని పంపించింది. చిన్నకోడలికి పెట్టాలని ఈషాల్‌ను అత్తగారు ఎంతకాలంగా దాసిందో? సుభాశ్శీసులు తెలియజేస్తూ చిన్న జాబుకూడా రాసింది: పెళ్ళి కాగానే కొత్తదంపతులు ఫొటో తీయించుకోవాలనీ, ఆ ఫొటో ప్రతి నొకదానిని తనకు పంపించాలనీ ఆ జాబులో ఆమె కోరింది.

ఫ్యోడార్ పెళ్ళికి అత్తవారి తరఫువారుకూడా అంతగా రాలేదు. ఊళ్లోవాళ్లే పదిమంది వచ్చారు. వచ్చినవాళ్ళంతా వివాహితులే. సాంసారిక అనుపానాలన్నింటినీ బాగా రుచిచూసిన అనుభవశాలురే. వచ్చినవాళ్ళంతా జంటలు జంటలుగానే వచ్చారు. పోతే, ఇగ్నాన్ మాత్రం తన ముసల్దానిని వెంటపెట్టుకు రాకుండా ఒక్కడే వచ్చాడు. అతని భార్య స్థానిక సమిష్టి

వ్యవసాయక్షేత్రానికి అధ్యక్షురాలు. పెళ్ళికి ఆమెనూ ఆహ్వానించారు. అయినా ఎందుచేతనో రాలేదు,

పసందైన ఫలహారాలతో, పంచభక్ష్య పరమాన్నాలతో, మంచిరకం మద్యపానంతో పెళ్ళివిందు జరిగింది. బహు నిరాడంబరంగా జరిగిపోయింది. పిల్లలు కొందరు బయటనుంచి, కిటికీల్లోంచి తొంగి తొంగి చూసిచూసి విసిగి, వేసారి. భయంకరమైన చలిని భరించలేక ఎవరియిళ్ళకు వాళ్ళు పెందరాళే వెళ్ళిపోయారు. మొత్తంమీద అర్ధరాత్రవన్నా కాకముందే పెళ్లితంతు ముగిసింది.

చివరకు తన పెళ్ళినాడుకూడా ఫ్యోడార్ డ్యాన్స్ చేయలేదు. అందుకు అవకాశం లేకపోయింది.

## 3

వివాహశుభముహుళ్ళు పడడంతో సంసారిక జీవితం ప్రారంభమవుతుందని భావించటం పరిపాటి. శాస్త్రరీత్యా దంపతులిద్దరు తమ పేర్లు నమోదు చేయించుకొంటారు. వేడుకలమధ్య వివాహం జరిగిపోతుంది. కొత్త కుటుంబం అవతరిస్తుంది.

అసలు ఏనాడూ ఫ్యోడార్ బుర్రకి తట్టనేలేదు: ఆలి దొరకగానే సరిపోదు; ఇల్లు సమకూర్చుకున్నప్పుడే దాంపత్య జీవితం ఆరంభమవుతుందని అతనికి తోచనేలేదు.

సంసారం అంటే మాటలా. ఎన్ని చూసుకోవాలి? మరెన్ని సమకూర్చుకోవాలి? వంటసామగ్రి. వంటదినుసులు,

వంటగది. పడకగది, మంచాలు, కంచాలు....ఎన్నెన్నో సంపాదించాలి. ఇవన్నీ ఏకరువు పెట్టితే చిత్రగుప్తుని చిఠా తయారవుతుంది. స్త్రేపాగానీ, ఫ్యోడార్ గాని ఈ గొడవలను గురించి ఇంతకుముందు అసలు యోచించనేలేదు. వీటినిగురించి తలపోయటమే వారికి తలనొప్పి పుట్టించేది. పెళ్ళయిపోతుంది. భార్యాభర్తల మైపోతాం హాయిగా జీవిస్తాం-ఇంతవరకే వారి ఊహాలు; ఇంతవరకే వారి కలలు. పెళ్ళిరోజుదాకా అలాగే భావించారు పెళ్లిరోజునా అలాగే అనుకొన్నారు, మొదటి రాత్రి ప్రణయరాత్రి, గడిపి, ఉదయానే లేచీ అలాగే ఊహించారు. కాని, ఏదో ఒకరోజున వారిద్దరు యిల్లు చూసుకోవాలీ; స్థిరమైన ఏర్పాట్లు చేసుకోటం తప్పదు. కొద్దికాలం కాదు: ఒకటి రెండేళ్లుకాదు; జీవిత పర్యంతం జరుగుబాటుకు ఏర్పాట్లు జరగాలి.

పూరింట్లో సగభాగం యువకజంటకు కేటాయించారు. తన సైకిలు పెట్టటానికి వీలుగా ఫ్యోడార్ వసారాలో చక్కని ఏర్పాటు చేశాడు. పడకగది టేబుల్ మీద రేడియోసెట్టు అమర్చాడు. ఒకరోజు ఉదయమంతా ఇంటి కప్పుపైకి ఎక్కి, మంచుదులిపి. రేడియోకు అవసరమైన ఏరియల్ కట్టాడు.

కట్నంక్రింద పురాతనమైన పెద్దభోషాణం ఒకదానిని స్త్రేపా తల్లిదండ్రులు యిచ్చారు. గతకాలపు అవశేషాలకు, విశేషాలకు ఆ చక్కని సాదృశ్యం తరతరాలబట్టి. అను వంశీకంగా, కట్నంరూపేణా చేతులుమారుతూ వచ్చిందా భోషాణం వెనకటిరోజుల్లో అల్లాంటి భోషాణం కల్గివుండటం గౌరవం; గొప్పతనం. దానిని తెరిస్తే చాలు దశాబ్దాలవాసన, నాటుపుగాకు కంపు, గతకాల ప్రాచీనసొంపు, యింపులు.... చెప్పతరంకాదు.

తొలిరోజున, క్రోమ్‌స్త్రావోలో నృత్యం జరిగినప్పుడు, స్తేషా నీలిసిల్కుదుస్తులు ప్రసారం చేసిన నాటుపొగాకు కంపు, ఫ్యోడార్ నాసికా రంధ్రాలను ఉక్కిరిబిక్కిరి చేసిన ఆ కంపు, ఈ భోషాణం పుణ్యమే. దీనిలో దాచుకొన్న దుస్తులన్నీ అలాంటి కంపు కొడుతుంటాయి.

తరతరాలకు చెందిన రకరకాల వస్తువులు ఆ భోషాణంలో భద్రంగా ఉన్నాయి. బూట్లు, కోట్లు, దుస్తులు, ఇత్యాది సరుకులు; ఎందుకూ పనికిరాని సరంజామా.

స్తేషా భోషాణంలోని పాతదుస్తులన్నీ తీసి, దొడ్డిలో ఎండలో పడేసింది. పాతఫ్రాక్ ఒకటి తీసి ధరించింది: బిగువైన ఆ ఫ్రాక్ చాటున దాగిన బిగువలైన ఆమె అవయవాలు కదలికలనీ మామూలీకంటికి స్పష్టంగా కన్పిస్తున్నాయి. స్తేషా పాత కోటు నొకదానిని తీసుకొని, గట్టిగా గుంజకేసి కొట్టుతూ దుమ్ము దులుపుతూంటే, కూతురిని తల్లి మందలించింది:

"అంత గట్టిగా కొట్టకేతల్లీ, కోటుకాస్తా చిరిగిపోతుంది; కోటు అంచుల్లోని లేసుకాస్తా పాడైపోతుంది."

స్తేషా తండ్రివచ్చి వాకిట్లో నిలబడ్డాడు; పళ్ళతో మీసాల కొనలు కొరుకుతూ నిలబడ్డాడు.

ఫ్యోడార్ తన విస్మయాన్నీ, అయిష్టతను ఆపుకోలేకపోయాడు; లోపల దాచుకోలేకపోయాడు; దొడ్లో ఆరవేసిన పాతదుస్తులవైపు వేలెట్టి చూపుతూ;

"అవ్వన్నీ మాకెందుకు చెప్పండి, ఆ దుస్తులు ధరించి, వీధిలోకి వెళ్ళామా, బుడబుక్కల వాడివెంట పడ్డట్టు, పిల్లలంతా

మా వెంట పడతాయి. కొనేవాళ్ళెవరైనా వుంటే వాటిని అమ్మేస్తే పోతుంది."

వృద్ధుని ముఖంలో ఆగ్రహం, ఆవేశం తొంగిచూశాయి.

"మాకు ఉన్న దాంట్లో, యివ్వగల్గిందేమో యిచ్చాం. ఇంతకన్నా మేము యిచ్చుకోలేం. నీకంత యిష్టంగా వుంటే కొట్లో పారేయ్ - అదంతా నా యిష్టం."

"పారేయటం ఎందుకు? పట్టణంలోని క్లబ్‌కు యిచ్చేస్తే, వాటిని వారు ఉపయోగించుకొంటారు. నాటకాల్లో కోమట్లు భార్యలకు దుస్తులుగా ఉపయోగిస్తారు."

"దానం చేయటానికి అవి నీవి కావు. వాటిని నీవేమీ సంపాదించలేదు. అవి మా అమ్మమ్మవి. మా తల్లికి యిచ్చింది. మాతల్లి నాకిచ్చింది. నేను నా చిట్టితల్లి కిచ్చాను. అలాంటిఅల్లిక ఈ రోజుల్లో ఎవరల్ల గలరు? ఉపయోగమట? ఉపయోగం! నాటకాలవాళ్ళకిస్తే ఉపయోగిస్తాయట" అంటూ స్తేషా తల్లి సాదించింది.

"అమ్మా, ఏమిటే, ఆయనేదో సవ్వు తాలకు అట్టుంటే.... అసలు నాటకాలవాళ్ళకు ఇవ్వెందుకూ పనికిరావు. అయినా మనమే కొన్నాళ్ళు వాటిని ఉపయోగించుకోవచ్చు" అంటూ స్తేషా సర్ది చెప్పింది.

"మా తల్లే,నీవు మంచి గృహిణివమ్మా. ఉత్తమ భార్యవి. సంసారాన్ని మా తల్లి చక్కగా చక్కదిద్దుకొంటుంది" అంటూ స్తేషా తల్లి మెటికలు విరిసింది.

ఫ్యోడార్ గ్రహించాడు. మామగారి మొఖంలో మెరిసిన ఆవేశం గమనించాడు. అత్తగారి కంటంలో పలికిన ఆగ్రహం

గుర్తించాడు. వారిద్దరి మనస్సులు నొచ్చుకున్నవని తెలుసు కొన్నాడు. అంతా ఒక చిన్న విషయంపై ఎంతగొడవ జరి గిందో చూశారా? నొచ్చుకోటాలు, మానసిక చిచ్చులు....అంతే గృహకలహాలు ఇలాగే వుంటాయి.

సాయంత్రమయేసరికి అంతా మామూలిస్థితిగతులన్నీ శుభ్రంగా వున్నాయి. పాచివూడ్చేసారు. స్త్రేషా స్నానంచేసి, తల దువ్వుకొని, శుభ్రంగా సింగారించుకొని, ముద్దుముచ్చటలు చిలికిస్తూ తయారైంది. ఫ్యాడార్‌కు నచ్చినవిధంగా పడకగదిని స్త్రేషా అలంకరించింది దీపకాంతిలో రేడియో సెట్టు తళతళ మెరుస్తోంది. అంతా హాయిగా, ఆహ్లాదకరంగా, నేత్రానందదాయకంగా వుంది. శృంగారరసానికి ఆ పడకగది శ్రుతి కలుపుతోందా అన్నట్టుంది.

పనిపాటలుచేసి, ఇంటికొచ్చిన ఫ్యోడార్ చొక్కావిడిచి, గదిని కలయచూసేసరికి...దేవేంద్ర భవనం అవతరించిందా అనిపించిందతనికి. అవును. ఇదీ దాంపత్యజీవితం. రేడియోసెట్టు టేబుల్‌లాంప్ ఇవన్నీ చిన్న చిన్న విషయాలే. అయితే ప్రతీ యింట్లో ఉండవలసినవి, బ్రహ్మచారి జీవితంబాధ తప్పిపోయింది. దాంపత్య సౌఖ్యం అనుభవిస్తున్నాడు. అందాలలోకంలో, ఆనందాల నాటకంలో ఫ్యోడార్ జీవిస్తున్నాడు.

స్త్రేషా మంచం అంచునే కూర్చుని, దువ్వెనతో తలచిక్కు తీస్తూ, రుసరుస లాడుతోంది స్త్రేషాను చూస్తుంటే, ఫ్యోడార్ మనస్సు పట్టరాని సంబరంతో చిందులేసింది. ఆమెను సమీపించాడు. గట్టిగా కౌగలించుకోబోయాడు.

"ఉండండి. ఒకక్షణం ఆగండి-దువ్వెన విరగ్గొట్టేసేట్టున్నారు" అంటూ స్త్రేషా అతన్ని ఎదిరించింది.

నిన్నటిదాకా అతని స్పర్శ తగిలితేచాలు, వణికిపోయే స్త్రీపా ఇవాళ అతన్ని నిర్భయంగా విదిలించేస్తోంది. ఒకే ఒక రాత్రి ప్రథమరాత్రి, తెచ్చినమార్పు ఇది.

ఫ్యోడార్ ఇందుకు విస్మయం చెందలేదు; బాధపడలేదు. వారు అప్పుడే భార్యాభర్తలుగా జీవించటానికి అలవాటు పడ్డారు. సంసారంలో ఇలాంటి విషయాలు అతిసాధారణం. ప్రణయకలహాలు లేకపోతే సాంసారిక జీవితం రక్తి కట్టదేమో!

# 4

క్రైగోరొదిషే మెషీన్ - ట్రాక్టర్ స్టేషన్‌లో పదిమందీ ఫ్యోడార్‌నుగురించి చెప్పుకోసాగారు. ఆ స్టేషన్ డైరెక్టరే స్వయంగా ఫ్యోడార్‌ను వెంటబెట్టుకొని విశేషాలన్నీ చూపించాడు. ఆఫీసుగది తలుపుబయట నిలబడివున్న ఫ్యోడార్ చెవిని, లోనజనం తననిగురించి చెప్పుకొంటున్న మాటలు సోకాయి;

"అతను ఇక్కడికెలా వచ్చాడు?"

"సుఖొచ్లినొవో పిల్లను పెళ్ళాడాడు. అత్తవారింటికి ఇల్లరికం వచ్చాడు."

"భేష్. బలేపిల్ల మనకు మంచి కార్యకర్తను సంపాదించుకొచ్చింది."

ఆ స్టేషన్ డైరెక్టరుపేరు అనస్తాస్ పావలొవిచ్. కంగ్ మనే అతని కంఠంనుంచి వెలువడే ప్రతిమాట ఆజ్ఞాపూర్వకంగా

ఆదేశాత్మకంగా ధ్వనిస్తుంది. అతని కదలికలో, నడకలో హుందాతనం ఉట్టిపడుతుంది. అయినప్పటికీ అతను ఫ్యోడార్‌ను ఆత్మీయతతో ఆహ్వానించాడు. పదినిముషాలన్నా గడవక పూర్వమే, "ఫెడ్యా" అంటూ ప్రేమపూర్వకంగా పిలవసాగాడు.

ట్రాక్టర్లతో నింపిన ఆ పెద్దఆవరణలో వారిద్దరూ జంటగా నడుస్తున్నారు :

"ఫెడ్యా, మన మెషిన్-ట్రాక్టర్ గురించి ఏమనిచెప్పను? ఆలనా పాలనాలేని అనాధగా తయారైంది. ఈ యంత్రాలను సరిగా ఉపయోగించుకోవాలన్న చింతగానీ, సరిగా వుంచాలన్న దృష్టిగానీ ఇక్కడ పనిచేస్తున్నవారిలో ఒక్కరికీ లేదుగదా, చూడు, ఈ ట్రాక్టర్ల బారు: ఎలా పడివున్నాయో చూడు; ఎండకు ఎండుతూ, వానకు నానుతూ సరియైన షెడ్డులేదు. పందపెట్టి ఆవునుకొని, పావలాపెట్టి కట్టుతాడు కొనటానికి వెనకాడాడుట వెనకటికి కొకరైతు. అలావుంది మన వ్యవహారం. నీవు కామ్సొమాల్ (యువక కమ్యూనిస్టు మండలి) సభ్యుడవు కనుక ఉన్న విషయాలన్నీ వున్నట్టు, దాపరికం లేకుండా చెప్పేస్తున్నాను. నీవు ఎలాంటివాడివో నాకు తెలుసు. నీ మనసు రూపురేఖలు నీ నయనాలలో గోచరిస్తున్నాయి. నీబోటివాళ్లు పదిమంది వుంటేచాలు. అసాధ్యాలను సుసాధ్యాలు చేయగలం."

ఇటికతో కట్టిన చిన్నమిద్దె ఒకటి ఫ్యోడార్ కంటపడింది. కమ్మరి కొలిమికన్నా హీనంగావుంది. మిద్దె తలుపు తెరచివుంది. లోన చీకటికోణం. ఆ చీకటి కోణంలో వెల్డింగ్ మిషన్ వున్నట్టుంది. కళ్ళు మిరుమిట్లు గొలిపే మెరుపు కాంతులు తళతళ మెరుస్తున్నాయి. ఆ మిద్దెప్రక్కనే కాంతిహీనమైన, వెలవెల

బోతున్న, బోసిగావున్న పొడుగాటి కొట్టాం ఒకటుంది బహుశా అది గుర్రపుశాలో, షెడ్డో కావచ్చు. అదేకాబోలు వర్క్ షాపు అనుకొన్నాడు ఫ్యోడార్. దానివెనుక నీలిరంగు, అరుణకాంతు లీనే నూర్పిడి యంత్రాలు బారులుతీరి వున్నాయి. ఆ యంత్రాలు మంచుకప్పుక్రింద మైమరచి నిద్రపోతున్నాయి.

అంతా బ్రాహ్మణ వ్యవసాయం, అనుకొన్నాడు ఫ్యోడార్. ఈ క్షేత్రానికి ఎందుకొచ్చానాఅని బాధ పడ సాగాడు. స్వర్గంలోనుంచి నరకంలో పడిపోయినట్టనిపించిం దతనికి.

స్టేషన్ డైరెక్టరు ఫ్యోడార్‌కు ఊరట కల్గిస్తున్నాడు

"చూడబ్బాయ్, నేనుకూడా ఈ క్షేత్రానికి నెలక్రిందటే బదలీ అయ్యాను. ఇక్కడ కార్యకర్తల అవసరాలను గురించి మంచిచెడ్డలను గురించి ఆలోచించే అధికారే కానరాడు. ఇది నాకు బొత్తిగా నచ్చదు. అసలు నాపద్ధతేవేరు. నీక్రింద పని చేస్తున్న ఉత్తమ నిపుణులకు కావాలసిందల్లా, అవసరమైతే తల తాకట్టు పెట్టయినా, తెచ్చి యిస్తూండు. అట్లుచేయుట మంచిది. పెట్టిన పెట్టుబడికి పదింతలు లాభం పొందుతావు.

అంతా సవ్యంగావుంటే కార్యం సాధించటం ఏమంత గొప్ప ? ఇక్కట్టులను ఎదుర్కొంటూ, ఇబ్బందులను సహిస్తూ, అవరోధాలను అధిగమిస్తూ ముందుకు సాగటమే పురుషలక్షణం; కార్యం సాధించటమే ధీశాలి కర్తవ్యం. ఏమైనాసరే, ఇక్కడే వుండి, దుస్థితిని సుస్థితిగా మార్చాలి – ఇదీ ఆలోచానంతరం ఫ్యోడార్ నిశ్చయం.

"ఇవిగో, నీ ట్రాక్టర్లు. ఆఁ ఒక డ్రైవర్ కూడా ఇక్కడే వున్నాడు. ఏయ్! చిజోవ్, ఇలారా. నేటినుంచీ ఇతనే మీ

టీము నాయకుడు. పేరు ఫ్యోడార్. బహుశా ఇతని పేరు వినేవుంటావ్. చాలా మంచివాడు. సరే, నేను పోతున్నాను. మీరిద్దరూ మంచిచెడులు మాట్లాడుకోండి."

ఫ్యోడార్ తో మరొకసారి కరచాలనంచేసి, స్టేషన్ డైరెక్టరు వెళ్ళిపోయాడు. చిజోవ్ ముఖం తిప్పేసుకొన్నాడు. క్రింద పడివున్న మసిబారిన పాతగుడ్డలుతీసి ట్రాక్టరు ముందుభాగాన్ని తుడుస్తున్నాడు.

స్తేషాను చూసి మోజుపడిన పాతప్రేమికుడు ఇక్కడే డ్రైవరుగా పనిచేస్తున్న సంగతి ఫ్యోడార్ కు తెలుసు. అయితే ఇలా జరుగుతుందని, పాతప్రేమికుడు, తాను కలిసి పనిచేయవలసివస్తుందని ఫ్యోడార్ కలలోకూడా ఊహించలేదు. అసలు ఆ పాతపురాణంగురించి అంతగా పట్టించుకోలేదు. ఏనాడో మర్చిపోయాడు.

"ఏయ్. నిన్నే! ఏమిటా ఎడమొఖం, పెడమొఖం? మొఖం చూపటానికి సిగ్గేస్తోందా, వీపు చూపుతున్నావు?"

"ఎం? ఎందుకు" అంటూ చిజోవ్ నొసలు చిట్లిస్తూ, ఫ్యోడార్ వైపు మొఖం తిప్పాడు.

"మొఖం చూపావ్. అదేచాలు మనిద్దరం పరస్పరం పరిచయం చేసుకొందాం. నా పేరు ఫ్యోడార్" అంటూ స్నేహహస్తం చాచాడు. చిజోవ్ ఒకటి, రెండు క్షణాలు తటపటాయించి, కష్టంగావున్నా, యిష్టం లేకపోయినా, కరచాలనం చేశాడు.

"సరే, నాకేం కావాలి? నేనేం చేయాలి?"

"ఎందుకొచ్చిన రుసరుస అని. వినమ్రత అందరూ అల వర్చుకోవలసిన ఉత్తమ లక్షణం, అని నా విశ్వాసం"

"నేను అంత తగనివాణ్ణే అయితే, నీకు అసలు నాతో మాట్లాడటమేల?"

చిజోవ్ నుళ్ళీ చింపిరిగుడ్డలు చేతపట్టాడు.

"ఇదిగో, మంచికో, చెడుకో, మనిద్దరం కలిసి పనిచేయక తప్పదు. అందుచేత మనసు మార్చుకో. మర్యాదగా మసలుకో సరే, ట్రాక్టర్ల మరమ్మతులు ఎంతవరకు వచ్చాయ్!"

చిజోవ్ ఓరగా తిరిగి, వర్కుషాపు కప్పుకేసి చూస్తూ సమాధాన మిచ్చాడు:

అప్పనవును మేము తమబోటి పెత్తందార్లను చాలా మందిని చూశాం. పనిఅంతా అయిపోయినతర్వాత దయచేస్తారు పెద్దలు: మహానుభావులు"

"ఇంతకీ మరమ్మతులన్నీ పూర్తయ్యాయన్నమాట. అంతేగా? అయితే నీవు తుడుస్తున్న ఈ ట్రాక్టరు మరమ్మతులు కూడా పూర్తయినట్టేనా?"

"లేదు ఇదొక్కటే మిగిలింది. మిగతావాటి మరమ్మతు లన్నీ పూర్తిచేశాం"

"ఏం పూర్తిచేయటం ? శీతాకాలం ముగుస్తోంది. మార్చి నెల రానేవస్తోంది. ఇంకా ఒక ట్రాక్టరు మరమ్మతులు పూర్తి కానేలేదు, ఇలాఅయితే లాభంలేదు. సరే. ఈ ట్రాక్టరు టాంకులో పెట్రోలు వుందా ?"

"వుంది. వర్కుషాపుదాకా నడవటానికి సరిపోతుంది."

"అయితే దీనిని స్టార్ట్ చేయి."

చిజోవ్ కిమ్మనకుండా నిలబడ్డాడు.

"నీవల్ల కాదల్లేవుంది. సరే తప్పుకో. నేను స్టార్టుచేస్తాను"

ఫ్యోడార్ ట్రాక్టర్ ఎక్కాడు. డ్రైవరు సీటులో కూర్చొని, స్టార్టర్ మీద చేయివేసి, వంట్లో శక్తినంతా ఉపయోగించి నొక్కాడు. పెద్దధ్వని చేసుకొంటూ, పొగలు చిమ్ముతూ, ఇంజన్ స్టార్ట్ అయింది. మళ్ళీ కొద్ది క్షణాలకే పడుకొంది.

"ఎక్కడుందీ లోపం?"

"నన్నడుగుతావే. నీవే పెద్దవి. నీకే తెలియాలి."

"అంతేగాని, ఆ ఇంజను మూత పైకెత్తు."

చిజోవ్ నెమ్మదిగా, చెప్పినట్టు చేశాడు. ఇంజను తీరు తెన్నులను ఫ్యోడార్ తిలకించాడు.

"ఏయ్. ఏమిటది ? ఇంజన్ని సరిగా తుడిచారా ? మీ ఆటలు నాదగ్గర సాగవు. నేను ట్రాక్టరు డ్రైవర్ని. వెర్రివెంగళప్పాయిని కాదు; మీరు చెప్పినమాటల్లా నమ్మటానికి. ఈ ఇంజన్ని, ముసలాడి బట్టతలవలె, తళతళ మెరిసేటట్లు, తుడవాలి. తెలిసిందా? చెప్పినట్టు చేయ్."

"ఆఁ తెలిసిందిలే"

"అయితే ఇంకేం చేయ్"

ఫ్యోడార్ జేబుల్లో చేతులు పెట్టుకొని, నిర్లక్ష్యంగా, మళ్ళీ వెనక్కు తిరిగనైనా చూడకుండా, వెళ్ళిపోయాడు.

నిజానికి మెషీన్ - ట్రాక్టర్ స్టేషన్‌లో అతను చేయ వలసినపని యింకాలేదు. అయినా అదీ ఇదీ జాగ్రత్తగా పరిశీ లిస్తూ, నలభై నిముషాలు అక్కడే గడిపాడు. వర్కుషాపులెలా వున్నాయో చూచాడు. తర్వాత ఆఫీసుకెళ్ళి కార్యదర్శి - టైపిస్టు పనులు రెండూ చూస్తున్నపిల్ల- మషింకాతో- కాసేపు పరియాసకమాడాడు.

మళ్ళీ చిజోవ్ ట్రాక్టరు దగ్గరికొచ్చాడు. అక్కడ చిజోవ్ లేడు. చెప్పిన పనిచేయకుండా వెళ్ళిపోయాడు. ట్రాక్టర్ యదాస్థితిలో వుంది.

వెతగ్గా వెతగ్గా చిజోవ్ వర్కుషాపులో దొరికాడు. ఒకమూల, లేత్ చాటున, చీకటిలో నక్కి కూర్చున్నాడు. చిజోవ్ నమిలేస్తాను, మింగేస్తాను, అన్నట్టు ఫ్యోడార్ వంక చూచాడు. ఫ్యోడార్ మాత్రం చలించలేదు. మాట్లాడ కుండా పోయి అతని ప్రక్కనే కూర్చున్నాడు. సిగరెట్టు వెలి గించాడు. అప్పుడు నెమ్మదిగా, తీవ్రతధ్వనిస్తూ అన్నాడు:

"ఇంతకీ నీ ఉద్దేశమేమిటి ? మనిద్దరం బ్రతికినంతకాలం పగబూని, బుసకొట్టుతూ జీవించవలసిందేనంటావా?

"ఎందుకు నీవు నన్నిలా వేధించుకుతింటావు? నీ మూలాన నన్ను బ్రతకనివ్వవా? నీకేంకావాలి ? క్షణంసేపు కూడా నన్ను ప్రశాంతంగా వుండనివ్వదల్చుకో లేదా ? పెద్దరికం వలకబోస్తూ, హుంకరించుతూ, గొంతు చించు కొంటూ ఇక్కడకు కూడా రావాలా?"

"శాంతించు ఆలోచించు. మనిద్దరం కలిసి పనిచేసేది ఒకటి, రెండురోజులు, వారం రోజులుకూడా కాదు. కలకాలం కలిసి పంచేయాలి. పాతస్పర్ధలన్నీ మర్చిపో. నీకు ఇష్టమున్నా లేకపోయినా పాతస్పర్ధలు మర్చిపోక తప్పదు. నీతో వాదులాడుతూ కాలం వృధా చేయదల్చుకోలేదు. నీకు తెలుసో, తెలియదో, నీకన్నా తలబిరుసుగాళ్ళనే నేను దారిలోకి తెచ్చాను."

జనం ఇటూఅటూ నడుస్తున్నారు. అయినా వారెవ్వరూ గుసగుసలాడుకొంటున్న వీరిద్దరిని గురించి అసలు పట్టించుకొన్నట్టేలేదు. "వాళ్ళిద్దరూ స్నేహితులుకాబోలు. సరదాగా ఒకరి సరసను మరొకరు కూర్చుని సిగరెట్టు కాల్చుకొంటున్నారు." అని చూసినవాళ్ళు అనుకొనివుంటారు.

"నీవు చూపుల్తో నామీద అగ్నివర్షం కురిపించి లాభం లేదు. దానివల్ల సాధించేది సున్న."

"నన్ను బెదరించాలని చూడకు. నీ బెదరింపులకు హడలిపోయే ఘటంకాదిది."

"నిన్ను నేను బెదరించటం లేదు. మంచిగా చెప్పి, తప్పించాలనుకొంటున్నాను."

స్టేషన్ డైరెక్టరు మరొక పెడ్డులోనుంచి వస్తూ, వీరిద్దరినీ చూశాడు:

"ఏం ? చలిమంట కాగుతున్నట్టున్నారు? తొందరగానే ఆత్మీయులై పోయారన్నమాట" అంటూ చిరునవ్వు ఒలికించాడు.

"మమ్మల్నిద్దరినీ వేరుచేయటం ఎవరితరం కాదు." అన్నాడు ఫ్యోడార్ గంభీరంగా.

"భేష్, భేష్. సరే, కాసేపు చలిమంట కాగి, మళ్ళీ పని ప్రారంభించండి."

డైరెక్టరు వెళ్ళిపోగానే ఫ్యోడార్ సిగరెట్ పీకని ఆవతల పారేసి, లేచి నిలబడ్డాడు :

"ఇక వెళదాం పద."

చిజోవ్ కూడా లేచి నిలబడ్డాడు. అతని కళ్ళుమాత్రం అధో ముకమైనవి.

## 5

క్రైగొరొదిషే గ్రామం వెలుపలనే, మెషీన్ - ట్రాక్టర్ స్టేషన్ ప్రక్కనే పాతస్కూలు భవనంవుంది. దానిని నిర్మించిన పుణ్యాత్ముడెవడో కాని, బడిపిల్లలకు చక్కని వెలుతురు గాలి ప్రసరించటానికి వీలుగా ఈ భవనం కట్టాడు. పిల్లలు ఆడుకోటానికి పచ్చగడ్డిపై, చెట్లనీడల్లో గంతులేస్తూ, పిల్లిమొగ్గవేస్తూ ఆడుకోటానికి- కావలసినంత ఖాళీస్థలం బడిచుట్టూ వుంది. చుట్టూ పొలాలున్నాయి. ఖాళీప్రదేశంలో ఏకాంతంగా వెలిసిన ఆ భవనం ఎత్తైన గోడలతో, పెద్దపెద్ద కిటికీలతో అలరారుతోంది. అయితే అన్నీ బాగానేవున్నాయి కాని, పెద్దలోపం

కూడా ఒకటి లేకపోలేదు. క్లాసు గదులకు పెద్దకిటికీలు అమర్చారు కాని, ద్వారాలుమాత్రం చాలా చిన్నవి. వేసవికాలంలో ఎండవేడిమి అంతా గదుల్లో నుండుతుంటుంది; క్లాసుగదులు కొలిమిల్లావుంటాయి. పోతే, శీతాకాలంలో ఆ గదులుమంచు కొండలను మరిపిస్తాయి. అందుచేత విధిలేక ఈ భవనం వదిలేసి, బడికోసం మరొకభవనం నిర్మించవలసి వచ్చింది. ఈసారి పాఠశాల భవనం ఊరిమధ్య కట్టారు. అది రెండంతస్థులిది. పాత భవనాన్ని మెషీన్-ట్రాక్టరు స్టేషన్‌కు యిచ్చేశారు. ఆ భవనంలో సగభాగం డైరెక్టరు, చీఫ్ మెకానిక్‌ల కుటుంబాలకు నివాసంగా కేటాయించారు. మిగతా సగభాగంలో డ్రైవర్లకు హాస్టల్ ఏర్పాటుచేశారు.

హాస్టల్ గదుల్లో గోడలప్రక్కనే వరుసగా బల్లలువేసి వున్నాయి. అవే పడకమంచాలు. ప్రతి గది మధ్యలో పెద్ద ఖాళీపీపా వుంది. 'చలిమంట' కోసం దానిని 'స్టౌ' గా మార్చి దానిని ఉపయోగిస్తున్నారు. ఈ మధ్య కొత్తచాపలు కొన్నట్టున్నారు. వాటిని బల్లలపై పరచివుంచారు. తలగడదిండులనేవి మచ్చుకైనా కానరావు.

ఆ రోజుల్లా ఫ్యోడార్‌కు నిద్రపోగానీ, ఇల్లుగానీ స్ఫురణకే రాలేదు. కాని, కోటును ముడిచి దిండుగా చేసుకొని, బల్లపై పడుకొని, కప్పుకేసి చూస్తుంటే, సొంతఇల్లు, ఇల్లాలు గుర్తుకొచ్చాయి. ఇవాళ సోమవారం మాత్రమే. ఇంకా అయిదురోజులు గడిస్తేగాని, ఆదివారం రాదు. ఆదివారం వస్తేగాని యింటికెళ్లి కొత్తపెళ్ళాంతో ముద్దుముచ్చటలాడటానికి వీలులేదు! ఇల్లాలిపై గాలి మళ్లింది. బెంగ పట్టుకొంది.

కిటికీ ఉపరిభాగంలో నుంచి కాళరాత్రి కారుచీకటి కన్పిస్తోంది. గదిలో ఒకమూలనుంచి "పాడిందే పాడరా పాచి పళ్ళదాసరి" అన్నట్టు ఒకేపాట విన్పిస్తోంది. ఆ గాయకునికి వచ్చిన పాట, నచ్చినపాట అదొకటే కాబోలు! కొంతమంది డ్రైవర్లు టేబుల్ వద్ద కూర్చుని భోజన కార్యక్రమం పూర్తి చేస్తున్నారు. టీ కప్పులు నిండుతున్నాయి; ఖాళీ అవుతున్నాయి.... ఫ్యోడార్ ఆలోచిస్తున్నాడు....బహుశా స్త్రేషా పడకగదిలో మంచం అంచుపైన కూర్చొని, దట్టమైన తన జుట్టుకు దువ్వెనతో చిక్కుతీస్తూ, రొప్పుకుంటూ, తనలోతాను విసుక్కుంటూ వుండవచ్చు. ఆ ప్రక్కనే రేడియోసెట్టు దీప కాంతిలో తళతళ మెరుస్తుంటుంది, కిటికీలకు తెరలు; అదీ తన యిల్లు. ఎంత సుఖంగా వుంటుందిక్కడ !

రేపు బజారులో కొట్లన్నీ గాలించి, చక్కని టేబుల్ లైట్ కొనాలి- అనుకొన్నాడు ఫ్యోడార్.

రేపు రానేవచ్చింది. టేబుల్ లైట్ మాట ఫ్యోడార్ మర్చిపోయాడు, దానిని కొనటానికి బజారుకు వెళ్లనేలేదు. చుట్టుప్రక్కల గ్రామాలనుంచి తన షాపుకు చెందిన మరొక ముగ్గురు డ్రైవర్లు వచ్చారు. వారు తమ ట్రాక్టర్లను మరమ్మతు చేస్తుంటే, ఫ్యోడార్ వారిపనిని తనిఖీచేశాడు, అందుచేత టేబుల్ లైట్ మాటే పూర్తిగా మర్చిపోయాడు.

ఏదో విచారం, ఏదో చింత ముప్పిరగొన్న చిజోవ్ తల ఎత్తకుండా, నోరు విప్పకుండా పని సాగిస్తున్నాడు. చెప్పినట్టు చేస్తున్నాడు. గొణిగితే వట్టు.

చిజోవ్ ట్రాక్టర్‌కు సరియైన ఆలనా, పాలనా లేక పోయినా కొత్తది కనుక, సంవత్సరం క్రిందటే తయారైంది ఆటే మరమ్మతులు అవసరం లేకపోయింది.

విచార గ్రస్థుడైన చిజోవ్, ముక్కు మొఖం ఎరుగని కొత్తవాళ్లే చుట్టూవున్నారు. ఈ వాతావరణం ఫ్యోడార్‌కు అంతగా నచ్చలేదు. ఇంటిమీదకి బెంగ మళ్ళింది. ఒక్కరోజు యింటిదగ్గర ఇల్లాలితో ముచ్చటగా గడిపివస్తే ఎంత బాగుం డును అనుకొన్నాడు. ఒక్కరోజు చాలు. మున్మాట అరవై అయిదు రోజులు పెళ్లాం కొంగుపట్టుకు తిరగాలన్నరంది తనకు లేదు ఒక్కరోజు సెలవుదొరికితే చాలు అనుకొన్నాడు ఫ్యోడార్

"కామ్రేడ్ ఫ్యోడార్"

ఫ్యోడార్ వెనుతిరిగి చూశాడు. మషెంకావచ్చి, వెనక నిలబడి, పిల్చింది.

"ఎవరో నీకోసం వచ్చాడు" అని ముక్తసరిగా ఆమె సమాచారం అందజేసింది.

"మషెంకా, పద. నీవు ఎక్కడికి తీసికెళ్ళినా, చివరకు నరకానికి తీసుకుపోయినా, నిన్ను అనుగమించటానికి నేను సిద్ధం."

"ఏమిటా మాటలు! ఇలాంటి ధోరణి నాకు బొత్తిగా నచ్చదు. మీ ఆవిడ వచ్చింది." అంటూ మెషెంకా మూతి విరుస్తూ, ఎడమభుజం కొద్దిగా ఎగరేస్తూ, గిర్రున తిరిగి, వెళ్లి పోయింది.

ఆఫీసు గదిముందు బల్లపై స్త్రేషా కూర్చునివుంది. కొత్త బూట్లు, కొత్తకోటు ధరించింది. తలకు శాలువా చుట్టుకొంది.

నందివర్ధన పువ్వులనుబోలిన ఆమెముఖం మాత్రమే కన్పిస్తోంది. ఉభయులు ఉప్పొంగేఆనందాన్ని గుండెల్లోనే అణచుకొంటూ, లాంఛనప్రాయంగా పరస్పరం మంచిచెడ్డలు, ముచ్చటలు మాట్లాడుకొన్నారు. మరిచుట్టూ ఇతరులు వుండిపోయారారాయె హద్దులుమీరితే వారంతా నవ్విపోతారు.

"మన వూరునుంచి ఇటొక లారీవస్తుంటే, అదెక్కి వచ్చాను." స్త్రేషాకు సిగ్గేసింది. పరాయివాళ్ళను ఎదటపెట్టుకొని, మొగుడితో మాట్లాడాలంటే మరి సిగ్గేయదూ?

"ఆ లారీ ఏమి మోసుకొచ్చిందేమిటి?" అని ప్రశ్నించాడు ఫ్యోడార్. ఆ లారీ ఏమి మోసుకొస్తే అతనికి ఎందుకో?

"ఏమీ మోసుకురాలేదు. ఖాళీగానే వచ్చింది."

ఇలా కొద్దిక్షణాలు మాట్లాడుకొని, పిమ్మట ఆలుమగలిద్దరూ ఆరుబయటకొచ్చారు. చుట్టూ ఎవరూ లేకపోవటం చూసి, స్త్రేషా భర్తభుజంపై వాలి, నెమ్మదిగా నడుస్తోంది.

"ఫెడ్యా, నిన్నువిడిచి వుండలేకపోయాను, పెళ్ళయిపట్టుమని పదిరోజులన్నా కాలేదు. ఇంతలోనే కొంప ముంచుకుపోతున్నట్టు నన్ను వంటరిగా వదిలేసి, ఇక్కడకు వచ్చావు"

"నీవన్నది నిజమే స్త్రేషా. నామట్టుకి నాకే నీ పై గాలి మళ్లింది. రేపు ఆదివారందాకా గడపటం ఎలాగా అనుకొంటున్నాను. నీకేం? నీవు యింటివద్దన్నా వున్నావు. నేనో, ఇక్కడ వంటరిగా వుండాలాయె."

"ఒకవారం రోజులు సెలవుపెట్టి రారాదూ? అయినా ఇతరులను అనే పనేముందిలే? మీరు మరీను, అంతా ముంచుకు

పోతున్నట్టు వచ్చేశారు. అసలు మనిద్దరం కలిసివున్నట్టనా్న లేదు.

ఆమె జేలగా, లాలనగా అతని ముఖంలోకి చూసింది. "నేనింక పసిపిల్లను కాను. పడతినన్నమాట మరువకు" అన్న భావం వ్యక్తంచేస్తూ. అతను ఆమెను యింటికాడ వదిలేసి వచ్చాడు- ఆమె తలక్రిందులై పోయింది. ఏమో, అతను మరొకపిల్లతో ప్రేమపురాణం సాగిస్తున్నాడేమోనన్న అను మానం ఆమెకు కల్గినా కలగవచ్చు. మగాళ్లు దేనికైనా సిద్ధమే. మగాళ్ళనునమ్మి వూరుకొనేందుకు వీల్లేదు అనే అపోహలో ఆమె పడివుండవచ్చు. ఆమెలోని అనుమానాలను, అపోహలను పారద్రోలేందుకు ఆమెను బలంగా కౌగలించుకొని, సందేహ భావంతో దోబూచులాడుతున్న ఆమె నేత్రద్వయంపై ముద్దుల వర్షం కురిపించుదామనుకొన్నాడు ఫ్యోడార్. కాని, అటు యిటు వస్తూపోతున్న జనం చూస్తుండగా, అలాంటి పని- బజా రులో భార్యను ముద్దెట్టుకోగల సహసం-చేయలేకపోయాడు.

"నిజం ; స్తేషా నీవన్నది నిజమే. తొందరపడి యిల్లు వదలి. రావటం తప్పే. మరికొన్ని కొన్నిరోజులు యింటిదగ్గరే వుండాల్సింది.

వారు ఆవిధంగా గంటసేపు ఆరుబయట అటూ ఇటూ తిరుగుతూ గడిపారు. ఇంటిగొడవలగురించీ, టేబుల్‌లైటును గురించీ, జబ్బుపడిన పందిపిల్లనుగురించీ, అది తిండితింటున్నదా అన్న విషయగురించీ ముచ్చటించుకున్నారు.

ఆ సాయంత్రమే ఫ్యోడార్ డైరెక్టరు ఆఫీసుకెళ్ళి, వారంరోజులు సెలవు మంజూరు చేయాలని కోరాడు.

"కొత్తగా పెళ్ళిచేసుకున్నావు. పెళ్లాంమీద గాలి మళ్ళిందా! బెంగ పుట్టిందా?" అంటూ డైరెక్టరు వరస పట్టించాడు.

"పెళ్ళాంపై గాలిమళ్ళడానికేమి వచ్చెగాని, అయినా మరమ్మతులన్నీ దాదాపు పూర్తయిపోయాయి. నేనిక్కడ వుండవలసిన అవసరంకూడా అంతగా లేదు."

"చిజనోవ్ టీముకు నాయకుడుగా నిన్ను నియమించాలనుకొంటున్నాను. ఆ టీముకుచెందిన ట్రాక్టర్లన్నీ సిద్ధంగా వున్నాయి. అవన్నీ కొత్తవికూడా."

"అంటే?"

"సరే, సరే. అర్ధమైందిలే. యింటికెళ్ళడానికి సెలవు యిస్తాలే. అయితే నీవు ఆ వూళ్లో పనిచేయవలసి వుంటుంది. సుఖొబ్లినోవ్ క్షేత్రం అధ్యక్షులను నీ వెరుగుదువా?"

"పేరైతే విన్నాను. వర్వారా స్తెపనోవా యేగా? అయితే ఇంతవరకూ ఆమెను కలుసుకోలేదు"

"ఆమె కష్టపడి పనిచేస్తుంది. శ్రద్ధగల మనిషి. అయితే మాత్రం లాభమేమిటి? ఆవ్యవసాయ క్షేత్రంలో పరిస్థితి అంత బాగాలేదు. నిరుటిసంవత్సరం అన్ని క్షేత్రాలలోకన్న, సుఖొబ్లినొవో క్షేత్రంలోనే ట్రాక్టర్లు హెచ్చుకాలం మూలపడివున్నాయి. ఆ తప్పంతా డ్రైవర్లదేననుకో. అందులో సందేహంలేదు. ఏమీ తెలియని కుర్రాళ్ళను తీసుకొచ్చి, ఒక సంవత్సరం శిక్షణ గరిపి, వారికి ట్రాక్టర్లు అప్పగిస్తే మరి ఏమౌతుంది? అయితే వర్కరు కుర్రాళ్ళను ఒక కంట కనిపెడుతుండాలి. అప్పుడప్పుడు

వాళ్ళచెవులు ఎక్కేస్తుండాలి. కాని ఆ పని ఆమె చేయటంలేదు. నేను స్టేషన్‌కు బదిలీ అయి ఎంతోకాలం కాలేదు. అక్కడ సంగతులు నాకు అంతగా తెలియవు. అయితే ఒకటిమాత్రం గట్టిగా చెప్పగలను. పొలాలలో వెదజల్లవలసిన పెంట పోగు పోగులు దొడ్లల్లో మూలుగుతున్నాయి. గుర్రాలతో ఎరువు తోలితే, ఆ కుప్పలు ఎన్నటికీ తరగవు. కనుక ఆ విషయంలో కాస్త సహాయంచేయి. పోతే, ఇక్కడ మరమ్మతులు పూర్తయ్యే దాకా నిన్ను ఇంటికి వెళ్ళనిచ్చేదిలేదు. ఇందుకు నొచ్చుకున్నా, మెచ్చుకున్నా ఇంతేసోదరా. నా నిర్ణయానికి తిరుగులేదు:

హాస్టల్‌లో అంతా మైమరచి నిద్రపోతున్నారు. చిజోవ్ మాత్రం భోంచేస్తున్నాడు. ఉడకబెట్టిన కోడిగుడ్లను ఉప్పులో నంజుకొని, తింటున్నాడు.

సతీమణి తెచ్చిన సరంజామాను ఫ్యోడార్ విప్పాడు: ఇంట్లో తయారుచేసిన వెన్నవుండలు, మాంసపుకూర. ఇతర వంటకాలు—చూస్తేనే నోరూరుతోంది.

"టీ వేడిగావుందా ?"

"లేదు. చల్లారిపోయింది" అని చిజోవ్ సమాధాన మిచ్చాడు.

"పెద్దచిక్కేవచ్చింది. సరే వీటిల్లోనీకుయిష్టమైన సరుకు తీసుకుతిను. రుచిస్తేనే తీసుకో. రుచించకపోతే, మానుకో.

"నాకు అవసరంలేదు"

"ఇంతకీ ఎంతకాలంఇలా గునుస్తుంటావో చెప్పు. నీవు తలక్రిందులుగా తపస్సుచేసినా, నన్ను సాధించలేవు. తెలుసా ?

ఇంత పొద్దుపోయేదాకా ఎక్కడ తిరిగొచ్చావ్, ఇప్పుడు భోంచేస్తున్నావ్?"

"సినిమాకు వెళ్ళాను"

"ఒంటరిగా నేనా?"

"లేదు, కొందరు కుర్రాళ్లూ, నేను కలిసి వెళ్ళా"

చిజోవ్ అబద్ధమాడాడు. నిజానికి మషెంకాతో కలసి సినిమాకెళ్ళాడు. ఆ సాయంత్రంనుండి వాళ్ళిద్దరూ — జంటగా తిరిగారు. వారిద్దరూ ఫ్యోడార్‌ను గురించి చర్చించి, వట్టి బడుద్ధాయని తేల్చారు.

ఆ రాత్రి "శత్రువు"లిద్దరూ బల్లలపై ప్రక్కప్రక్కనే పడుకొని నిద్దరపోయారు.

# 6

మామతో కలిసి ఫ్యోడార్ వేడినీళ్ళ స్నానం పూర్తి చేశాడు. పిమ్మట మామ అల్లుళ్ళిద్దరూ కాస్త సారా సేవించారు. ఫ్యోడార్ పాన్పుపై మేనువాల్చి, పుస్తకం చదువుతున్నాడు.

అందంలోనే ఆనందం. గదంతా పరిశుభ్రంగా వుంది. తలప్రక్కనే వున్న దీపం వినీ విన్పించని శ్రుతిలో గానం చేస్తోంది. ఆహా! ఎంతహాయిగా వుంది. ఇల్లు, ఇల్లాలు, బలే. కలకాలం కోరుకోదగ్గ దేవేంద్రభోగం.

ఫ్యోడార్ పుస్తకం చదువుతున్నాడన్న మాటేగాని, ధ్యాసఅంతా స్తేషాపైనే. గదిలోకి ఎప్పుడొస్తుందా, తనివి తీరా కౌగిలించుకుని, ఎప్పుడు ముద్దాడుదామా అని ఎదురు చూస్తున్నాడు. స్తేషా గాజుల సవ్వడి విన్పిస్తుందేమోనని చెవులు నిక్కబొడుచుకొని ఆలకిస్తున్నాడు. అదుగో వస్తున్నట్టుంది. మృదువైన పదధ్వని విన్పిస్తోంది. స్తేషా వస్తుంది. వచ్చి: "చదువు చాలించి, లేవండి. పొద్దుపోయింది. తొందరగా భోజనం పూర్తిచేసి వద్దాం" అంటుంది. ఆమె కంఠధ్వనిలో కొంత మందలింపు, కొంత గారాబం, కొంత ప్రేమ, కొంత వేడికోలు- అన్నీ సమపాళల్లో మిళితమైవుంటాయి. అవీ అర్ధాంగి కంఠధ్వని... ఇలా వూహించుకొన్నాడు ఫ్యోడార్. కాని, ఎంతకీ స్తేషా రానేలేదు. వచ్చి పిలవనేలేదు. ఫ్యోడార్ ఎదురుచూసి, విసిగివేసారి, మళ్ళీ పుస్తకం చదువులో పడ్డాడు.

నీకు నచ్చిన రచయిత లెవరయ్యా అని ఎవరైనా ప్రశ్నిస్తే, ఫ్యోడార్ టక, టక తనకు నచ్చిన రచయితల పేర్లు వల్లెవేస్తాడు. "టాల్‌స్టాయ్, చెకోవ్... గోస్తాల్ ఫ్లాబర్టు..." ఈ విధంగా ప్రముఖ రచయితల పేర్లన్నీ చెప్పుతాడు. చూడగా ఇతను ఘనపాఠిలా వున్నాడే" అని ఇతరులు అనుకోవాలి. అందుకే ఆ ఫ్యోడార్ ఆ పేర్లన్నీ అప్పజెప్పుతాడు. అదంతా తమాషాకోసం నిజానికి డ్యూమాస్, జ్యూల్స్‌వర్నె రచనలు మాత్రమే అతనికి బాగా నచ్చుతాయి. ఆ రచనలంటే పడి చచ్చిపోతాడు.

...స్తేషా వంటింట్లో, పొయ్యిదగ్గర కూర్చొని వంట పనులు చేస్తున్నదేమో? ఆ పొయ్యి వేడికి మృదువైన ఆమె శరీరం కమిలిపోదూ?... అయినా వంటపని ఇంతసేపా?...

నిజమే, ఇంటికొచ్చి, ప్రియురాలితో గడపటం ఆనంద దాయకమే. ఇల్లు వదిలి, మెషీన్ - ట్రాక్టరు స్టేషన్‌లో బల్లపై పడుకోటమూ సంతోషదాయకమే. కష్టమూ, సుఖమూ, దుఃఖమూ, సంతోషమూ, ఎడబాటు, కలియక- ఇవి ఒకదాని తర్వాత మరొకటి లభిస్తేనే జీవితం మధురంగావుంటుంది. ఎల్లప్పుడూ యింటిదగ్గరే వుంటూ, మెత్తని పరుపుపై వత్తిగిలి పడుకొని, ప్రియురాలి కౌగిలిలో కాలం వెళ్లబుచ్చితే- అవి కూడ కొంతకాలానికి చేదుగా మారుతుంది. అర్ధాంగిలో ఆకర్షణ తగ్గుతుంది. మనసు మళ్ళుతుంది. కాని, ఒక వారంరోజులు వర్కుషాపుల్లో పనిచేసి, కటికిబల్లపై నిద్రించి, స్తేషానుగురించి తలుచుకుంటూ, పిమ్మట ఇంటికొస్తే హృదయంలోనుంచి పెల్లుబికే ఆనందానికి పట్టపగ్గాలుండవు. అదే తమాషా.

ఫ్యోడార్ తెరచిన పుస్తకాన్ని తనగుండెలపై బోర్లించి, ఇంటి వాసాలకేసిచూస్తూ చిరునవ్వు చిలికించాడు.

స్తేషా ఐతే చప్పుడుకాకుండా గాలిలో ప్రవేశించింది.

"లేవండి. పొద్దుపోయింది. భోంచేద్దాం"

ఫ్యోడార్ నోరు మెదపలేదు. పెదిమికదపలేదు. అనిర్వచనీయమైన చిరునగవు మాత్రం అతని ముఖంలో మెరుస్తోంది. వంకెలు తిరిగిన జుత్తు అతని నుదురుపై నర్తిస్తోంది. అతను నిద్రాదేవి గాఢకౌగిలిలో వాలిపోయినట్లున్నాడు.

# 7

గేటుదగ్గరనుంచి యింటి గుమ్మందాకా గల దారిలో మంచుగడ్డలు తీసి, దారిశుభ్రపర్చి వుంది. ఆ మంచుగడ్డలను

ప్రహరీ గోడప్రక్కనే గుట్టపోశారు. వయసుమీరిన సిలాంతీ పెట్రోవిచ్ ఆ ఆవరణ మధ్యలో గొడ్డలిపట్టుకొని నిలబడి వున్నాడు. నెత్తిన అసహ్యామైన టోపీ ధరించాడు. మోరలెత్తి గేటువైపు దృష్టిని సారించాడు. పొడుగాటి పైన్‌ఉడ్ దుంగ ఒకటి అతని కాళ్ళవద్దపడి వున్నది.

అప్పుడే తెలతెలవారుతోంది. అప్పటికే అతను దారిలో మంచుగడ్డలు తీసివేశాడు; దారిచుట్టూ గల చెత్తాచెదారాన్ని ఏం, శుభ్రపరిచాడు. చివికిపోయిన గేటును తీసివేసి, దానిస్థానే కొత్తదానిని ఏర్పాటుచేస్తే బాగుంటుందని ఆలోచిస్తున్నాడు. ఫ్యోడార్ ఆత్మకలత చెందింది- వృద్ధాప్యం వచ్చిన పెట్రోవిచ్ తెల్లారగట్టే లేచి పనిచేస్తుంటే, తానింకా దుప్పటితన్ని నిద్ర పోవటమా? ఎంత సిగ్గుచేటు? అనుకొన్నాడు.

ఇంతకుముందే సిలాంతీ పెట్రోవిచ్ అలవాట్లను ఫ్యోడార్ కొంతవరకు కనిపెట్టాడు. పొరుగుయింటికి వెళ్ళి, పలకరించిరావటం చూశాడు. రోడ్డుమీద దొరికిన గుర్రపునాడా చేతపట్టుకురావటం చూశాడు. ఇలాంటి పాతసామాన్లు, సరుకులు దాయటానికి ఒక పొడుగాటి పెట్టె వసారాలోవుంది. సిలాంతీ పెట్రోవిచ్ బ్రతికివుండగా ఈ పాతసామాన్ల అవసరమే రాకపోవచ్చు. అయినా ఎవరు చూడొచ్చారు? ఎవరు చెప్ప గలరు? ఒకనాటికి వీటి అవసరం వస్తుందేమో? ఆ పెట్టె అక్కడ వుంటే నష్టమేమిటి? దారికి అడ్డంలేదుగా?

ఫ్యోడార్‌కు తెలుసు; తాను నోరుతెరిచి అడిగితేచాలు: "మామా" చిన్న మేకువుంటే యిస్తావా? అద్దంక్రింద, గోడకు ఫొటో తగిలించాలి. స్త్రేషా గొడవచేస్తోంది. అని అడగటమే పెట్రోవిచ్ తన పెట్టెలోంచి మేకుతీసి యిచ్చేస్తాడు.

పెట్రోవిచ్ సునాయాసంగా పైన్‌దుంగను అటూ యిటూ కదుపుతూ, చక్కగా చెక్కుతూ, బొడుపులు అవీ లేకుండా చిత్రిక పడుతున్నాడు. వసారాలో నిలబడిచూస్తున్న ఫ్యోడార్‌కు ఆశ్చర్యమేసింది: చూడు, ఆ దుంగ ఎంత పెద్దదో. అయినా పెట్రొవిచ్ వానిని ఆటవస్తువులాగా అటూయిటూ సునాయాసంగా తిప్పేస్తున్నాడు. ఆ వృద్ధునికన్నా నేను కండపుష్టి కలవాణ్ణే. అయినా ఆ పని నేను చేయగలనా? ఏమో అనుమానమే.... గొడ్డలివ్రేటులు ... చెదురుతున్న పసుపుపచ్చని బెరడులు ...

"మామా, ఏదీ ఆ గొడ్డలి కాస్త యిటివ్వు. యింత వయస్సులో నీవేమి కష్టపడతావులే" అన్నాడు ఫ్యోడార్.

"ఎందుకులే నాయనా, ఇదెంతపని, అరగంటలో పూర్తి చేస్తా."

సిలాంతీ పెట్రోవిచ్ ఆజానుబాహుడు. విశాలమైన ఛాతీ. ఇంకా నడుం వంగిపోలేదు. కమ్మెచ్చున తీసిన కడ్డీలా, యువకునివలె నడుస్తాడు. కష్టజీవి, అసలు ఈ కుటుంబమంతా వళ్లువంచి కష్టపడేబాపతు అనుకొన్నాడు ఫ్యోడార్ ముందుకు సాగుతూ.

వర్వారా స్త్రెపనోవా వ్యవసాయక్షేత్ర కార్యాలయంలో లేనందున ఫ్యోడార్ పొలాలవైపు బయలుదేరాడు.

ఇక్కడ పరిస్థితి అంత బాగాలేదు. ఖోమ్‌స్తొవో పరిస్థితే వేరు అనుకొన్నాడు ఫ్యోడార్.

గొడ్లసావిడి ఆవరణలో కొండంత పెంటపోగు వుంది. ఆ పోగుపై మంచు పేరుకొంది. ఆరిభగవంతుడా, వేసవి కాలంలో

ఈ పెంటకుప్పను ఇలాగే వుంచుతారుకాబోలు. పంటపొలా లలో వెదజల్లవలసిన ఈ పెంటపోగు, ఇక్కడ కంపుకొట్టుతూ ఇలాగే వుంటుంది కాబోలు. ఈగలూ, దోమలూ ముసురుతూ వుంటాయి. పైగా తాము రైతులమని చెప్పుకొంటారు, సిగ్గు లేకపోతే సరి అనుకొన్నాడు ఫ్యోడార్.

ఆ ప్రక్కనే కొందరు స్త్రీలు లారీలోంచి ఎండుగడ్డిని దింపుతున్నారు. పొట్టికురస మహిళ ఆ లారీపై ఎక్కి, నాలు గేసి గడ్డిపరకులు క్రిందకు అందిస్తోంది. చేతులకు జోళ్ళు తగి లించుకోలేదు. అందుచేత మృదువైన చేతులు బాగాకందిపోయి, ఎర్రబడ్డాయి.

"ఇదిగో అందుకోండి. ఇదుగో, తీసుకోండి" అంటూ ఆమె అరుస్తోంది. మరిద్దరు మహిళలు హడావిడిగా ఇటూఅటూ తిరుగుతున్నారు. పని తక్కువ, హడావిడి ఎక్కువ.

"పని బాగా సాగుతోందా? అన్నట్టు వర్వారా స్తెపనోవా ఎక్కడున్నట్టు? మీకు తెలుసా?" ప్రశ్నించాడు ఫ్యోడార్.

లారీపైనుంచి గడ్డి అందించుతున్న మహిళ కొంచం కాఠిన్యం కలిపిన కంఠధ్వనితో "ఏం ? ఎందుకు" అన్నది.

"ఆమెతో మాట్లాడవలసిన పనుంది."

"ప్రస్కోవ్యా, ఇలావచ్చి గడ్డి అందించు" అని పని పురమాయించి, ఆ మహిళ లారీ పైనుంచి క్రిందకు దిగుతూ తన లంగా అంచులు ఎక్కడ గాలికి ఎగిరిపోతాయోనని, గట్టిగా, రెండుకాళ్ళచుట్టూ మడిచి పట్టుకొంటూ క్రిందకు దిగివచ్చింది. ఫ్యోడార్ ఎదురుగావచ్చి నిలబడి, ఎగాదిగా

చూసింది. టోపీ దగ్గరనుంచి బూట్లుదాకా పరికించింది. ఆమెను దగ్గరగాచూసిన ప్రతివారికీ కలిగే అభిప్రాయం ఒకటే: "వస్తాదురా". ఆమె చాలాపొట్టి. ఫ్యోడార్ బుజాలంత ఎత్తు కూడా లేదు. విశాలమైన ముఖం. స్త్రీత్వంకన్నా పురుష లక్షణాలే జాస్తి. విశాలమైన మొఖంలో మెరిసే, చురుకైన, చిన్నచిన్న గోధుమవర్ణపు కళ్ళు పెద్దచేతులు; భారీచాతీ. అందవిహీనమైవ దుస్తులు ధరించింది.

"వర్వరా స్తెపనోవోను నేనే. ఏమిటి విశేషం? చెప్పు"

క్రోమ్‌స్తొవో సమిష్టి వ్యవసాయక్షేత్రం అధ్యక్షుడు పాలెక్ పాలికార్‌పవోచ్ తీరే వేరు; తరాహోయే వేరు. అతను పొట్టిగా, బక్కపలచగా వుంటాడు. చాలా మర్యాదస్తుడు. అతని ముఖకవళికలో, కదలికలో, పదఘట్టనలో పెద్దమనిషి తరహా ఉట్టిపడుతుంది. అతి నెమ్మదిగా మాట్లాడుతాడు. ప్రతి వారినీ "ఏరా, బాబు" అని పలకరిస్తాడు. "ఏరాబాబు" అని పలకరించే వ్యక్తి పాలెవ్ పాలికార్‌పోవిచ్‌కన్నా అనేక సంవత్సరాలు పెద్దకావచ్చు; గడ్డం అదీ తెల్లబడి వుండవొచ్చు. అయినా అతని పలకరింపు ఆవిధంగానే వుంటుంది. కాస్త మెచ్చుకొంటే చాలు, ఉబ్బితబ్బిబైపోయే స్వభావం. కొంచె మందలిస్తే, పెద్దతప్పు చేసినట్టు సిగ్గు పడతాడు.

"నాపేరు ఫ్యోడార్, ట్రాక్టర్ టీము నాయకుణ్ని."

"ఓహో, సిలాంతీర్యాపిన్ అల్లుడివా?"

"అవును"

వర్వరా స్తెపనోవా అతనివంక కొరకొరచూసింది.

"వాళ్ళు అదృష్టవంతులు. నీబోటివాడిని అల్లుడుగా పొందారు, స్త్రీషా చూడటానికి అందంగా, ఆకర్షణీయంగా, బొద్దుగా, ముద్దుగా, పాలు, తేనెమయంగా.... మరి దాంపత్య జీవితం స్వర్గతుల్యంగా వుందా?"

"దాన్ని వదిలేసి, మరొకదానిని కట్టుకోవాలన్న తలంపు యింతవరకు లేదు"

"శుభం. సరే, ఇంతకీ నీవచ్చిన పనేమిటి?"

"గొడ్లపాకకు ఎదురుగా అంతఎత్తు పెంటకుప్ప పడి వుందేం?"

"పొలాలకు తోలిస్తాను"

"మా తోడ్పాటు అవసరంలేదా? వంద టన్నుల ఎరువును పొలాలకు తోలాలని ట్రాక్టరు కాంట్రాక్టులో వుందిగా"

"ఎందుకో నీకంత కంపరం? ఈగలు నీచుట్టూ మూగటం లేదుగా? అయినా పదిపారలు ఎరువువేసి అదొక బండిబరువు అంటారు మీరు. మీరు తోలే బరువు ఎంతో, తూకంవేసే లెక్కలురాసే వాళ్ళుండొద్దూ? ఇన్ని మైళ్ళ దూరానికి ఇన్ని టన్నుల ఎరువు తోలినందుకు ఇంతసొమ్ము చెల్లించుకోండి అంటూ బిల్లు పంపిస్తారు. ఆ బిల్లు చెల్లించుకొనేసరికి మా తాడు తెగుతుంది"

"వర్ధ్వారా స్త్రైపానోవా, సమష్టి వ్యవసాయక్షేత్రాల అధ్యక్షులలోకూడా పాతబాపతు వారున్నారు. కొత్తతరహా వారున్నారు. ఇవి నాకు తెలియని విషయం కాదు" ఈసారి ప్యోడార్ ఆషామాషీ ధోరణిలో కాక, చాలా నిక్కచ్చిగా

మాట్లాడాడు. వర్వరా స్తెపనోవా తదేకంగా ఒకేవైపు చూస్తూ వింటూన్నది.

"పాతరకం ... కొత్తరకం...మీరు ఎప్పుడూ ఇంతే. ఎదటివాళ్ళలో నెరుసులు వెతకటంలో మొనగాళ్ళు. ఇతరులను తప్పుపట్టేముందు, మీ తప్పులేమిటో తెలుసుకోటం మంచిది. సరే, ఇప్పుడే ఖచ్చితంగా చెప్పుతున్నా. నిండా ఎరువువేసి తోలకపోతే నేను ఒప్పుకోనేదిలేదు. ప్రతీ ట్రాక్టరు నిండిందా లేదా అని నేనే తనిఖీ చేస్తాను. తర్వాత మీ యిష్టం"

"మాటలెందుకు, చేతలు ముఖ్యం. నేనిప్పుడే వ్యవసాయ శాస్త్రనిపుణ్ణి కలుసుకొని, ఏఏ పొలాలకు ఎరువు తోలాలో కనుక్కొని వచ్చాను. గుర్రాన్నొక దానిని యిప్పించండి."

గుర్రపుసాలకు వెళ్ళి, నేను చెప్పానని చెప్పి, 'వాసిక మోక్'ను తీసుకెళ్ళు."

ఫ్యోడార్ గుర్రపుసాలకు వెళ్లాడు. గుర్రపుసాల కాపలాదారు గుడిసె గుర్రపుసాల ఆవరణలోనేవుంది. ఆ గుడిసెలో సిలాంతీపెట్రొవిచ్, మరొకవ్యక్తి బరువైన ఉన్నిదుస్తులు ధరించి సిగరెట్లు కాల్చుకుంటూ. కూర్చొని కబుర్లు చెప్పుకొంటున్నారు. ఇంటిదగ్గర క్షణంసేపుకూడా వూరికే కూర్చోని సిలాంతీ పెట్రోవిచ్ ఇక్కడ అచ్చం సోమరిపోతులాగా, కాలు మీద కాలువేసుకొని, నిబ్బరంగా కూర్చోటంచూసి ఫ్యోడార్ విస్మయంచెందాడు.

"'వాసిక్ యోక్' గుర్రంకావాలి దానిని తీసుకువెళ్ళమని వర్వారా సైపనోవా చెప్పింది" అన్నాడు ఫ్యోడార్.

"లోపలవుంది. వెళ్ళి ఊడదీసుకురా. జీను, అవీ ఈ బల్ల క్రిందవున్నాయి" అని సెలాంతీ పెట్రోవిచ్ సమాధాన మిచ్చాడు.

ఫ్యోడార్ వంగి, బల్లక్రింద చూశాడు. "జీను, అవీ" అన్నీ కుప్పపోసి వున్నాయి. తీగలాగితే డొంకంతా కదిలినట్లు, ఒక వస్తువుతీస్తే మిగతావస్తువులన్నీ దానివెంటే ఈవలకు వచ్చాయి.

"ఆరిభగవంతుడా, ఇదేమిపద్ధతో! బ్రాహ్మణ వ్యవసా యమే నయమనిపించేట్టుంది. ఒకవాసం తెచ్చి, దండెంకట్టి వాటిని ఆ దండెంపై వుంచరాదూ!" అన్నాడు ఫ్యోడార్.

"ఆపని చేయమని ఎవరైనా చెప్పితేగా?" నిమ్మకు నీరెత్తినట్లు తొణకగుండా, బెణకకుండా సమాధానమిచ్చాడు పెట్రోవిచ్.

"ఇతరులు చెప్పాలేంటీ? దొడ్లో కావలసినన్ని వాసాలు పడి మూలుగుతున్నాయి. ఒకటి తెచ్చి దండెం కట్టరాదూ? మీరు కట్టకపోతే నేనన్నా కట్టి వెళ్ళతాను"

"చిత్తం, చిత్తం పెట్టినదొబ్బులు చాలు. మరొక నిఘా మాను తయారు. అంతా మానెత్తికెక్కి పెత్తనం చేసేవారే"

రెండవవ్యక్తి లేచి నిలబడి, ఫ్యోడార్ వంక అదొక మాదిరిగా చూశాడు.

"ఆయన అన్నది నిజమేమరి. ముల్లుకర్ర పెట్టి పొడిచే దాకా మనం కదిలినపాపాన పోమాాయె. ఏదీ ఆ గొడ్డలిటివ్వు. వాసం నరికి తెస్తాను"

"అక్కర్లేదు. నాకూ వున్నాయి రెండుచేతులు. దేవు డిచ్చిన చేతులకు యింకా రోగంరొప్పు రాలేదు. నీ సాయం అక్కర్లేదు"

సలాంతీ పెట్రోవిచ్ ముప్పిరిగొన్న కోపంతో చివాలు నలేచాడు. గబగబా బయటకు పోయి, అర్ధణా మందం మంచు పేరుకొన్న, వెండిలా తళతళ మెరుస్తూన్న వాసం తెచ్చాడు.

"నీవు నాకు నీతులు గరపనక్కర్లేదు, ఫ్యోడార్. నీ బోటి కుర్రకుంకలా మాపై జులుం చలాయించేది!'

గుర్రంపై స్వారీచేస్తూ, ఫ్యోడార్ అదేపనిగా ఆలో చించాడు: తన మామ చాలా విచిత్రమైన మనిషి. ఇంటిదగ్గ రున్నంతసేపు, క్షణంతీరిక లేకుండా, ఏదో ఒకపని చేస్తూనే వుంటాడు. కాని, సమిష్టి వ్యవసాయక్షేత్రంలో మాత్రం దమ్మిడీపని చేయకుండా వూరికే కూర్చొని కాలక్షేపంచేస్తాడు. మానవ స్వభావాలు ఎంత విచిత్రమైనవి? ఎంత భిన్నమైనవి!

ఫ్యోడార్ తిరిగొచ్చేసరికి చీకటిపడింది. గుర్రాన్ని సాలలో కట్టేసి, గడ్డితో గుర్రంవల్లంతా తుడిచి, జీను మెడపై వేసు కొని తలుపుదగ్గరి కొచ్చేసరికి మామ బిగ్గరిగా అరుస్తుం డటం విన్నాడు. ఆ మాటలు ఆలకిస్తు అలాగే కాసేపు నిలబడి పోయాడు.

"వీల్లేదు. నేను చేసిన అదనపుపనికి డబ్బు చెల్లించాలి. లేకపోతే వూరికే చేస్తాననుకొన్నారా? నిజంగా సిగ్గుచేటు. ఇంతకుముందు ఈగుడిసె ఎంత అసహ్యాకరంగా వుండేది? సామాన్లన్నీ చెల్లాచెదురుగా, ఇక్కడా అక్కడా పడవేసి

వుండేవి. నేను వీటన్నిటినీ ఎంత చక్కగా సర్దానో, అమర్చానో ఒకసారి లోనికివచ్చి చూడు"

"రెండు మేకులు కొట్టి, దండెం కట్టేవో లేదో, దానికి బేరం మొదలెట్టావ్?" అని రెండో కంఠం కటువుగా మారు పలికింది.

"నేను బేర మాడటం లేదు. నేనుచేసిన పనిని ఖాతాపుస్తకంలో రాయండి అలా రాయాలని అడిగేహక్కు నాకున్నది. ఇప్పటివరకు దాని విషయం పట్టించుకొన్న నాథుడే లేడు. పనిమాల పనిచేసి పెట్టినందుకు మెచ్చుకోటంపోయి, నాకు న్యాయంగా ముట్టవలసిన డబ్బును ఎగగొట్టాలని చూస్తావా?"

"ఆ మాటకొస్తే, నీవాపని చేయకుండా వుంటేనే బాగుండేది."

ఫ్యోడార్ పని ముందు నుయ్యి, వెనుక గొయ్యి చంద మైంది ముసలాడు వెనక్కు తిరిగేచూస్తే ఏమవుతుంది! తన అల్లుడే దొంగచాటుగా పొంచి, ఈ సంభాషణ వింటున్నాడు అనుకొని బాధపడవచ్చు. అందుకే ఫ్యోడార్ పిల్లిమాదిరిగా, నడుచుకుంటూ, మారుకంట పడకుండా వెనుతిరిగి వెళ్ళి పోయాడు. బతికిపోయాను భగవంతుడా అనుకొన్నాడు.

ఇది సిగ్గుపడవలసిన విషయంగా సిలాంతీపెట్రోవిచ్ కి తోచలేదు. ఆవ్వాళరాత్రి యింటికిరాగానే, కోపోద్దీప్తుడై, కోటు గుండీలు విప్పుతూ అల్లుడితో అన్నాడు:

"లేనిపోని ఆశలు పెట్టుకోకు ఫెడ్యా. చివరకు ఆశా భంగం పొందుతావు. నీవు వళ్ళు విరుచుకొని పనిచేసినా, నీకు

బోనసు యివ్వరులే. వాళ్ళకు కావలసిందల్లా అరవచాకిరీ. జనం చేత గొడ్డుచాకిరీ చేయించటమే వాళ్ళపని'' అన్నాడు మామ

బక్కెట్టుతో ఆవుకు కుడితి తీసుకెళ్లుతూన్న అత్తగారు-. అల్వితీనా ఇవానోవా - ఆగి భర్త మాటలు విని, ప్రశ్నించింది:

"మళ్ళా యిప్పుడేమి వచ్చిపడిందండీ''

"ఏముంది! మామూలే. చేసినపనికి మెప్పు లేకపోగా, తల బొప్పికట్టింది. వాళ్ళకు పని చేసిపెట్టినా, చేసినదానికి డబ్బు యివ్వరట''

"అసలు మీరు వాళ్ళకు పని ఎందుకు చేసిపెట్టారు?''

"పని ఎగ్గొట్టటం నాచేతకాదు. పని చేయకపోతే, దేశానికి ద్రోహం చేసినట్లుగా నేను బాధపడతాను:''

"అదే మీలోని బలహీనత. అలాంటి బుద్ధీ, అలాంటి బాధా వర్వారాకు వుందీ? ప్లెడ్జి చేసిపెట్టనని మీరన్నప్పుడు ఆమె అన్నమాటలు మీకుగుర్తు లేవూ?'';

"ఎందుకు గుర్తులేదు? అసలు మన సమిష్ఠి వ్యవసాయ క్షేత్రంలో ఎప్పుడూ యింతే. పనిచేయటమంటే, చేజేతులా తువరం చేయించుగోటం వనుకో. పని చేయకపోయామా తిట్టిపోస్తారు.''

"ఇది కొత్తేమిటి?''

మామగారి కోరచూపుల్లో క్రోధాన్ని ఫ్యోడార్ గమనించాడు. ఎంతో నిక్కచ్చి మనిషి, ఇంత స్వల్పవిషయానికి, అంత రగడ చేయటమా అని అతను విస్మితుడయ్యాడు. తన

తండ్రి ప్రవర్తనకు స్త్రేపా బాధ పడుతుండాలని ఫ్యోడారు భావించాడు. ఒకసారి దృష్టిని ఆమెపైకి దొంగచాటుగా విసిరాడు. అసలు ఆమె ఈ విషయం పట్టించుకున్నట్టేలేదు. తల వంచుకొని వడ్డన యేర్పాట్లు పూర్తిచేస్తున్నది. స్త్రేపా తన తల్లిదండ్రులతో ఎప్పుడూ ఏ విషయంపైన వాదన పెట్టుకోటం ఫ్యోడార్ చూసి ఎరుగడు. తల్లిదండ్రులమాట కెదురు చెప్పలేని బేల స్త్రేపా.

ఫ్యోడార్ తన పడకగదికి పోయి, రేడియో పెట్టుకొని, మాస్కో కేంద్రంనుంచి ప్రసారమైన విశేషాలు వింటూ, పొద్దు పోయేదాకా కూర్చున్నాడు. స్త్రేపా హంసవలె నడుచుకుంటూ గాలిలో ప్రవేశించగానే అతనిలో రగులుతున్న అసహనం కాస్తా చల్లారిపోయింది. స్త్రేపా తనచెంత వుండగా ముసలివాళ్లు ఎంతగా గొణిగితేమాత్రం లెక్కేమిటి? అసలు ముసలాళ్లంతా ఇంతే అనుకొన్నాడు ఫ్యోడార్.

# 8

రోజులు గడిచినకొలదీ ఫ్యోడార్ అన్నింటికీ అలవాటు పడిపోయాడు. క్రైగొరొధిషే మెషీన్ - ట్రాక్టర్ స్టేషన్ తన సొంత వర్కుషాపు అయింది. చిజోవ్ ఆప్తమిత్రు డయ్యాడు.

తద్వారా వర్వారా స్త్రేపనోవాను అతసు ఇప్పుడిప్పుడే అర్థంచేసుకోగలుగుతున్నాడు. మొదట్లో అతనికి ఏమీ అంతు చిక్కేదికాదు: ఆమె చాలా నిక్కచ్చి మనిషిగా కన్పించేది. ప్రజలుఆమెను గౌరవిస్తారు.ఆమెఅంటే భయపడేవారు. అయినా

వ్యవసాయ క్షేత్రంలో అన్నీ అవకతవకలే; అంతా గందర గోళమే. ఫ్యోడార్ ప్రత్యేకశ్రద్ధ తీసుకొని, చిన్నచిన్న కొండ లంత ప్రమాణంలోవున్న ఆ పెంటపోగులను ట్రాక్టర్లతో పొలా లకు తోలకపోతే, అవి దొడ్లల్లో యింకాముూలుగుతూనే వుండేవి. మొదట్లో అంతు చిక్కకపోయినా, అర్థం కాకపోయినా, రాను రాను అసలులోపం ఎక్కడుందో అతను గ్రహించగలిగాడు. నిజమే వర్వారా స్తైపనోవా నిక్కచ్చి మనిషే. ఆమెఅంటే వూళ్లో వాళ్ళందరికీ భయభక్తులుగల మాట నిజమే. అయితే, ఆ గ్రామంలోని దళాల నాయకులంతా చేతకాని దద్దమ్మలు. అందుచేత అన్ని పనులకు ఆమే సిద్ధమయ్యేది. అన్నిపనులు తానే చూడాలనీ, తానే చేయాలనీ తాపత్రయ పడేది. అయితే ఆమెకు వున్నవి రెండేకళ్లు రెండే చేతులు. ఎన్ని పనులు చూస్తుంది? ఎన్నిపనులని చేస్తుంది?

మామగారి గొణుగుడికీ, అత్తగారి సణుగుడికీ కూడా అతను అలవాటు పడిపోయాడు. "ఇంతేలే ఎప్పుడూ మాపని ఇంతేలే. మేము ఎంతచేసినా..." అసలు ఈ గొడవ పట్టించు కోకపోతేకాదు. పాపం, ముసలివాళ్ళు. అసలు ముసలివాళ్లంతా ఇంతేలే అనుకొని సంతృప్తిచెంది, మిన్నకుండేవాడు.

ప్రతీవిషయం పాతబడింది. బండిచక్రంవలె జీవితం దొర్లుకు పోతోంది - అయితే ఒకటిమాత్రం ప్రియురాలి తొలికౌగిలివలె, తొలివలపు అనుభూతివలె, నిత్య నూతనత్వం విరజిమ్ముతున్నది.

పనిపాటలు చేసి, ఇంటికొస్తే పొందే ఆనందం నిత్య నూతనంగానే వుండేది. వేడినీళ్ళస్నానం చేసి పడకగదిలో ప్రవే శించగానే, స్వర్గధామంలో కాలిడినట్లుండేది.

స్తేషా అందచందాల పన్నె. రోజురోజుకీ, ఆనాటి కానాడు ఎక్కువవుతున్నది: ఆమెదేహం బిగువూ, సొగసూ తేరింది: అంగసౌష్టవం తీర్చి దిద్దినట్లయింది. ఆమె నడకలో, కద లికలో కొత్తరకం అందం, హుందా మెరుస్తోంది. ఆమె ఇప్పుడు పెళ్ళికాని ఆడపిల్లకాదు; గృహిణి చలాకీగా గిరుక్కున తల తిప్పినప్పుడల్లా, కోడిత్రాచువంటి ఆమెజడ ఎత్తైన ఆమె వక్షో జాలమధ్యగా పాకుతూ పొరాడుతూ వుండేది. "ఫెడ్యా కట్టెలు అయిపోయాయి, పట్టుకురా" "నా అందాలమాల, మురిపాల వాన" కొన్ని నిముషాలపాటు కూడా ఆమెనుంచి దూరం కావటం అతనికెంతో బాధగా వుండేది.

ఈ సంసారిక సుఖం పాతబడటం అంటూవుంటుందా? నూతనత్వం, శాశ్వతత్వం కోల్పోతుందా? అసంభవం. అలసట ఎరుగనిది ఆనందం. ఎంతపొందినా తనివి తీరదు. అత్తమామల పోటుకూడాను అతను సహిస్తున్నాడంటే, దానికి కిటుకు ఇందు లోనేవుంది. స్తేషా కౌగిలిలో వున్నంతసేపూ, అతను ప్రపం చాన్నే మరచిపోతాడు. ప్రళయమే రానీ, విలయమే కానీ, అతను లెక్కచేయడు.

స్తేషా ఎన్నడూ గొణిగేదికాదు: సణిగేదికాదు. అసలు అలాంటి ఆగత్యమే ఆమెకులేదు. ముసలివాళ్ళు గొనుస్తూనే గొణుగుతూనే సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో పని చేస్తున్నారు. స్తేషా ఆ విషయాలను పట్టించుకొనేదేకాదు. గ్రామానికి వెలు పలవున్న తన వెన్నపూస ఫ్యాక్టరీ, తనూ అంతే మిగతా గొడ వలు ఆలోచించేదేకాదు. నిత్యనూ ఉదయానే ఫ్యాక్టరీకివెళ్ళి సాయంత్రం యింటికి తిరిగివస్తుంది. ఇంటికి రాగానే వంటపనులు, ఇంటిపనులు, వాటిల్లో మునిగిపోతుంది. భర్త వచ్చేసరికి అన్నీ

సిద్ధం చేయాలాయె. ఆవుకు మేతవేయాలి; కుడితి పెట్టాలి. ఎన్నిపనులు చేసుకోవాలి ! తనపనులు తాను చేసుకుపోవటం తప్ప, దేవుడిచ్చిన నోరుందిగదా అని చీటికిమాటికి దీర్ఘశృతిలో తీవ్రతతో కంఠంవిప్పి, ఇంటికప్పులు ఎగరవేస్తూ అరిచే అల వాటు స్తేపాకు లేదు.

ఆ విధంగా వసంతం సగం గడిచిపోయింది.

వసంతకాలం సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి అనేక కొత్త సమస్యలు తెచ్చిపెట్టింది.

వర్వరా స్తెపనోవా ఒకసారి ఆఫీసుకు వచ్చి వెళ్ళమని ఫ్యోడార్ కు కబురు పంపింది. ఆ కబురందుకొని ఫ్యోడార్ ఆఫీ సుకు వెళ్ళాడు. వర్వరాకు ఎదురుగా కుర్చీలో కూర్చొన్నాడు. వర్వరా స్తెపనోవా టేబుల్ పై మోచేతులు ఆన్చి, గడ్డంక్రింద చేతులు పెట్టుకొని, ప్రాధేయపూర్వకంగా అడిగింది:

"ఫెడ్యా, ఈ సారికూడా నీవే మమ్మల్ని ఆదుకొని, ఈ ఆపదనుంచి గట్టెక్కించాలి పెంటపోగు లన్నింటినీ పొలా లకు తోలి, మాకెంతో సహాయం చేశావ్. ఎంతో నిజాయితీతో పనిచేశారు. డ్రైవర్లపై ఫిర్యాదు చేయటానికే అవకాశం లేకుండా పని పూర్తి చేశావు. మొన్న నూర్పిళ్ళ తరుణంలో మేమెన్ని ఇబ్బందులు పడ్డామో తెలుసా? కోతలు నూర్పిళ్లు సాగినంతకాలం హోరున ఒకటే వాన! తడిసిన విత్తనాలను ఎండబెట్టవలసివచ్చింది. ఆ విత్తనాలు పనికివస్తాయో, రావో వ్యవసాయ శాస్త్రజ్ఞులు ఇంతవరకు తేల్చి చెప్పలేదు. ఇప్పు డొచ్చిన ఆ విత్తనాలు పనికిరావు పొమ్మంటున్నారు. వాళ్ళ జిమ్మడ, వాళ్ళకు పోయేకాలం ఎప్పుడొస్తుందో? మన క్షేత్రా

నికి జిల్లాకమిటీ వారు మంచి విత్తనాలు కేటాయించివుంచారు. అయితే జిల్లాకేంద్రం నుంచివాటిని ఇక్కడకు ఎలా రవాణా చేయాలో బోధపడకుండావుంది. ఫెడ్యా.నీవుమాకు ఈసహాయం చేసిపెట్టాలి. మెషిన్-ట్రాక్టర్ స్టేషన్ డైరెక్టరును ఒప్పించి ఒక ట్రాక్టరుయిప్పించావంటే మేము బతికిపోతాం. ట్రాక్టరుతో రెండుట్రిప్పులు వేస్తేచాలు. నీకు పుణ్యం వుంటుంది; మాకీ పనిచేసిపెట్టు."

ఫ్యోడార్ ఆలోచించాడు. లోలోన చకచకా అంచ లేసుకొన్నాడు: జిల్లాకేంద్రం ఇక్కడకు దాదాపు నాలుగు ఆమడలదూరం వుంది. మట్టిరోడ్డు; అందులోని మంచుకరిగి, ప్రవాహాలై మట్టిరోడ్డుకు అనేకచోట్ల గండ్లుపడి వుండవచ్చు. ఇలాంటి పరిస్థితిలో ట్రాక్టరు నడపుటకు కష్టం; అందులోను అంత బరువు లాగుతూ సాగటం అసంభవం. పెట్రోలు విపరీతంగా తగలడిపోతుంది...

"వర్వరా స్టెపనోవ్నా, వీల్లేదు, ఆపని నావల్లకాదు. నీవే ఒకసారి ఆలోచిస్తే, నీ సూచన ఎంత అసమంజసమైనదో నీకే తెలుస్తుంది. ఆ మట్టిరోడ్డుపై ట్రాక్టరు నడపటం సాధ్యమేనా? ఆలోచించు."

"ఆ పెద్దట్రాక్టరులేదూ. అదే 50 హార్స్‌పవర్ ట్రాక్టరు ఉపయోగించండి. ఏనుగులాగా ఎంత బరువైనా, ఎలాంటి బురదలోనైనా ఈడ్చేస్తుందిగా"

"డీజల్ ట్రాక్టరుతో చెలగాటమాడటం నేనొప్పను. ఖర్మంచాలక మట్టిరోడ్లపై ఎక్కడనా్న కూలబడిపోతే ఎట్లా? అదీకాక ఇక్కడ ఆ ట్రాక్టరు అవసరం ఎంతో వుంది. ఆట్రాక్టరు

కాస్తా చెడిపోయిందా చచ్చిచెడి. విత్తనాలు చేర్చినా చేలలో చల్లేందుకు సాధనం లేకుండా పోతుందన్న సంగతి గుర్తుంచుకో

"అయితే ఏమి చేయాలి? నాకేమీ పాలుపోకుండా వుంది."

"గుర్రాలన్నింటినీ, మీ దగ్గరున్న గుర్రాలన్నింటినీ ఉపయోగించి, విత్తనాలు ఇక్కడకు చేర్చండి."

వర్వరా స్టెపనోవా ఫ్యోడార్ ముఖంలోకి చూస్తూ, అంది:

"అన్ని గుర్రాలను ఉపయోగించి...నిజమే. ఈసూచన నాకూ తట్టకపోలేదు. అయితే- అన్ని గుర్రాలను...! అదే నాకు భయంగావుంది. అన్ని గుర్రాలను ఇప్పుడే నారతీసి వదిలేస్తే, రేపు ట్రాక్టర్లన్నీ మూలపడితే ఏంకావాలి? నిజం చెప్పొద్దూ? మీ ట్రాక్టర్లను నమ్ముకొంటే యింక నిరవాక మైనట్టే? నిరుడుమట్టుకు నిరుడు, మమ్మల్ని నట్టేటముంచాయి. ఒకరోజు పనిచేసి, రెండోరోజు మూలపడుతుండేవి. డ్రైవర్లంతా మెషీన్ - ట్రాక్టర్ స్టేషన్‌కు పరుగెత్తారు; విడిభాగాలు తేవటానికి. అప్పుడు చేతులో గుర్రాలు వుండబట్టి కార్యం నెరవేరింది. మనసులో విషయం నిర్మొఖమాటంగా చెప్పేశాను. విత్తనాలు జల్లేటప్పుడు గుర్రాలు లేకపోతే గడవదు.

"వర్వరా స్తైపనోవా, బహుశా నీకు శౌను నాయకుడు ఫ్యోడార్ అంటే ఎమిటో తెలియకపోవచ్చు ట్రాక్టర్లు ధోకాలేకుండా పని చేస్తాయి. అందుకు పూచీ నాది. కావాలంటే ప్రమాణం చేస్తాను. పందెం వేస్తాను. నామాట విని

గుఱ్ఱాలను పంపించి, విత్తనాలు తెప్పించండి. పొలంపనులకు గుఱ్ఱాల అవసరం వుండదు. పదేళ్ళుగా నేను ట్రాక్టర్లను నడుపుతున్నాను. నా జీవితంలో సగం కాలం ఈ వృత్తిలోనే గడిపాను అందుచేత నా మాట ప్రాంసరీనోటుకన్నా విలువైనది"

"మాటలకేమి వచ్చిలే"

ఫ్యోడార్ సూచనను పాటించటం తప్ప స్టైపనోవాకు మరొకమార్గం కన్పించలేదు.

## 9

మంచు పూర్తిగా కరిగిపోయింది. నేల క్రమంగా ఆరిపోతుంది.

ఫ్యోడార్ డీజిల్ ట్రాక్టర్ తో పొలాలన్నింటిలోను ఆఖరసాలు దున్నిస్తున్నాడు. పగలల్లా పొలాలలోనే వుంటూ, పనిని తనిఖీచేస్తున్నాడు. బాగా పొద్దుపోయిన తర్వాత కాని యింటికి రావటంలేదు. అలసటతోను, హుషారుతోను ఇంటికి తిరిగివస్తున్నాడు.

"ఓ నా ముద్దులరాణీ, నాకు విపరీతంగా ఆకలేస్తోంది. కొద్దిపాటి కోడిని చాలా తేలికగా నేనొక్కడనే ఎగరేస్తాను. కాళ్ళు తేలిపోతున్నాయి. కళ్ళు మూతపడుతున్నాయి."

ప్రక్కగా పోతున్న స్తేపా బుగ్గగిల్లిన ఫ్యోడార్ విరగబడి నవ్వాడు.

ఒకరోజున స్తేపా భర్తకు అన్నీ వడ్డించి, ఎదురుగా కూర్చొని, తదేకంగా భర్తను పరికిస్తోంది. మురుపూ ఒకవిధమైన విరుపూ ఆ చూపులో కానవస్తోంది. ఎవరో వెనకాలే తరుముకొస్తున్నట్టు, ఇలా గబగబా మింగడమెందుకో అనుకొన్నది స్తేపా.

"ఆఁ. అడగటం మర్చిపోయాను. సరేకాని, మన పొలం దున్నకుండా ఇంకా ఎంతకాలం ఇలా అట్టిపెట్టటం? ఇప్పటికే తరుణం మించిపోతోంది. సమిష్టి వ్యవసాయక్షేత్రపు భూముల దుక్కి ఎప్పుడో మొదలెట్టారు. మన పొలాన్ని ముట్టుకోనే లేదు. నాన్న మీతో చెప్పమన్నాడు. పోయి వర్వారాను అడగండి. ఒకరోజు ఒక గుర్రాన్ని యిస్తే మనపొలం దుక్కి అయిపోతుంది. మీమాటను ఆమె నిరాకరించలేదు. మీ మాటను కాదని ఆమె నిలవగల్గుతుందా?"

"వీల్లేదు, స్తేపా అది సాధ్యంకాదు. జిల్లాకేంద్రంనుంచి విత్తనాలు యిక్కడకు చేర్చటం పూర్తయ్యేదాకా, గుర్రాలను ఇతరుల కెవ్వరికీ యివ్వరాదని వ్యవసాయక్షేత్రపు బోర్డు నిర్ణయం. వర్వారా స్తెపనోవాకు కూడా సొంతభూమివుంది. అయినా ఆమె గుర్రాన్ని సొంతానికి ఇంతవరకు ఉపయోగించలేదు. ఇతరులందరినీ వెనక్కు నెట్టి మనమే అందలం ఎక్కి కూర్చోవాలనుకోటం అంత మంచిదికాదు. పదిమందితోపాటే మనమూ"

"అయితే మనపొలం దుక్కిలేకుండా బీడుగా వుండాల్సిందేనా?"

"ఇతర మార్గమేదైనా ఉందేమో ఆలోచిద్దాం. పారతో తిరగేస్తే సరిపోతుందనుకొంటా. సమిష్టి వ్యవసాయ క్షేత్రం ఈ యేడు చాలా యిబ్బందులలో పడిపోయింది. విత్తనాలేమో నాలుగు ఆమడల దూరంలో వున్నాయి, తొలకరేమో వచ్చి కూర్చుంది.

"పారతో తిరగేయటమా? అరఎకరం భూమిని పారతో తిరగేయటమంటే మాటలా? అయినా ఆ పని ఎవరుచేస్తారు? మీరు చేస్తారా? మీరేమో నోట్లో నాలుగు మెతుకు లేసుకొని, కడిగినచేయి అయినా ఆరకముందే, ఏమిటో అక్కడ అంతా మునిచుకుపోయినట్టు పరుగెత్తుతారాయె. మళ్లీ అర్ధరాత్రి సమయానగాని ఇంటికి తిరిగి రారాయె. మీరా ఆపని చేయరు. పోతే, నేనన్నా చేయాలి, లేదా అమ్మన్నా చేయాలి. నాన్న స్థితి చూదామా అంటే, రేపోమాపో ఎనభైయ్యో పడిలో పడబోతున్నాడు. ఇంత వృద్ధాప్యంలో పారపని చేయటం ఆయనకు సాధ్యమా?"

"తొందరపడకు, స్తేపా. విత్తనాలను ఇక్కడ చేరనివ్వు అప్పటిదాకా ఆగితే..."

"అప్పటిదాకా ఆగితే, ఇక మన వ్యవసాయం సాగినట్లే. మీరేమో ఊరుమ్మడిపొలాలు పండించి రండి. మనపొలం పాడు పెట్టుకొందాం. అంతేగా?"

"ఇదిగో స్తేపా, గుర్రాన్ని యివ్వమని చచ్చినా నేను అడిగేదిలేదు. కావాలంటే మీరువెళ్ళి అడుక్కోండి. తెచ్చుకోండి. నాకభ్యంతరం లేదు. అంతేకాని, గుర్రాన్నివ్వమని అడగడానికి నాకు మనస్సు ఒప్పటంలేదు."

స్త్రేషా పెదిమలు కంపించాయి. ఆమె నేత్రాలు బాష్పజల పూరితాలు కావటం ఫ్యోడార్ గమనించాడు.

"చాల్లెండి, మనస్సాక్షిని గురించి మహా చెప్పొచ్చారు! కంచం దగ్గర కొచ్చేసరికి ఆ మనస్సాక్షి ఏమైపోతుందో."

గభాలున తలుపు దగ్గరికేస్తూ స్త్రేషా వెళ్ళిపోయింది.

ఫ్యోడార్ ఇంకా అన్నం తింటూనే వున్నాడు. కాని, రుచీపచీలేకుండా చప్పగా అది మారిపోయింది! ఏముంది అసలు ఆడవాళ్ళంతా ఇంతే. ప్రతి చిన్న విషయానికి ఇలా కంటతడి పెట్టుతుంటారు. తొందరగానే ఆమె మనస్సు కుదట పడుతుందిలే...ఇదొక చిన్న గృహకలహం. అంతకాక ఎంత? పదిహేను నిముషాలలో తిరిగి పడకగదిలో ప్రత్యక్షం కాదూ? ప్రత్యక్షం కాక ఎక్కడికి పోతుంది? కొద్దిసేపటిలో అంతా చక్క బడుతుందిలే...అనుకొంటూ స్త్రేషా రేడియో సెట్టు దగ్గరికి వెళ్ళాడు, పెళ్ళాంతో పోట్లాడినప్పుడల్లా అతనికి ఆ రేడియోయే శరణ్యం. మాస్కో కేంద్రంనుంచి ప్రసారమవుతున్న మధుర గానం ఆలకిస్తున్నాడు;

"నీ నీలిమ నేత్రాల మేలిమికోసం
ఈ జగత్తునే త్యజిస్తాను."

అతను గబగబా రేడియో మూసివేసి లేచాడు. తలుపు దగ్గరి దాకా వెళ్ళి, మళ్ళా గిరుక్కున వెనక్కి తిరిగాడు. ఆ ముసలాడు ఎవరిబూటునో కుట్టుతూ కూతురు దగ్గరనేకూర్చొని వుండవచ్చు. "అల్లుడు బోనసు లిస్తారని ఆశపడుతున్నట్టు న్నాడు" అని ముసల్ది అంటుంది. బహుశా స్త్రేషా ఏడుస్తూ

వుంటుంది. ఈమాత్రం దానికే ఆమె ఇదయిపోవాలా ? ఆ అర ఎకరం పొలం దుక్కి పదిరోజులు వెనకపడితే కొంపలారి పోవు కదా ? ఆభూమి పండించక పోయినా, కుటుంబం ఆకలితో అలమటించి చచ్చిపోదుగదా ?

ఫోఁడార్ బూట్లు విడిచి, విసుగుదలతో అవతలకు విసిరేసి, పాన్పుపై మేను వాల్చాడు. మెత్తటిదిండుపై ముఖం వాల్చి, బోర్లా పడుకున్నాడు. స్త్రేషా వస్తుంది, వస్తుంది, తప్పక వస్తుందని ఎదురు చూస్తున్నాడు. ఎంతకీ ఆమెరానేలేదు. ఆమె ఎటుతిరిగీ రాలేదుకదా. పోనీ, నిద్రాదేవతన్నా వస్తుందంటే, అదీ రాలేదు.

మంచం పైనుంచి లేచి, గదిలో కాలుగాలిన పిల్లిలాగా అటు యిటు తిరుగుతూ, కుర్చీలు సర్దుతూ చప్పుడుచేస్తూ, స్త్రేషాకు ఎన్నో 'సిగ్నల్స్' ఇచ్చాడు. అవ్వన్నీ నిష్ప్రయోజనమై పోయాయి. అప్పుడతనికి గుర్తుకొచ్చింది. పొలంలో నాగలి దున్నుతుంటే, తనచొక్కా కొంగ్రుపట్టి చిరిగిపోయింది. చినిగిన చొక్కాను కుట్టుకుందామనుకున్నాడు. స్త్రేషావచ్చి, తనను ఆ స్థితిలో చూస్తుంది. తాను ఏమీ మాట్లాడకుండా, బెల్లం కొట్టిన రాయిలాగా కూర్చుని, కుట్టుపని కొనసాగిస్తుంటాడు. అప్పుడు ఆమెకు తెలిసివస్తుంది- చూచావా, భర్త విషయంలో ఎంత నిర్లక్ష్యం చేస్తున్నావో? ఇది భావ్యమా? నీకు సిగ్గులేదూ? అన్నట్టు అవుతుందని ఫోఁడార్ తలపోశాడు.

సూది, దారంకోసం బిస్కట్టు డబ్బాతీశాడు. చొక్కాకు చక్కగా అతికే రంగుదారం కోసం వెతుకుతున్నాడు. అలా వెతుకుతూంటే కామ్సమోల్ సభ్యత్వం కార్డు బయటపడింది.

ఒక విందు సందర్భంలో తాను స్తేపాను కలిశాడు. అప్పుడే అడిగి తెలుసుకుందామని అనుకొన్నాడు. కాని, అది తగిన తరుణంకాదని వూరుకున్నాడు. మళ్ళీ యింటికొచ్చిన తర్వాత అతను ఆ వూసే ఎత్తలేదు. ఏమిటో? భార్యతో ఆ విషయం ప్రస్తావించటం అతనికి ఏదో ఇదిగావుంటుంది. ఇద్దరూ పెళ్ళి చేసుకొన్నారు. ఇద్దరూ ఉద్యోగాలు చేస్తున్నారు. జీవితం హాయిగా గడిచిపోతోంది. ఆమె కామ్సమాల్ సభ్యురాలు అవునో, కాదో అడిగి తెలుసుకోవాలన్న యోచనే అతనికి లేకపోయింది.

ఆ కార్డుకూడా శుభ్రంగా, కొత్తదిగా కన్పిస్తోంది. కాని అది నాలుగేళ్ళ క్రిందటి కార్డు. ఆ కార్డులో అమర్చిన ఆమె ఫొటోచూస్తే తెలుస్తుంది. చిన్నతనం ద్యోతకమవుతోంది. మామూలు ముఖం కనుబొమలు దట్టంగావున్నాయి. ఆ ఫొటోలోకన్నా ఇప్పుడే మరింత అందంగావుంది. మూడు నెలలు మాత్రమే సభ్యత్వమును చెల్లించింది అటుతర్వాత మానేసింది. దానితో సభ్యత్వం దానంతటదే అంతరించి పోయింది. ఆకార్డుమాత్రం ఈడబ్బాలో ఇంకా మూలుగుతోంది.

ఆ కార్డువంక సాలోచనాచిత్తుడై చూస్తూ ఫ్యోడార్ నిలబడ్డాడు: మూడు నెలలబట్టి మేమిద్దరం కలసి జీవిస్తున్నాం. ఒక కంచంలో తింటూ ఒకే మంచంపై పడుకొంటున్నాం. అయినా ఈవిషయం గురించి ఎన్నడూ అడిగి తెలుసుకున్న పాపానేపోలేదు. నిజానికి ఆమె మనస్సు, ఆమె హృదయం అంతు తెలియని అంధకార బంధురంగానే మిగిలిపోయింది.

ఆరాత్రి స్తేపా పడకగదిలో కాలిడనేలేదు. తల్లిదండ్రుల ప్రక్కనే పడుకొని నిద్రపోయింది.

# 10

వారికి గుర్రం కావాలంటే యివ్వాల్సిందే. సమిష్టి వ్యవసాయ క్షేత్రం పాడై పోదు.......

ఆమెకు దొరికిన పని చక్కనిదీ; తేలికనైదీ. ఏలాంటి గొడవలూ లేనిది. సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో పనిఅయితే చచ్చిపోయేదాన్ని అనుకొన్నది స్తేపా.

ఆమె కామ్సమాల్ కార్డు సంగతి అసలు ఏనాడో మర్చి పోయింది. సూదులు, దారాలడబ్బాలో పడేసి, ఎందుకూ పనికి రాని పాతవస్తువుగా దానిని పరగణించింది.

అయినా ఆమె కరుణామయి; సద్గుణశాలి. కామ్సో మాల్ కార్డును నిర్లక్ష్యంగా పారేసిందని చెప్పి, ఆమెను తేలికగా తీసి పారేయటానికి వీల్లేదు.

ఫ్యోడార్ ఆరేళ్ళబట్టి ట్రాక్టరు టీములకు నాయకుడుగా పనిచేస్తున్నాడు. గ్రామీణప్రాంతానికి చెందిన యువకులు కొద్ది కాలం శిక్షణపొంది, అమాంతంగా డ్రైవర్లుగామారుతున్నారు. వారిలో అహంభావం జాస్తి. తలబిరుసు ఎక్కువ. వాళ్ళకు తోచదు. ఇతరులు చెప్పితే చచ్చినా వినరు. ఫ్యోడార్ నానా రకాల జనంతో వ్యవహరించాలి. పెట్రోలు వూరికే కాల్చి వేస్తుంటే, అదేమిటయ్యా అని అడిగితే "మాపై పెత్తనంచలా

యించ ప్రయత్నించకు, ఫెడ్యా. మేమేమన్నా పెట్రోలుతాగు తున్నామా ?" అని ఎదురుదాడి ప్రారంభిస్తారు. ఇలాంటి తల బిరుసురాయుళ్ళను కూడా ఫ్యోడార్ అదుపులోకి తెచ్చాడు; పై అధికారులకు ఎన్నడూ రిపోర్టులురాసి ఎరుగడు. జనంచేత పనిచేయించే నేర్పుఅతనిలో అపారంగావుంది. మాటలతోఎదుటి వానిని మంత్రముగ్ధుణ్ణి చేసేశక్తిఅతనిలోవుంది. ఆడపిల్లల సంగతంటారా ఇక చెప్పనే అక్కర్లేదు అసలు ఆడపిల్లలచేత పని చేయించటం చాలా సుళువు. ఆడపిల్లల మనస్తత్వం ఫ్యోడార్ కు పూర్తిగా తెలుసు మాటల్లో వారి మనస్సులను గిలిగింతలు పెట్టించేవాడు. దానితో వారు 'ఐస్' అయిపోయి, చెప్పినట్టల్లా హుషారుగా చేసేవారు. అనేకమందిని దారిలోకి తేగాలేనిది. స్తేషాను తీసుకురావటంఅదొకలెక్కా అనుకొన్నాడు ఫ్యోడార్. ఊరిస్తూ, ఊరపిస్తూ, ఉబలాటపెట్టుతూ మాటాడితే, దాసోహమనని కాంతలుంటారా? ఇంతకీ ఈ గొడవ ఏమంత పెద్దదని. గుర్రం గొడవేగా. వాస్తవవిషయాలన్ని పూసగుచ్చి నట్లు విడమర్చి చెప్పితే, అందరికన్నా ముందుగా స్తేషాయే "ననేమీ అక్కర్లే" దంటుంది. ఫ్యోడార్, పిచ్చిగా ఎందుకిలా తలక్రిందులవుతావు? ఈ విషయంలో ఒక ఆడదానికి అందు లోను అర్ధాంగికి నచ్చజెప్పి, ఒప్పించలేవా? మెప్పించలేవా? నలుగురూ నవ్విపోతారు! అని అతను తనలోతానే నవ్వు కొన్నాడు.

మధ్యాహ్నందాకా ఉండబట్టలేక పోయాడు. ఉదయం పదన్నా కాకముందే యింట్లో ప్రత్యక్షమయ్యాడు. అప్పటికి స్తేషా యింకా యింటిదగ్గరేవుంది. చాలా సమరసభావంతో సరసమాడుతూ ఎదురైంది:

"ఏమిటి. దొరగారు ఇవాళ అప్పుడే దయచేశారే! అసలు ఇవాళ మీదర్శనభాగ్యమే దుర్లభమనుకొన్నాను. కాని, రోజుటికన్నా చాలా ముందుగానే వచ్చేశారు సరేకూర్చోండి, అన్నం వడ్డిస్తాను."

ఉదయాన లేచినప్పటినుంచీ పదిగంటల వేళదాకా ఫ్యోడార్ మనస్సులో 'రిహార్సల్సు' సాగిస్తూనే వున్నాడు ప్రస్తావన ఎలాప్రారంభిస్తే బాగుంటుంది? సంభాషణలను రసవత్తర మొనర్చటమెలా? రసాభాసకాకుండా రక్తి కట్టించటమెలా? దుఃఖాంతం కాకుండా సుఖాంతం చేయటం ఎలా? ఇత్యాది అంశాలను ఆతను అదేపనిగా ఆలోచిస్తూ, సందేహాలకు సమాధానాలు వెతుక్కుంటూ, మెత్తని మందలింపులకు, సునిశిత మైన హాస్యోక్తులకు మెరుగులు దిద్దుతూ, ఇప్పటికి పాత్రాభి నయానికి సన్నద్ధమై, రంగంపై ప్రత్యక్షమయ్యాడు. పదిగంటల దాకా పడ్డ తిప్పలన్నీ వృథా అనిపించింది. అభినయం అవసరం లేకుండా స్తేపా దాసోహమన్నది. స్తేపా అసలు సణగనేలేదు. ఫ్యోడార్ నివ్వెరపోయాడు. తికమక పడ్డాడు.

స్తేపా, నేను చెప్పింది అర్థంచేసుకో. ఒకసారి నీవే ఆలోచించుకో- నీవు కోరినట్లు- నేను ఆపని చేయటం భావ్య మేనా? చెప్పు. ఇది తగిన తరుణమేనా?"

"మీరంటున్న దేమిటో ఈ బుర్రకి అంతు చిక్కటంలా. ఓహో అదా! ఆ గుర్రం సంగతా? పోనీయండి. ఇక మీరు ఆ గొడవగురించి పట్టించుకోకండి ఆ పనిచేయటం మీకు యిష్టం లేదు, అందుకని నాన్నే వెళ్ళి అడిగాడు. గుర్రాన్ని సంపాదించాడు. ఈ పాటికి చేనుదుక్కి సగం అయిపోయే వుంటుంది."

"ఏమిటి? గుర్రాన్ని సంపాదించాడా? ఎలా సంపాదించాడు?"

"ఎక్కడా? ఎందుకు? ఇవ్వన్నీ మీకెందుకు చెప్పండి. అయినా ఈ వూళ్లో గుర్రాలు ఎక్కడున్నాయ్? నాన్న సరాసరి వర్వారావద్ద కెళ్ళి అడిగాడు. ఆమె గుర్రాన్ని యిచ్చింది. ఆ మాత్రం అడగటానికి మీకేమోనామోషీ అనిపించింది. లేని పోని మనస్యాక్షి అడ్డం వచ్చింది. ముందు ఇలా కూర్చోండి. మీకోసమని యివ్వాళ ప్రత్యేకంగా కోడియిగురు మహాపసందుగా చేశాను. వెగటువేసేదాకా మీచేత తినిపిస్తాను."

ఆమె అచ్చం అర్ధాంగిలాగా, గృహిణిలాగా మెసలుకొంది. ఆప్యాయంతో అన్నం, కూరలు వడ్డించి, భర్తకు ఎదురుగా కూర్చొని వద్దన్నా బలవంతంచేస్తూ తినిపిస్తోంది. అలాంటి అబలతో, బేలతో, కోపగించుకోటం సాధ్యమా? ఆమెనుగురించి చెడుగా భావించటం సంభవమా ?

అయినా భోజనం చేస్తున్నంతసేపూ ఫ్యోడార్ మునీశ్వరుడిలా మౌనం పాటించాడు. ఎంత యోచించినా అతనికి అంతు చిక్కటం లేదు,

"వర్వారా స్తైపనోవా ఆపని ఎందుకు చేసినట్టు? ఒక్క గుర్రంకూడా ఖాళీగాలేదే? పోనీ, సిలాంత్రీ పెట్రొవిచ్ అన్నా అవెన్‌లీనా ఇవనోవా అన్నా ఆమెకు ఏమాత్రం సదభిప్రాయం లేదే! ఇందులో ఏదో కుంభకోణం వుండితీరాలి. లేకపోతే ఇలా జరగదు."

భోజనానంతరం కాసేపు యింటిదగ్గరుండి, గుర్రంసంగతేమిటో అంతు కనుక్కుందామని ఫ్యోడార్ సరాసరి వ్యవసాయక్షేత్రం కార్యాలయానికి వెళ్లాడు,

వర్వారా స్తైపనోవా అతనివంక కోరగా కోపంగా చూసింది.

"గుర్రం కావాలన్నావు సరే, నీకోర్కె నెరవేరిందిగా."

"నేనేమిటి, గుర్రం కావాలనటం ఏమిటి ?"

"గుర్రం కావాలని నీవు స్వయంగా అడగకపోతే మాత్రమేం! మామను పంపించావు. ఆయన ఈ పొద్దునవచ్చి, గంటసేపు నన్ను వేధించుకు తిన్నాడు.కష్టపడేవాళ్ళ విషయంలో నేనుకారుణ్యం చూపనట; కాఠిన్యం ప్రదర్శిస్తానట. ఏమేమిటో అన్నాడు. నీవేమో నిద్రాహారాలను మాని, సమష్టివ్యవసాయ క్షేత్రంలో పనిచేస్తుంటే, మేము నీకు ఈషణ్మాత్రం సహాయం చేయటంలేదట. ఇదీ మీ మామగారి మాట. చివరకు బెదిరించాడు కూడా. "ఇవాళ ఒకరోజు ఒక గుర్రాన్ని యివ్వ నిరాకరిస్తే, ఉత్తరోత్తర ఇంతకు పదింతల నష్టం పొందుతా"వని హెచ్చరించాడు. పాపం, వలాస్య పెస్తునోవా అడిగితే కాదన్నాను. ఆమెకు అయిదుగురు పిల్లలు, భర్తలేడు. పైగా ఆమె జబ్బుతో తీసుకొంటోంది. కాని నేను నిన్ను సంతృప్తి పర్చాను. గుర్తుంచుకో...పొలంపై పని ముఖ్యం అనుకొన్నాను. గుర్రాన్ని యిచ్చేశాను."

"వర్వారా స్తైపనోవా, పొరబడుతున్నావు, నేను గుర్రం కావాలని కోరలేదు."

కాని వర్వారా వెనుకనున్న గుమస్తావైపు తిరిగి అన్నది,

"ఏమయ్యా, ఆలెక్క అలా రాశావేమిటి ?"

"వర్వారా స్తైపనోవా, తల తిప్పేసుకొన్నంత మాత్రాన నిన్ను వదిలిపెట్టుతానని అనుకోకు. నేను చెప్పేది నీవు సాంతం వినితీరాలి."

"నామీద విరుచుకు పడతావెందుకు ? పోయి నీ మామ మీద కేకలు వేసుకో."

ఫ్యోడార్ గబగబా ఆఫీసు గదినుంచి బయటకువచ్చాడు. యింటిముఖం పట్టాడు. శరవేగంతో సాగిపోతున్నాడు.

సిలాంతీ పెత్రోవిచ్ గుర్రంతోదుక్కి సాగిస్తున్నాడు. నాగలి చేనుదరికి వచ్చేదాకా ఫ్యోడార్ వేచివున్నాడు. దరికి చేరగానే, "ఆపండి" అంటూ నాగలికి అడ్డంవెళ్లాడు. గుర్రాన్ని విప్పేశాడు. నాగటిసామాన్లు చిందరవందర చేశాడు.

"బాబూ, ఇదీ నీవుచేసేపని? నాకు నీవు చేస్తున్న మేలు కలకాలం మర్చిపోలేను. తిన్నయింటి వాసాలు లెక్కపెట్టు తున్నావు... సరే" అన్నాడు సిలాంతీపెత్రోవిచ్.

"నాకు కళంకం తెచ్చిపెట్టకండి. నాకు మీ కూడూ అవ సరం లేదు; మీయిల్లూ అవసరంలేదు. నేను సంపాదిస్తున్న దానితో నేనూ, నాపెళ్లాం హాయిగా బ్రతకగలం." అంటూ ఫ్యోడార్ గుర్రాన్ని తోలుకుపోయి, గుర్రపుసాలలో కట్టి వేశాడు.

# 11

## చీకటిపడింది

బాగా పాతబడిన పాట దూరాన్నుంచి విన్పిస్తోంది. నాలుగుమైళ్ళ దూరానగల సొబొలెవ్కాలో ఒక వివాహం జరుగుతోంది. ఎవరో ఇల్యా జిబునోవ్ రేపటినుంచి సాంసారిక జీవితంలో పడబోతున్నాడు. ఫ్యోడార్ అతని ముక్కూ,

మొఖమూ ఎరగడు. ఇంటి వరండాలో పీఠ మేసిన పెళ్ళిపెద్దలు తేలికగా కూర్చుని సిగరెట్టుదమ్ములు పీలుస్తున్నారు. ఎదురుగా వున్న ద్వారాలలో నిలబడి, ఇద్దరు ఆడాళ్ళు పిచ్చాపాటీ మాటాడుకొంటున్నారు. వాళ్ళమాటలు దారినపోయేదానయ్యలంతా వింటూనేవున్నారు. ఎవరో సెక్ లెతియాను గురించి వాళ్ళు ఆడిపోసుకుంటున్నారు. అది ఇలాంటిదనీ, అలాంటిదనీ, దానిముక్కు ఉల్లిపాయలా వుంటుందనీ, పగటిపూట చూస్తే రాత్రి కలలోకొస్తుందనీ, ఏమిటో సాధిస్తున్నారు....

మామూలీ గ్రామజీవితం - ప్రజలు నిద్రాదేవత కౌగిలిలోకి తూలిపోవటానికి పక్కలు సర్దుకొంటున్నారు. పరుపులు, దిళ్ళు పర్చుకొంటున్నారు. కొద్దిసేపట్లో వూరంతా మాటుమణిగి, మైమరచి నిద్రపోతుంది.

ఆవూళ్లో పూరిగుడిసెల సంఖ్య జాస్తి. వాటిల్లో ఒక పూరిపాక. చుట్టూ గుబుర్లుగా పెరిగిన బాదంచెట్లు. జంకుతూ తటపటాయిస్తూ ఫ్యోడార్ ఆ పూరికొంపను సమీపించాడు. ఈ ఇంటి గడప తొక్కవలసిన అగత్యం లేకపోతే, ఈ ఇంటి ఆవరణలో ప్రవేశించవలసిన అవసరం లేకుండాపోతే ఎంత బాగుండును అనుకొన్నాడు.

ఫ్యోడార్ నెమ్మదిగా, చప్పుడు కాకుండా తలుపు తోశాడు. అది కదలనని భీష్మించుకొంది. లోపల గడియవేసివుంది. కింకర్తవ్యం? వెనక్కుతిరిగి వచ్చినదారి పట్టటమా? తలుపు తట్టటమా? వెనుదిరిగి పోబుద్ధికావటం లేదు. తలుపు తట్టగల గుండెధైర్యం చాలటంలేదు.

"ఇంతకాలం మరెక్కడా కాక, ఇక్కడే జీవించాను".... అతను నెమ్మదిగా తలుపు తట్టాడు.....

చాలాసేపు లోపలనుంచి సమాధానమే లేదు. ఎట్టకేలకు గాజులు గల్లుమన్నవి. అతని వళ్లు ఝల్లుమన్నది.

"ఎవరు?"

"అమ్మయ్య! బ్రతికిపోయాను." అనుకొంటూ ఫ్యోడార్ కాస్త స్వేచ్ఛగా గాలి పీల్చసాగాడు. ముసలివాడూ కాదు; ముసలిదీకాదు. వస్తున్నది స్తేషా. అదృష్టం.

"నేనే తలుపు తీయి."

నిశ్శబ్దం. చలిగాలి వీచింది. అతని శరీరం వేడెక్కుతోంది.

కొంతసేపటికి గడియ తీస్తున్న చప్పుడు...తలుపు తెరచు కొంది... వెనుతిరిగి పోతున్న పదధ్వని....గాజుల గలగల. ఆ పద ధ్వనిలో ఆగ్రహభావం కొట్టొచ్చినట్టు విన్పిస్తోంది.

ఫ్యోడార్ గడపదాటి, లోనప్రవేశించి, తలుపు మూసి, గడియ వేశాడు.

"మళ్ళీ వచ్చావన్నమాట, నీవు కాలసర్పంవంటి వాడివి. మళ్ళీ ఇక్కడకు ఎందుకు దయచేశావ్ ? చేసింది చాలకనా?... నీకు కావలసినవాళ్ళం మేముకాం మాకన్నా ఇతరులే నీకు ముఖ్యం వెళ్ళు. బయటకు నడువు. నీమొఖం చూస్తేనే పాపం చుట్టుకొంటుంది. వెతికి, వెతికి నీబోటి పశువును పెళ్ళాడాను. ఏ జన్మలో చేసుకొన్న పాపమో, ఈ జన్మలో అనుభ విస్తున్నాను."

"స్తేషా, తొందరపడకు.... స్తేషా, వూరికే నోరు పారేసు కోకు. చెప్పేది కాస్తవిను. విని అర్థం చేసుకోటానికి ప్రయ త్నించు."

ఆమె జుత్తు చిందరవందరై వుంది. చీకట్లో ఆమె ముఖం సరిగా కన్పించటం లేదు. పొంగుకొస్తున్న ఆవేశంతో ఆమె కంఠం కంపించిపోతుంది. దుఃఖం పొర్లుకొచ్చి, మాటలు సరిగా పెకలటంలేదు. మాటుమణిగి నిద్రపోతున్న ఆ కొంపలో నిలబడిన ఫ్యోడార్ అతి నెమ్మదిగా, వినిపించీ, వినిపించని విధంగా మాట్లాడాలని ప్రయత్నిస్తున్నాడు. బాబు, ఇలాంటి పరిస్థితి పగవాడికికూడా వద్దు.

"విను. నన్ను కాస్త చెప్పనియ్యి."

"నీవసలు మగాడివేనా? నా ఖర్మంకాలి, నీలాంటి మూర్ఖుడు దాపురించాడు. నీవు వట్టి స్వార్థపరుడివి. నీబాగు మాత్రమే నీకు కావాలి. మాగొడవ నీ కక్కర్లేదు. చూడు నన్నుచూడు. చూసి ఆనందించు."

"స్తేషా"

"ఏం ? నా స్నేహితు లెవ్వరూ నిన్ను తమ యిళ్ళలోకి రానియ్యలేదా ? గతిలేక మళ్ళీ యింటికే వచ్చావ్ ?

"నోర్ముయ్, స్తేషా."

"అమ్మో, అమ్మో!....వీడికి సిగ్గులేదు. నమ్మించి మోసం చేసేరకం. నాన్నను నలుగురిలో ఉతికి ఎండేశాడు. ఇప్పుడు నన్ను వేధించుకు తింటానికి తయారయ్యాడు .... ఈ బ్రతుకు కన్నా చావుమేలు....ఆరి భగవంతుడా, త్వరగా నాకు చావు రాసిపెట్టు, నీకు పుణ్యముంటుంది.

"ఎందుకలా ఏడుస్తావ్ ? నేను చెప్పేది కాస్త విను."

"నేనేం పాపం చేశానని నన్నిలా శిక్షిస్తున్నావ్ ?"

తలుపు తెరుచుకొంది. పైమిట సర్దుకుంటూ తల్లి గమిట్లో ప్రత్యక్షమైంది.

"అయ్యో, బాబో.... చూడండమ్మా, చూడండి. నా చిట్టితల్లిని చంపేస్తున్నాడు. మిమ్మల్నే రండి. మిమ్మల్నే లేవండి, త్వరగా రండి. అమ్మాయిని చంపేస్తున్నాడు, తప్ప తాగొచ్చాడు."

ఫ్యోడార్ ఇక సహించలేకపోయాడు. సహనం కోల్పోయాడు.

"ముసలిముండ, ముందు నీ విక్కడనుంచి పో. ఈ విషయంలో జోక్యం కల్పించుకొన్నావంటేనా...."

"ఏమండోయ్. మిమ్మల్నే"

"అమ్మా, నాన్నా. నాన్నా."

సిలాంతీ పెట్రోవిచ్ కళ్ళు నులుపుకుంటూ గదిలోకి వచ్చాడు. బాగా పొడగరి. కేవలం డ్రాయర్ తొడుక్కుని వున్నాడు. చూడటానికి ఎబ్బెట్టుగా వున్నాడు. వచ్చి రావటంతోనే కూతురు చేయిపట్టి లాగాడు. భార్యను లోపలకు నెట్టాడు.

"పద! పదండి. స్టేషా, నీవుకూడా. ఈవ్యవహారం త్వరలో తేల్చివేస్తాలే...పోతే, నీవిషయం...ధర్మరాజా, ఓ యమధర్మరాజా. నీఅంతు కనుక్కొంటాలే."

"చేయి చేసుకోకముందే ఇక్కడనుంచి కదిలివెళ్లు."

"నీవేమీ చెప్పనక్కర్లేదు."

తలుపు మూతపడింది. లోపలినుంచి ముసలిదానిమాటలు విన్పించాయి.

"అయ్యో. వాడన్నీ ధ్వంసంచేస్తాడే. వాడికి పోయే కాలం రాను, పండంటివస్తువులన్నీ పాడుచేస్తాడు."

మళ్ళీ నిశ్శబ్దం.

చాలాసేపు ఫ్యోడార్ నిశ్చేష్టుడై, అలాగే నిలబడి పోయాడు, కాలు కదపలేదు.

చివరకు ఇలా పరిణమించినదన్నమాట....

ఇక ఇప్పుడేమి చేయాలి? వెళ్ళిపోవాలి. తక్షణం ఇక్కడ నుంచి వెళ్ళిపోవాలి. ఎక్కడికి వెళ్ళటం? జనందగ్గరికి, ట్రాక్టరు డ్రైవర్లవద్దకు..అర్ధరాత్రప్పుడు అక్కడికి వెళ్ళితే వారేమను కొంటారో? ఇంత రాత్రప్పుడు ఇలా వచ్చావేమిటి అని అడుగు తారు. ఏమని సమాధానం చెప్పను? ఇంటిగుట్టు చర్చకీడ్చ టమా? లోకులు అసలే పలుగాకులు. కాస్తసందు దొరికితేచాలు; చిలవలు, పలవలతో కట్టుకధలల్లి ప్రచారం చేస్తారు. నలుగు రులో నవ్వులబాటు కావటమా? ఏమైనాసరే, ఇక్కడనుంచి కదలరాదు· ఎలాగైనా రాత్రంతా ఇక్కడే గడపాలి.

గదిలో చీకటిభూతాన్ని పారద్రోలేనిమిత్తం-నీడలాగా నిల్చిన స్త్రేషా ఆకారం, ఆమె తల్లీ, కత్తెర ఆకృతిలో పొడుగ్గా, బక్కపల్చగా వున్న తండ్రీ కళ్ళల్లో - కదుల్తూండగా-ఫ్యోడార్ దీపం వెలిగించాడు.

ఇంత పొద్దుపోయినా రోజూవచ్చే నేస్తులు రాలేదన్న బెంగతో, ఆ శయ్యాగారంలోని పడకమంచం బిక్కమొఖం వేసుకొని కూర్చుంది. ప్రణయకలహంతో అలిగిన ప్రియురాలి వలె, చాప నేలపై పర్చుకొంది. టేబుల్‌పై తెల్లగుడ్డ దిగాటు

పడి, వెలవెల బోతోంది, రేడియోసెట్టు దుఃఖభారంతో తల వంచుకొంది...భయాందోళన, విచారాశ్చర్యాలతో ఫ్యోడార్ కొట్టు మిట్టాడుతున్నాడు. చివరకు మిగిలేది ఇదేనా ?

స్తేషా తన స్వహస్తాలతో తన కాళ్ళక్రింద ఈనేలను కడిగి, పరిశుభ్రంగా వుంచింది. గులాబీ రేకులవంటి ఆమె చేతి వ్రేళ్ళతో ఈ గదిలోని ప్రతి సామాను సర్దింది. "అయ్యో, వాడన్నీ ధ్వంసం చేస్తాడే: వాడికి పోయేకాలంరాను. పండంటి వస్తువులన్నీ పాడుచేస్తాడే" అన్నమాటలింకా అతని చెవ్వుల్లో ప్రతిధ్వనిస్తూనే వున్నాయి. స్వర్గాన్ని మరిపించే, మురిపించే, మహదానందాన్ని ఈఇంట్లోనే పొందాడు. కాని ఇప్పుడో.... ఈఇంటికన్నా నరకకూపమే నయమనిపిస్తోంది... నిన్నటిదాకా చిరునవ్వులు చిందిస్తూ మురిపాలు కురిపిస్తూ తనకు స్వాగత మిచ్చిన వస్తువులన్నీ ఇపుడు తనను హంతకుణ్ణి చూసినట్టు చూస్తు న్నాయి! స్తేషాగొంతుకతో దీవిస్తున్నాయి. "కాలసర్పమా? మళ్ళీ ఇక్కడికెందుకు దాపురించావ్?"

ఈ ఇల్లు...ఇక తనది కాదు. తెల్లారేదాకా వుంటాడు. ఆతరవాత తరలి పోవటానికి సన్నాహాలు చేసుకోక తప్పదు...

స్తేషా తల్లిదండ్రులు ప్రక్కనే మంచంపై పడుకొని, ఆరాత్రంతా గడిపింది. కొన్నిగంటలపాటు విలపించింది. ఉక్రోషం, ఉద్వేగం, నిర్వేదం ఆమెను ముప్పేరగొన్నాయి: ఊపిరాడలేదు. ఆనీచుడికి ఎవరుముఖ్యం. వర్వరాయాలేక అగ్ని సాక్షిగావివాహమాడిన అర్ధాంగా? కన్నీటిధారలతోతడిసి, ఆమె గుండెల్లో మంటలు క్రమంగా చల్లారిపోయాయి. ఆవేళ,

విద్వేషాలస్థానాన్ని అవమానమూ, భయమూ అక్రమించాయి. దానిఫలితం ఏమవుతుంది?....నా జీవితగాథాంతం ఇంతేనా?మళ్ళీ ఆమె - కళ్ళలో కన్నీరు జలధారై ప్రవహించింది - ఈసారి కన్నిటిలో ద్వేషాగ్ని లేదు; దుఃఖం పొర్లుకొచ్చింది. సంతోషించిన ప్రేమమాధుర్యం, కోరుకొన్న స్వర్గానందం అంద లేదు.

స్త్రీషా తనకు తోచిన రీతిలో ఆనంద స్వప్నాన్ని ఊహించుకొంది.

ఆమె ఈ భూమిమీదపడి నిండా ఇరవై యేళ్ళన్నా నిండలేదు. జీవితంలో ఆ కొద్దిపాటీ కాలాన్ని ఈ ఇంటిలోనే గడిపింది. ఏమమ్మా, నీవు మహదానందం పొందిన ఉందతం వుందా ? పెద్ద పెద్ద యిబ్బందులను ఏవైనా ఎదుర్కొన్నావా? అని ఎవరైనా ప్రశ్నిస్తే ఆమె సమాధానం చెప్పగల్గిన స్థితిలో లేదు, పెద్ద పెద్ద ఇబ్బందులా ? మహదానందమా ? అంటే ఏమిటి ?... ....ఇవేవీ ఆమెకు గుర్తులేవు. అసలు అవి ఆమె ఊహాకే అతీతాలు. పదిహేడవ పుట్టిన రోజు పండగ బహుమతిగా తల్లిదండ్రులు ఆమెకు నీలిసిల్కుఫ్రాక్ కుట్టించారు, ప్రత్యేక సందర్భాలలో, పండగరోజుల్లో ఆమె దానిని ధరిస్తోంది. ఆ తరవాత ప్రతీ పుట్టినరోజు పండుగకీ తల్లితండ్రులు ఏదో ఒక కానుక ఆమెకు యిస్తూనే వున్నారు. ఈ కానుకలు చూసుకొని ఆమె మురిసిపోయింది. ఆ కానుక లన్నింటిలోకి నీలిసిల్కుఫ్రాక్ అంటే ఆమెకు బాగా ఎంతో యిష్టం. ఇంతకు మించిన మహానందం పొంది ఎరుగదామె.

బడిలో చదువుకొన్నరోజులు పధ్నాలుగేళ్ళు వచ్చేటప్పటికే యవ్వనురాలుగా, పెళ్ళీడొచ్చిన పిల్లగా కన్పించేది.

వయస్సుకు మించిన పొడగరి. గులాబీరంగు చెక్కిళ్ళు ఆమెలో యౌవ్వనం - ప్రతీ అంగుళాన, ప్రతీఅంగాన - తొణికిసలాడింది, లెక్కలు మినహా అన్నింటిలోను మార్కులు బాగానే వచ్చేవి. లెక్కలు చేయటానికి కూర్చుంటే, అసలు ఆమెబుర్ర ఏమాత్రం పనిచేసేదికాదు మొత్తంమీద బడిలో చాలమంది పిల్లలకన్నా ఆమె ఏవిధంగానూ తీసికట్టుకాదు - క్లాసులో మధ్యరకానికి చెందినది. పాఠశాల గానబృందంలో చేరింది. అడపాదడపా గానకచేరీలలో పాల్గొంది.

యువకులంతా సమిష్టి వ్యవసాయక్షేత్రాన్ని విడిచి ఎక్కడకన్నా పోవటమన్నది పరిపాటిగా మారింది. చాలా మంది సైన్యంలో చేరారు. అనేకమంది అసలు తిరిగి రానేలేదు. పోతే, ఆడపిల్లలలో కొందరు నిర్మాణ సంబంధమైన పనులలో చేరారు; మరికొందరు వృత్తి విద్యాలయాలకు పోయారు. ఇంకొందరు జిల్లాకేంద్రంలో గుమస్తా ఉద్యోగాలు సంపాదించారు. స్తేషా ఎనిమిదో ఫారం అన్నా పూర్తి చేయలేక పోయింది—సాయం సమయాలలో నృత్యవేడుకలకు హాజరయ్యేది. ఆ వేడుకలు పూర్తయిన తర్వాత, యువకులు యింటిదాకా ఆమెవెంట వచ్చి, ఇంట్లో దిగవిడిచి వెళ్లేవారు, చిన్నపిల్లలులాగా, రెండురెళ్ళు నాలుగు, నాలుగు అయిదు తొమ్మిది అంటూ గుణిస్తూ, కూడుతూ గుమ్మస్తా ఉద్యోగం చేయటం సిగ్గుచేటయిన పని అని ఆమె అనుకొంది. అయినా గుమ్మస్తాగిరి చేయవలసిన ఖర్మం తనకేం పట్టింది!

స్తేషా యిల్లువిడిచి, వెళ్ళలేదు పుట్టింటినే అంటిపెట్టుకొంటూ జీవిస్తోంది. తల్లీ, తండ్రీ ఒకే శృతితో, ఒకే గొంతుతో

ఒకేపాట పాడారు. సమిష్టి వ్యవసాయ క్షేత్రం పనిచేసి బావు కొనేది పెద్దనాన్నా అన్నారు. అందుకని పాలఫ్యాక్టరీ ఉద్యోగంలో చేరింది. ఆ పని అతిసులువు. వచ్చినపాలను తనిఖీచేస్తూ, రశీదు రాసి యిస్తుండటమేగా? అక్కడ స్త్రీషాతోపాటు మరొక అయిదుగురు మాత్రమే పనిచేస్తున్నారు, వారంతా కాకలు తేరిన సంసారికులు; వయసుమాలిన వాళ్ళు.

మొదట్లో పాత స్నేహితులతో కలసిమెలసి తిరుగుతుండేది. వారితో ఎందులకు వెళ్లేది. వారు ఎక్కడో మూల చేరి, మనస్సులోని మమతలను, హృదయంలోని రహస్యాలను పరస్పరం తెలుపుకొనేవారు. గుసగుసలాడుకునేవారు. ఆమె వేదిక ఎక్కి పాటలు పాడుతునేవుంది. చివరకు కామ్సొమోల్ సభ్యురాలు కూడా అయింది. ఇతడు అంతా అందులో చేరుతూ ఇప్పుడు తాను మాత్రం ఎందుకు చేరరాదు? కాని, 'కామ్సొమోల్' సమావేశాలతో ఆమె విసుగెత్తిపోయింది. గడ్డిని మార్చటం ఎలా? ఎరువును తోలటం ఎలా? ఇత్యాది అంశాలపై అంతూ పొంతూ లేని చర్చలు సాగుతుంటే, అవి ఎవరికి మాత్రం విసుగెత్తించవు? అయినా విందులు, వేడుకలు, నృత్యాలు - వీటిల్లో ఉండే మాధుర్యం, ఆకర్షణ, ఆసక్తి ఆ సమావేశాలలో ఎలా లభిస్తుంది? పాత స్నేహితు లందరినుంచి ఆమె తెలియకుండా, క్రమంగా దూరమైపోయింది. అదీకాక, పాత స్నేహితులలో చాలామంది యిప్పుడు అసలు వూళ్లోనే లేరు.

ఇంటినుంచి ఫ్యాక్టరీకి, తిరిగి అక్కడనుంచి ఇంటికి - రాక, పోక ఒకేదారిని - నిజమే, ఒకవిధంగా ఇదిగాను గెద్దు

జీవితం వంటిదే. అయినా ఆమె సదా ఆశాజీవి. ఇవాళ కాక పోతే రేపైనా తనకు తగిన వరుడు దొరికితీరుతాడు. అందుకు సందేహంలేదు. అప్పుడు జీవితం స్వర్గతుల్యంగా మారుతుంది. ఆ సుదినం ఎంతో దూరానలేదు. ఇదే ఆమె ఆశ! ఇదే ఆమె ఆలోచనారీతి!!

తల్లిదండ్రుల జీవిత విధానం ఆమెకు బొత్తిగా నచ్చ లేదు. అలాంటి జీవితాన్ని ఆమె కోరుకోవటంలేదు. ఆ ముస లాళ్ళిద్దరికీ రోజల్లా ఇంటిగొడవలే; ఏవేవో పనులు; క్షణం తీరిగ్గా కూర్చోరు. తోటలో పాదులు పెట్టటం, పాదులకు నీరు పోయటం దొడ్లో పండిన కూరగాయలను సంతకు తీసుకుపోయి అక్కడ అమ్మి పావలా, అర్థ తీసుకురావటం, ఇదీ వారి వరస. ఆ కుటుంబం జరుగుబాటుకు ఎట్టిలోపం లేదు. కొంత డబ్బు నిలవ వుంది. హాయిగా జీవించవచ్చు. అయినా ఆ ముసలివాళ్ళు మాత్రం నిర్భాగ్యజీవితమే గడుపుతున్నారు. అలాంటివారు అలవాటుపడ్డారు. ధరించేవి చింపిరి గుడ్డలు; కంటినిండా నిద్ర పోరు. కడుపునిండా తిండితినరు. చక్కటి మంచాలు, పరుపులు వున్నా వాటిని ఉపయోగించరు. కటికి నేలపైనో బల్లపైనో కొంగుఫాల్చుకొనీ పంచెపడ్చుకొని నిద్రిస్తారు. అదేమి విచి త్రమోగానీ, ఈ నికృష్ట జీవితమే వారికి మహా సంతృప్తి కరంగా వుంది, "మాకేం? చాలామందికన్న మాపని చాలా బాగుంది. ఉండికూడా లేదనుకోటం మహా పాపం" అని వారు అప్పుడప్పుడు అంటుంటారు.

ఆ ముసలివాళ్ళను మీరు ఏమనగలరు? అనిమాత్రం ప్రయోజనమేమిటి? కష్టమయిన జీవితాలకు అలవాటుపడ్డ

ఘటాలు. ఇప్పుడు మారమన్నా మారబోరు కష్టాలలోనే సుఖాన్ని అనుభవించటం వారు అలవాటు చేసుకొన్నారు.

కాని, తాను పెళ్ళిచేసుకొన్న తర్వాత, తన యిష్ట మొచ్చినట్లు జీవించవచ్చు; తనకు లభించే భర్తా ఏ ఉపాధ్యాయుడో, వ్యవసాయ శాస్త్రజ్ఞుడో అవుతాడు; ఆయన పెద్దపెద్ద పుస్త కాలు, పత్రికలు చదివేవారై వుంటారు. తామిద్దరూ ఈ యిం ట్లోనే సగభాగంలో కాపురం పెట్టుకోవచ్చు. కిటికీలకు తెరలు కట్టుకోవచ్చు, గ్రామఫోను కొనుక్కోవచ్చు.

ఇలా ఊహించుకొంది......తెల్లారేప్పటికి నిద్రనుంచి లేస్తుంది. అప్పటికింకా భర్త, కొడుకు పడకలపై గుర్రుపెట్టి నిద్రపోతూనే వున్నారు. (తనకు తప్పకుండా కొడుకే కలుగు తాడా) వంటింటోకెళ్ళి వంటపనులు ప్రారంభిస్తుంది. ఇక్కడ ప్రతి వస్తువూ తనదే; అంతా తనదే...సాయంకాలంపూట బంధువులో, మిత్రులో యింటికొస్తారు. వారు తన తరఫు బాధు వులూ కారు; తన మిత్రులూకారు. అంతా భర్త తరఫువారే. అందరూ టేబుల్‌చుట్టూ కూర్చొని, టీ త్రాగుతూ రాజకీ యాలు చర్చిస్తారు. తాను అప్పుడు ఏమూలో కూర్చొని, అల్లిక అల్లుతూ, వారి సంభాషణలు తిలకిస్తూ, అప్పుడప్పుడు అతిధు లకు కప్పులలో టీ పోస్తూ, అనిర్వచనీయమైన ఆనందం పొందు తుంది "మరికొంచెం తేనె వేసుకోండి. ఫరవాలేదు. ఇంట్లో కావలసినంత తేనె వుంది. కాని తెచ్చింది కాదులెండి. సొంత తేనె పట్టులనుంచి తీసింది"

ఆనందం అంటె ఇలావుండాలి. శాంతి, సామరస్యం తన యింట్లో ఆరుగాలం వర్తిస్తుంటుంది. తేనె లూరే భావాలు,

కలలు ఆమె హృదయాన్ని నింపేశాయి; కట్టలు త్రెంచుకొని, పొంగి, పొర్లి ప్రవహిస్తున్నాయి.

తానొకటి తలిస్తే దైవమింకోటి తలుస్తాడన్నట్టు, తాను వూహించుకొన్న అందాలలోకం ఆనందం జీవితం తనయింట్లో అవతరించలేదు. ఆమెభర్త అందమైనవాడే అయితే తానాశించి నట్లు అధ్యాపకుడుగానీ వ్యవసాయ శాస్త్రజ్ఞుడుగానీ కాదు సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో పనిచేసే మిగతా అందరివంటివాడే నిజమే. అతను పుస్తకాలు చదువుతుంటాడు; పత్రికలు యింటికి పట్టుకొస్తుంటాడు. అయితే స్నేహితులెవ్వరినీ యింటికి ఆహ్వా నించే అలవాటు అతనికిలేదు; ఆ సక్తి వున్నట్టూ కన్పించదు. ఒకవేళ ఏటికీ, కోటికీ ఎవరినైనా ఆహ్వానించినా, యింటి కొచ్చినవారు టీకి బదులు బీరు, వోడ్కా కావాలంటారు. రాజకీయాలను గురించికాక, పెట్రోలునుగురించి చర్చలు సాగి స్తారు. తలనొప్పి పుట్టిస్తారు.

తనకు అన్నివిధాల తగిన వ్యక్తి భర్తగా లభించ లేదు.

అసలు స్తేపా మనస్సులో బలీయమైన భావం వుంది: అయితే దానినెప్పుడూ బయటపెట్టలేదనుకోండి; అతను పొందిన ఫ్యోడార్ నిజంగా అదృష్టవంతుడు. కావాలంటే, 'కో' అంటే కోటిమంది తనను వివాహమాడటానికి సిద్ధమయ్యేవారు. కాని, ఫ్యోడార్ తనవంటి యువతిని పొందకుండటం కొంచం కష్టం. ఈ భారం ఇంత బలంగా వుండబట్టే, స్తేపా యిప్పుడు ఇంతగా బాధపడుతోంది: ఫ్యోడార్‌కు అత్తమామల కన్నా ఇతరులు ముఖ్యం, ఇల్లన్నా, తనన్నా అంతగా లక్ష్య

పెట్టడు. వర్వారా వంటి మాటలు విని, బొత్తిగా చెడిపో యాడు.

మరుసటి రోజు ఉదయాన స్తేపా మామూలుగానే పాల ఫ్యాక్టరీకి బయలుదేరింది. ఫ్యాక్టరీలో తన టేబుల్ ఎదుట కూర్చొని, తలుపు తెరుచుకొన్నప్పుడల్లా ఆత్రంగా, "అడుగో ఫ్యోడార్ వస్తున్నట్టున్నాడు; సిగ్గు భారంతో వంగిపోయిన మొఖంతో, క్షమాపణ చెప్పుకోటానికీ అన్నట్టు వస్తున్నాడు - అనుకొనేది. కాని, ప్రతిసారీ ఆమె ఆశాభంగమే పొందింది.

ఫ్యాక్టరీ ఆఫీసు భవనంపై రేకులు కప్పారేమో, ఎండ తీవ్రతకు ఆ గది మండిపోతుంది. ఆ గదిలో కూర్చోవటం దుర్భరంగావుంది. పైగా, పులిసిపోయిన పాలకంపు; చేసేపనిలేదు. ఎండ జాస్తిగావుంది. బాగా ఉక్కబోస్తోంది గండ్లుపడిన రోడ్లు ఇంకా బాగుచేయలేదు. సమిష్టివ్యవసాయక్షేత్రాలనుంచి పాలు రాలేదు.

స్తేపా కళ్ళలో కాయలు కాసేటట్లు ఎదురు చూసింది: ఫ్యోడార్ ఈ క్షణంలో రావచ్చు; మరు క్షణంలో రావచ్చు; అనుకొంటూ, భర్త రాకకోసం నిరీక్షిస్తూ కూర్చుంది. కాని భర్త ఎంతసేపటికి రానేలేదు.

స్తేపాకు లోననుంచి వికారం బయలుదేరింది; కళ్ళు తిరిగిపోతున్నాయి; కళ్ళుతిరిగి. తూలి, నేలమీద పడిపోయినంత పని అయింది.

## 12

ప్యోడార్ ఆలోచించుకుంటూ నిద్రపోయాడు; రేపు ఈ సమస్యను ఏదో ఒకవిధంగా తేల్చివేయాలి. కాని, సమస్యను తేల్చే విధమేమిటో అతనికి తోచలేదు.

దుక్కి దున్నిన పొలాలలో అటూ యిటూ తిరిగాడు. ఈ ట్రాక్టరు దగ్గరికి ఆ ట్రాక్టరుదగ్గిరికీ వెళ్ళాడు. మనసు స్థిమితం లేదు. అటూ యిటూ తిరిగి చివరకు ఎండలో, బాగా ఎండిన ఒకచోట వెల్లికిలా పడుకొని, కాళ్ళకు జతగా టోపీని అడ్డం పెట్టుకొని, వినిర్మలాకాశంవైపు తదేకంగా చూస్తూ, కలకన్న విధంగా ఆలోచించాడు.

అమ్మదగ్గరకి వెళ్ళతాను. అమ్మను చూసి చాలా రోజులైంది. పెళ్ళికాకముందు కనీసం నెలకొకసారి తల్లిని చూసి రాకపోతే, బెంగగావుంది. పెళ్ళయిన తర్వాత పెళ్లాన్ని చూసుకుంటూ తల్లిమాట మర్చిపోయాను.

తన తల్లి....కళ్ళల్లో మెరిసింది....కొద్దిగా వంగిన నడుంకాస్త పొట్టిగా వుంటుంది. వయసు ముదిరినా చలాకీ తగ్గలేదు. దళనాయకు డెవరైనా కన్పిస్తే, అతనిని కూకలేస్తుంది: "ఏరా అబ్బాయ్, నీ ఉద్దేశం ఏమిటి? నీకు కళ్ళులేవూ? చూడు. మేకలు పంటపొలాలలో పడి మేస్తున్నాయి. కంచలు సరిగా

వుందీ లేందీ చూసుకోవద్దూ. ఆ మాత్రం తీరికలేకపోయిందా? నీవు చేయాల్సిన పనిని నాబోటి ముసల్ది చేసిపెట్టాలన్న మాట. ఆ కంచెకు ఎంతకంత పడిందో పోయి చూడు; పనుగులు ధారాళంగా దూరిపోతాయి. నేను ఆకంతను కొంత వరకు పూడ్చి వచ్చాను" అప్పుడు ఆ దళనాయకుడు అంటాడు: "పెద్దమ్మా, నీవు చేసిన పనికి వంకపెట్టటం ఎవరి తరం! కంతను కొంతవరకు పూడ్చావని నీవు అంటే, అసలు దోమలు దూరటానికికూడా సందులేకుండా పూడ్చి వుంటావు. కనుక అక్కడకు వెళ్ళవలసిన పనేవుండదు. నిర్భయంగా వుండ వచ్చు".

ఇతరులను తిట్టటం, మందలించటం ఆమెకు అలవాటుగా మారింది. ఫ్యోడార్ తండ్రి బ్రతికుండా, ఇంటికొ స్తే పెళ్లాం సాధించని రోజంటూ వుండేదికాదు. సాధించటానికి నిత్యమూ ఏదోఒకసాకు వుండనేవుండేది. ఇంటిని తుడుస్తున్నాడనో, చూడక చెంబునుకాలతోతన్నాడనో, బూట్లు అక్కడా ఇక్కడా పడేశాడనో, మండని కట్టెలు తెచ్చాడనో సాధిస్తుండేది. పాపం! అతనుమాత్రం ఏమిచేస్తాడు: "రసవత్తరమైన సంగీతం పోపు పెట్టి తయారు చేసిన రుచికరమైనకూర" అంటుండేవారు. ఫ్యోడార్ కూడా పలుమార్లు తల్లి తిట్లు రుచిచూసినవాడే. ఆమె జీవితమంతా కష్టాలమయంగా దుఃఖ భాజనం అయినందున ఆమె అలా తయారైంది. అందుకే ఆమె అంటే ఆ వూరివాళ్ళందరికీ ఎంతో యిష్టం.

తల్లి దగ్గరకెళ్ళి, ఈ విషయం చెప్పితే ఎలావుంటుంది? ఆమె అర్థంచేసుకొంటుంది. ముందు గొణిగినా, తిట్టినా చివరకు

నన్ను అర్థంచేసుకొంటుంది.... వెళ్ళి ఈ విషయం తల్లికి చెప్ప టమా? వీల్లేదు. చెప్పకూడదు. ఇక ఆమెకు మిగిలిందల్లా ఒకే ఒక ఆనందం - తన కొడుకులిద్దరూ సుఖంగా వుంటున్నారు. అయి నప్పుడు ఆమె దగ్గరికి వెళ్ళి, నా కష్టాలను వలకబోయటమా? ఆమె మనస్సుకు బాధ కల్గించటమా? దూరంగా వున్నంత కాలం నేను హాయిగా జీవిస్తున్నట్టు ఆమె భావించుకొంటుంది. ఆమెను ఆ భావంతోనే వుండనివ్వటం మంచిది. లాభం లేదు, ఫ్యోడార్. నీఅంతట నీవే పరిష్కారమార్గం వెతుక్కో. అనవ సరంగా కన్నకడుపుకి క్షోభ తెచ్చిపెట్టకు?

ఫ్యోడార్ ఏదో చిక్కులో చిక్కుకున్నాడని వర్వారా స్తెపనోవా ఇట్టే పసికట్టింది. "ఏమిటి, ఎందుకలా విచారంగా వున్నావ్?" అని ఆమె ప్రశ్నించింది. మళ్ళీ ప్రశ్నించలేదు. ఊరుకొంది. ఫ్యోడార్ గుర్రాన్ని తీసుకొచ్చి, గుర్రపు సాలలో కట్టేశాడని ఆమెకు తెలుసు. సిలాంత్రా పెత్రోవిచ్ కుటుంబం సంగతి తెలుసు. అన్నీ అర్థంచేసుకొన్నది కనుకనే అంది. "మా యింటికి వెళ్ళదాం రా. ఎన్నిరోజులుగా మనిద్దరం కలిసి పనిచేస్తున్నా, ఆఫీసులో కల్సుకోటం తప్ప, ఎన్నడూ నీవు మా యింటికి రానేలేదు, పద. మా ఆయన కూడా ఎగిరి గంతేస్తాడు. బంధుమిత్రులెవరైనా వస్తే బుడ్డి మూతవూడుతుంది కదూ; అందుకని అతనికెంతో పరమానందం. అదంటే పడి చచ్చిపోతాడు.

వర్వారా యిల్లు పూరికొంప. రెండే గదులు. అయినా పరిశుభ్రంగావుంది. యింట్లో ప్రవేశిస్తూ, ఎక్కడ తలబొప్పి కడు తుందోనని ఫ్యోడార్ బాగా వంగి, కాలుపెట్టవలసివచ్చింది.

"ఏమిటలా ఎగా దిగా చూస్తున్నావ్?" అన్నది వర్వారా.

"ఇంతకన్న మంచి కొంప దొరకలేదా?"

"ఏం ? ఇతరులనేకమంది ఇంతకన్నా సన్నాని కొంపల్లో వుంటంలేదూ ? వారందరికి మంచి యిళ్ళు లేనప్పుడు నాకుమాత్రం ఎందుకు ? అదేమి భావ్యంగా వుంటుంది ? మేము అడివిలో జీవించాం. సూర్యరశ్మి చూసి ఎరగం. విప్లవానికి పూర్వం మా గ్రామం పరిస్థితి అది. కొత్త యిళ్ళు నిర్మించుకోగల్గిన ఆర్థిక స్తోమత యింకా సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి లేదు"

"అందుకు తప్పు ఎవరిది? క్రోమెస్తోవోలో అనేక కొత్త వీధులు కొత్తఇళ్ళతో వెలిశాయి."

"తప్పా ? నాదే కావచ్చు....భర్త వైపుకు తిరిగి మళ్ళీ యివ్వాళ యిల్లు వూడవలేదు గదా?"

"ఊడవటమా? రోజూ ఊడవాలేమిటి?" అన్నాడు సిగ్గూ యెగ్గూ లేకుండా.

వర్వారా భర్త బక్కపల్చగా వుంటాడు. తెలుపు బారుతున్న పిల్లిగడ్డం నవ్వినప్పుడల్లా బుగ్గలు ముడతలు తేరుతాయి. వర్వారా భర్త, తన అత్తగారు బంధువున్న విషయం ప్యోడార్‌కు తెలుసు. ఆ విధంగా తనకూ వర్వారా కుటుంబంతో బంధుత్వమేర్పడింది. వర్వారాభర్త - ఇగ్నాత్ - కూడా ప్యోడార్ పెళ్ళికి వెళ్ళాడు. పెళ్ళిలో తాగిన సారా అతనికి మత్తెక్కించింది. దమ్మిడీ సారాతో రూపాయి నిషా తెప్పించుకొనే రకం.

"అబ్బబ్బ. మా యిల్లాలు బొత్తిగా సోమరిపోతంటే నమ్ము" అంది వర్వారా స్తెపనోవా.

"ఇంకేం? మంచి ఇల్లాలిని చూసుకో....చూడబ్బాయి, భార్య ఉద్యోగంచేస్తేనైతే, భర్తపడే తిప్పలు యిన్నీ అన్నీ కావనుకో. 'ఇగ్నాత్' ఇల్లు ఊడువు, ఏయ్ పొయ్యి వెలిగించు "ఇదీ వరస. ఈ బ్రతుక్కన్నా కుక్కబ్రతుకే నయం"

"చేసేటప్పుడు, చెప్పుకోంటే తప్పేముందిలే. అవును కూడా ఆయనే సాకుతుంటాడు. ఇంటి పనులలో బహునేర్పరి. రొట్టె తయారుచేయటంలో దిట్ట, ఆయన బిస్కట్లు తయారు చేస్తే ఎంత బాగుంటాయనుకొన్నావ్! ఆవిధంగా చేయటం నాకుకూడా చేతకాదు. ఇంతకీ ఆయనతో చిక్కల్లా ఒకటే. వట్టి సోమరిపోతు అయిపోతున్నారు. బుద్ధి యివ్వకపోతే, ఆరోజు సమ్మె చేస్తాడు. ఒక్కొక్కరోజున యిల్లంతా వెతికినా నోట్లో వేసుకోడానికి ఏమన్నా దొరికితే వట్టు. ఇంటిపనులు వంటపనులు చేతకావనికాదు; స్త్రీవలె మనసువుంచి, వల్లువంచి పనిచేయడు"

వ్యవసాయ క్షేత్రంలో వర్వారా స్తెపనోవా చాలా కఠినంగా, కస్సు బుస్సు మంటూ న్తుంటుంది. కాని, యింటికివస్తే కాఠిన్యమూ మాయమైపోతుంది; కస్సుబుస్సులు ఎగిరిపోతాయి.

"సర్, నేనువెళ్ళి, అది పట్టుకురానా?" అంటూ ముసలాడు వర్వారాకు గుర్తుచేశాడు.

"ఏం? దానికోసమైతే ఎగిరిగంతేస్తావన్నమాట. పాపిష్టివాడా? సరే, పోయి త్వరగా పట్టుకురా"

ఇగ్నాత్ ఖాళీసీసా చేతబట్టి, ముసి ముసి నవ్వులు చిలికిస్తూ, చకచకా బయటకు వెళ్ళాడు,

ఇక వర్వరా ప్రశ్నలతో తనను వేధిస్తుందనుకొన్నాడు ప్యోదార్. ఏమి జరిగింది ? ఎందుకు జరిగింది ? ఎలా జరిగింది? ఇత్యాది ప్రశ్నలు కురిపిస్తుంది కాబోలు. ఇందుకే కాబోలు యింటికి వెంటబెట్టుకొచ్చింది.

కాని, వర్వరా ఆ వైపనోవా ఎట్టి ప్రశ్న వేయలేదు. తనను గురించే చెప్పసాగింది.

"అంతా నన్నే అంటారు. సమిష్టివ్యవసాయక్షేత్రాన్ని సరిగా నడపటంలేదంటారు. నన్నేంచేయమంటాడు? నేనెన్నడు బడికివెళ్ళి చదువుకొన్నదానిని కాను. వయసు వచ్చిన తర్వాత ఎవో నాలుగు ముక్కలు నేర్చుకొన్నాను. పుస్తకాలు తెప్పించి కూడబలుక్కొంటూ చదివితేమాత్రం బుర్రకెక్కేద్దూ ? పదేళ్ళ పసిపిల్లను కాదుగా, ఒకసారి చదివితే, వంటబట్టటానికి ? ఇంత వయస్సు వచ్చిన తర్వాత చదువంటే మాటలా ?"

ఇగ్నాత్ బుడ్డినింపుకొని, ఉరకలువెట్టుకొంటూ రానే వచ్చాడు. యింట్లో అడుగు పెడుతూనే గొడవ ప్రారంభిం ఛించాడు. "వచ్చేశాను. తెచ్చాను. ఇక పుచ్చుకోటమే తరువాయి"

ముగ్గురూ టేబుల్ చుట్టూ కూర్చున్నారు.

"ఆఁ ఇక. త్రాగు. బాబు, త్రాగు."

"మరి నీవో" ప్యోదార్ వర్వరావైపు చూస్తూ అడిగాడు.

"నన్ను బలవంతం చేయకు"

"ఇదిగో అబ్బాయి, నీ పిచ్చిగాని, దీనిపని మనిద్దరం పట్టించలేమా ? అది మనతోపాటు జతకు చూస్తూ కూర్చుం

టుందిలే. మనది దూరపు బంధుత్వమే అనుకో: అయినా బంధుత్వమేగా. నీ ఆయురారోగ్యాలను ఆకాంక్షిస్తూ ఈ మధ్యం సేవిస్తున్నాను."

తాగుతూ పిచ్చిపాటీ మాటాడుకొన్నారు. విత్తనాలు, విత్తనాలేయటం, పెట్రోలు సరఫరా, జనం తగినంతగా లేక పోవటం ఇత్యాది విషయాలు ముచ్చటించుకొన్నారు.

"ఫరవాలేదు. తరుణం మించకముందే విత్తనాలు జల్లగలం ఎలాగో ఒకలాగు పూర్తిచేస్తాం కాని. గడ్డిసమస్యే గడ్డుగా తయారైంది. మన బీళ్ళన్నీ నట్టడివిలో వున్నాయి. ఆ బీళ్ళలో సగం పాడుబీళ్లే. పచ్చగడ్డి బెత్తెడుకూడా పెరగదు. కొడవలితో ఎంతకోసినా గుప్పెడు కాదు. కనుకనే గడ్డి కోసుకురావటానికి ఎంతమందిని పంపినా సరిపోదు. జనంలేరు, జనంలేరు అంటూ పాతపాట పాడవలసి వస్తోంది....అయినా ఈ ఊళ్లో వళ్ళువంచి పనిచేసేవాళ్లెంతమంది? వాళ్ళంతా సరిగా పనిచేస్తే వ్యవసాయ క్షేత్రం ఏనాడో బాగుపడేది. నేను నెత్తిన నోరెట్టుకొని వాగే దాన్ని వాగుతూనే వుంటాను; చెవినిల్లు కట్టుకొని పోరుతూనే వుంటాను. అయితే మాత్రం నా మాట వినేదెంతమంది? కొందరున్నారు; వారికి వాళ్ళ సొంత గొడవలు మినహా, వ్యవసాయక్షేత్రం వూసే పట్టదు. సొంత పనులు చూసుకొంటారు; చేసుకొంటారు; ఉమ్మడిపని వచ్చేసరికి దమ్మిడీపని చేయరు." అంటూ విసుక్కొంది వర్వారా.

"మా అత్త మామలను గురించేనా నీ ఎద్దేవా?"

"నేను ఎద్దేవా చేయవలసిన అవసరమేముంది? కళ్ళారా చూస్తున్నావుగా....అవును ప్యోడార్; నీవు చాలా మంచి

వాడివి. అయినా నీవు యింకా పసివాడివి. తగినంత జీవితాను భవం లేనివాడివి. తప్పటడుగు వేశావు అత్తవారింట యిల్లరికం నీకేం చెప్పు? స్తేపాను విడిచిపెట్టి వుండలేకపోతే, వేరే యిల్లు చూసుకొని, కాపురంపెట్టు, ముసలివాళ్ళ దుష్ప్రభావం నుంచి ఆమెను వేరుచేయి. అలాచేస్తే ఆమెను దారికి తీసుకు రావచ్చు. కాని, నీవు పోయి పోయి ఆ నరకకూపంలో పడ్డావు. వాళ్లు ముగ్గురూ ఏకమై చేసే దాడికి నీవు తట్టుకోలేకపోతు న్నావు. వేగలేకపోతున్నావు"

ప్యోడార్ మాట్లాడలేదు.

"సిలాంతీ అసలు ఎన్నడూ ధనవంతుడు కాడు - ధనవంతుడు కావటానికి కావలసిన లక్షణాలుఅతనిలో బొత్తిగా లేవు. పేరాశవున్నంతమాత్రాన సరిపోయిందా? దురాశ కలవాళ్ళంతా ధనవంతులు కాగలరా? ధనవంతులు కావటానికి కొంత సాహసం కావాలి. ఈ కష్టనష్టాలకు సిద్ధపడి, ముందుకు పోవాలి అంతేకాని, చెంతవున్న నాలుగుడబ్బులు గట్టిగా ముడేసినంత మాత్రాన ధనవంతులవుతారా? అసంభవం. మేము సమిష్టి వ్యవసాయక్షేత్రం ప్రారంభించిన రోజుల్లో ఇదిగో సిలాంతీవంటివాళ్లే ప్రబల శత్రువులుగా తయారయ్యారు. వీళ్ళంతా మధ్యతరగతి వాళ్లే - అయినా వీళ్ళ మనస్తత్వం ధనికరైతుల మనస్తత్వం. అందుకే ప్రబలశత్రువులుగా వ్యవహరించసాగారు. ఇప్పుడు పరిస్థితులు మారిపోయాయి. అందుచేత సిలాంతీబోటివాళ్ళు కొంత మంది పైకి కన్పిస్తారు కాని, వారి మనస్సులు మారలేదు. ఏమీ చేయలేకపోయినా పానకంలో పుడకలాగా వుంటున్నారు.

"నీవు చెప్పుతున్న దానిని బట్టి చూస్తే, మూటా ముల్లె సర్దుకొని ఇక్కడనుంచి పారిపోవటం తప్ప నాకు మరొక మార్గం కన్పించదు!

"అయితే, నేను చెప్పేది అదికాదు. కుళ్ళిపోయిన కుదురునుంచి పన్ను పెకలించు అదీ నీవు చేయవలసిన పని అసలు ఏనాడో చేయవలసింది. ఇప్పుడా పని చేయటం కొంత కష్టమేననుకో, దుక్కి దున్నే గుర్రాన్ని నీవు బలవంతాన వూడదీసి తెచ్చినందుకు స్త్రేషా నిన్ను రాసి రంపాన పెట్టి వుంటుంది. తల్లిదండ్రుల మాటంటే ఆమెకు గురి తక్కువ. ఆ మాటకొస్తే నీ మాటను కూడా లక్ష్యపెట్టదు, అందుకే వచ్చాయి, ఈ విషయాలన్నీ నీతో చెప్పటం, కాకుల మధ్య నివసించే కోకిల కాకిగోలను అలవర్చుకోవాలన్నారు పెద్దలు. నీవు గట్టిగా నిలబడి, పోరాడాలి. తప్పదు.

"నా పని అయిపోయింది. ఎంత సిగ్గుచేటు. తలచుకొంటేనే తలవంపు కలుగుతుంది."

అయినా దానినుంచి తప్పించుకోటం నీ తరమా?.... ఊరికే లేనిపోని మనోవేదన మానసిక బాధ పెట్టుకోకు, చింతిల్లి సాధించగల్గింది లేదు. గుండెను దిటవు పర్చుకోవాలి."

ఇంత సేపు ఇగ్నాత్ నోరు మెదపలేదు. చెవులు నిక్క బొడుచుకొని ఆలకిస్తున్నాడు. బుడ్డికి అన్యాయం జరిగిపోతున్న దని బాధపడ్డాడు.

"సర్ లే, ఈ గొడవలకేమి వచ్చె, ఏ కుటుంబంలోవుండవు యిట్లాంటి కీచులాటలు అవే సర్దుకుపోతాయిలే పుచ్చుకో మరొకడోసు"

"అవునుగాని, నీపనిలో నీవుండు. ఇదిగో, ఇదే చెప్తు తున్నా. ఈమాటలు బయట ఎక్కడన్నా చెప్పావా; మర్యాద దక్కదు. తెలిసిందా...ఆడంగిపనులు చక్కగా నేర్చుకొన్నావు. వాటితోపాటు ఆడంగిలక్షణాలుకూడా నీకు బాగా అబ్బాయి. నిజం దాచుకోటం మెందుకు? లోకులనుగురించి కట్టుకథలు, అపనిందలు పూరంతాచాటడంలో మేటిగా తయారయ్యారు. నీ పిల్లిగడ్డం తగలెయ్యి" అని కసురుకొంది వర్వారా.

"ఏమిటి? నేనా? ఏమిటి వర్వారా, నన్నుగురించి ఇంత అన్యాయంగా మాటాడతావు? దేవుడిచ్చిన నోరుందిగదా అని నోటికొచ్చినట్టు వాగకు. ఇలాంటినింద నామీద ఇంతవరకు ఎవరూ మోపలేదు.

"అయితే మంచిదేలే."

"పైగా, ఫ్యోడార్ నా ఆప్త మిత్రుడు. కాదంటావా నేస్తం?" అప్పుడే నిషా పనిచేస్తోంది.

ఇంతలోకి తలుపు తట్టిన చప్పుడు. అందరి దృష్టి తలుపు వైపు మళ్ళింది.

వర్వారా లేచివెళ్ళి, తలుపుతీసి చూసివచ్చింది.

"నీకోసమే. వెళ్ళు"

స్తేషా చీకట్లో వాకిట్లోగోడకు తల ఆన్చి, నిలబడి వుంది. చీరకొంగు తలపై వేసుకొంది,

వారిద్దరు ఒక్క మాటకూడా మాటాడుకోలేదు. ఒకరి వెంట ఒకరు నడుస్తూ అడుగులో అడుగువేస్తూ, ముందుకు సాగారు. మరికొద్ది క్షణాలలో వాగ్వివాదం ప్రారంభమవు తుంది. ఫ్యోడార్ స్తేషా ముఖంలోకి చూచాడు. గులాబీరంగు

ఆమె చెక్కిళ్ళకు విడాకులిచ్చింది, కన్నీరు మున్నీరుగా పడ్చిందేమో, కళ్ళు కూడా ఎర్రబడ్డాయి.

"మీరు చేస్తున్న పని ఇదన్నమాట. వాళ్ళింటికి పోయి త్రాగుతున్నారు ఆమెకే, మహారాణి, ఏమైనా చెల్లుతుంది... మమ్మల్ని గురించి ఆ దొరసానికి ఫిర్యాదు చేస్తున్నారన్న మాట. నేనప్పుడే అనుకొన్నాను. తప్పకుండా వర్వరా యింటికే వెళ్ళివుంటారని, అదేమి పాపమో, మా కుటుంబం అంటే దానికి ఏమాత్రం గిట్టదు. విషం కక్కుతూ వుంటుంది. దాని కొంప ముదనష్టమైపోను! మమ్మ గురించి, లేనిపోని మాటలు కల్పించి మనిద్దరినీ దూరం చేయాలని చూస్తోంది.

స్తేపా వెక్కి వెక్కి ఏడ్చింది. కుళ్ళి కుళ్ళి దుఃఖించింది. కుమిలి పోయింది.

"తనివితీరా ఏడువు; సొలివచ్చేదాకా దుఃఖించు. కాని నేను ఇక చెప్పుతున్నాను. ఇక ఈ యింట్లో ఒక్క క్షణం కూడా వుండను. కావాలనుకొంటావా నావెంట వచ్చేయ్. లేదంటావా ఇక్కడే వుండిపో. నీకోసం నేను ఈ నరక కూపంలో జీవించలేను. ఇదే ఆఖరు మాట.

"ఇదంతా దానిపనే. అయ్యో, దానికి పోయేకాలం రాను. మాపై అపవాదులువేస్తూ, పండంటి నాకాపురంలో నిప్పులుపోస్తోంది. నేనేం పాపం చేశానని? నాపై ఎందు కింత పగ?"

"వూరికే ఆమెను అలా నిందిస్తావెందుకు? ఇందులో ఆమె ప్రమేయం లేదు. మొదట్లోనే నేనొక పొరపాటు

చేశాను. అత్తవారింటికి యిల్లరికం రావటమే తప్పు. స్త్రేషా, నా మాటవిని వెళ్ళిపోదాం పద; పోయి, హాయిగా వేరే యింట్లో వుందాం."

"నేను ఎక్కడికీ రాను ఇక్కడనుంచి కదలను. ఇక్కడ మాత్రం హాయిగాలేదు? మీపనేమిటో మీరు చూసుకొంటున్నారు. ఇతర బాదరబందీ ఏమీ మీకు లేదుగా, మన జీవితం సుఖంగా గడిచిపోవటం లేదూ? తోటలోపండే కూరలు, ఆవుపాడి...ఈయిల్లు విడిచివెళ్ళితే యివ్వన్నీ కొనుక్కోవలసిందేగా. నీకొచ్చే జీతంతో జీవితం గడవక సతమతమై పోవలసిందేగా."

"స్త్రేషా, ఏమిటీనీభయం? వేరేకాపురం పెట్టినా, కావలసిన వస్తువులన్నీ కొనుక్కోటానికి మనకొచ్చే జీతం సరిపోతుంది"

"ఆబ్బబ్బ! ఆ యిబ్బందులేమిటో నాకు తెలుసు. ఎందుకొచ్చిన వాదులివి? నేను ఇక్కడనుంచి రాలేను. ఎందుకు రాలేవు అని మీరడగవచ్చు....వర్వరాకు మనస్సాఉ వున్నట్టే, మీకూ హృదయం వుంది!....పొద్దున ఫ్యాక్టరీలో పనిచేస్తూంటే కళ్ళు తిరిగాయి. వంట్లో అదో మోస్తరుగా వుంది. నెలలు తప్పాయి....కొన్నాళ్ళకు బిడ్డ తయారు. బిడ్డను యింటికాడ వదిలేసి, ఫ్యాక్టరీకి ఎలా వెళ్ళటం? పోతే, దాదిని పెట్టుకోవచ్చుగా అంటావు. తల్లిని వదిలి, ముక్కుముఖం ఎరుగని దాదిని తెచ్చుకోటమెలా అంటూ, ఇక్కడే అన్నీ చక్కగా అమిరినప్పుడు ఇంకొక యింటికోసం వెతకటం ఎలా చెప్పు?"

స్త్రేషా మళ్ళీ విలపించింది. ఫ్యోడార్ మారుపలకకుండా నిశ్చేష్టుడై నిలబడిపోయాడు.

అవిధంగా వారిద్దరూ యింట్లో ప్రవేశించారు. ఒకరు విలపిస్తూ మరొకరు నోరువిప్పి మారుపలకకుండా. గుమ్మందగ్గర అలెవ్ తినా ఇవనోవా కూతురికీ, అల్లుడికి దర్శనమిచ్చింది. వారి వంక చురచుర చూస్తూ లోనకు వెళ్ళిపోయింది.

స్త్రేషా కడుపున పండు కాయబోతున్నది. బిడ్డయింకా పుట్టలేదు. అయినా వారిద్దరి జీవితాల పైన, ఆలోచనాధోరణల పైన కలుగబోయే బిడ్డ ప్రభావం ఇప్పటినుంచే ప్రసరిస్తోంది,

# 13

ఆరోజున అంత గొడవ జరిగిన తర్వాత, మళ్ళీ అత్త మామలతో కలిసి, ఒకేయింట్లో సహజీవనం సాగించటం ఎలా సంభవమో ఎంత ఆలోచించినా ప్యోడార్‌కు అంతుచిక్కలేదు. అనుదినం అత్తమామల మొఖాల్ని ఎలా చూడగలుగుతాడు? ముఖాముఖి తారసిల్లక తప్పదు; తారసిల్లినప్పుడో మాటమీద మాట రాక తప్పదు.

అసలే అత్తమామ లిద్దరు వసపోసిన పిట్టలు. ఎప్పుడూ ఒకటే వాగుడు. తాను నోరు మూసుకొన్నా నిత్యం వారు వాగుడు వినటం మహాదుర్లభం.

"సమిష్టివ్యవసాయ క్షేత్రంలో జనం ఏమైపోయినా వారికి లెక్కలేదు; అసలు పట్టదు. జనం బాగోగులను గురించి అసలు వారు ఒక్క క్షణంకూడా ఆలోచించరు."

"వారేదో వరగ బెడతారని ఆశించటం మనదే తప్పు" అంటాడు సిలాంతీ.

"ఆవు గడ్డికోసం ఆమడదూరం పోవాలి. దేవుడా అంటూ మళ్ళీ ఆమడదూరం నడిచి రావాలి"

"ఆఁ లేదు. మన యింటివెనక బీడును వేస్తారనుకొన్నావా?"

"ఇవ్వాలనుకొంటే దగ్గర్లో ఎన్ని బీళ్ళు లేవు?"

"అయితే, వెళ్ళు; వెళ్ళి వర్వారాను అడుగు, అడిగితే దాపునున్న బీడు యిస్తుఁదేమో"

"వళ్ళు విరిగేటట్లు మనందరిచేత పనిచేయిస్తారు. అంతే వారికి కావలసిందదే"

అనుదినం ఈవిధంగా సంభాషణ సాగుతుంది. నిత్యం పాడిందే పాట, భరించలేం.

అంతేకాదు. గర్వం ఉట్టిపడుతూ అలెవ్తినా ఇవనోవా గొప్పలు చెప్పుకొంటూ, తీసే రాగాలు కూడా కర్ణకఠోరంగానే వుంటాయి:" మన పంది వుంది చూశారు. అప్పుడే మూడుమళ్ళ బరువు తూగుతోంది. ఇక సమిష్టి వ్యవసాయక్షేత్ర పందులంటారా, మన పందిముందు దిగతుడుపుకైనా పనికిరావు"ముసలాడు మట్టుకు ముసలాడు, తుప్పుపట్టిన మేకులు ఎక్కడ కన్పించినా భద్రంగా తెచ్చి దాస్తాడు. చూస్తేనే అసహ్యమేస్తుంది. చివరకు రోడ్డుపై కన్పించిన తోలు ముక్కలుకూడా చేతపట్టుకొస్తాడు. అన్నీ హేయమైన, హీనమైన పనులే. అలాంటివాళ్ళతో కలసి ప్యోడార్ ఎలా నివసించగలడు?

పోనీ, అత్తమామలతో తెగతెంపులు చేసుకుందామా అంటే, పెళ్ళాన్నికూడా దూరం చేసుకోవలసి వచ్చేట్టుంది, అలాంటి సమయంలో...

అక్కడ వుండిపోవటం అసాధ్యం - అసాధ్యంగా కన్పించింది. అంతే. అయినా రోజులు దొర్లిపోయాయి. ఫ్యోడార్ యింకా అత్తగారింట్లోనే వుంటున్నాడు.

వారు ఎడమొఖం, పెడమొఖంగా, కాలక్షేపం చేస్తున్నారు. అత్తమామల కోరచూపులు శూలాల్లాగా పొడుస్తున్నట్టు అన్పించేది. గత్యంతరం లేదనుకొంటే తప్పితే అత్తమామలు, అల్లుడు మట్లాడుకొనేవారేకాదు. ఏదో తప్పనిసరి అయిన సందర్భాలలో తప్ప ; "ఇదిగో, స్తేపా పేళ్లేయమంటున్నది. గొడ్డలి ఎక్కడున్నది?" ఫ్యోడార్ ముసలివాడిని మామా అని పిలవటం మానేశాడు. 'మామా' అని నోరారా పిలవటానికి అతనికి మనస్సొప్పేదికాదు. సాధ్యమైనంతవరకు వరస తప్పించి మాట్లాడేవాడు

స్తేపా చిక్కిపోయింది. ఆమె అందచందాలు తగ్గిపోయాయి. ఇదంతా కేవలం కడుపు వచ్చినందువల్లనే కాదు. ఆమె ఎప్పుడూ విచారంగా వుంటోంది. భయం, బాధ, నిస్సత్తువ, ఉక్రోషం. గుండెలపై కుంపటిలాగా రగులుతున్నాయి. ఫ్యోడార్ అమాయకుడు; మంచివాడే. ఇంతకీ ఆ పాడుముండ వర్వరా కన్నుకుట్టి, చూడలేక పండంటి తన కాపురంలో నిప్పులు పోసింది అదీ ఆమె మనోవ్యధ. కాలం గడుస్తున్నకొలదీ ఆమె భర్తకు దూరం కాజొచ్చింది.

ప్యోడార్ అప్పుడప్పుడు అనుకొనేవాడు: కౌగిలిలోకి ఆమెను తీసుకొని, ఆమె పెదిమలపై ముద్దులు కురిపిస్తే... హృదయం విప్పిచెప్పితే....ఎందుకొచ్చింది? మళ్ళీ ఆమె కళ్ళంట కన్నీటి ధారలు...కుళ్ళి కుళ్ళి కుమలటం....పిమ్మట పెడ బొబ్బలు...ముసలాడు, ముసల్ది పరుగెత్తుకురావటం.. ఎందుకైనా మంచిది; దూరంగా వుండటమే మెరుగు, సరసాలాడు కొంటూ, చిలక గోరింకలాగా, చిద్విలాసంగా గడపవలసిన రాత్రులు అడివిన కాచిన వెన్నెల చందంగా అక్కరకు రాకుండా గడచిపోతున్నాయి, ఒకే మంచంపై ఒక పక్కైను కావిలించుకొని అతనూ, రెండో పక్కైను కావిలించుకొని ఆమె... దుస్సహం.

పగటిపూట ట్రాక్టర్లతో పొలాలలో వున్నప్పుడు ప్యోడార్ హాస్యోక్తులతో ఇతరులను కడుపుబ్బ నవ్విస్తాడు; కడు పారా తానునవ్వుతాడు,మంకెంకాతో పరిహాసకాలు ఆడుతూ, చిజోవ్‌ను ఉడికిలిస్తాడు. చివరకు హాస్టల్‌లో బల్లపై పడుకొన్నప్పుడూ అతనికి హాయిగానే వుంటుంది. వచ్చి వచ్చి నరక కూపంలో పడ్డానే అని యిప్పుడు అతను బాధపడుతున్నాడు.

అతని మనస్సులో ఎప్పుడూ వేదిస్తూనే, బాదిస్తూనే వుంది. ఈ పాడుబ్రతుకు ఇంకెంతకాలం? దీనికి అంతం ఎక్కడ? ఎప్పుడు?

రోజుపోయి రోజు వస్తోంది. వారం తర్వాత వారం గడుస్తోంది. అయినా అంతం కన్పించటంలేదు;

స్తేపా కాలి బొటనవ్రేలితో నేలను రాస్తూ, నేలకేసి చూస్తూ అడిగింది: "ఏమండీ రేపు మీరు సెలవు పెట్టరాదూ?"

"ఓ, తప్పకుండా సెలవుచీటి పంపిస్తాను. ఏం ? ఏమన్నా పనివుందా?"

ఈరోజు స్త్రేపాయే ముందుగా మాట్లాడింది, అందు లోను సామరస్యపూర్వక ధోరణిలో. ఇది ప్యోడ్యార్ కు ఎంతో ఆనందదాయకమైన విషయం.

"రేపు నాన్న అడవికిపోయి ఆవుకి గడ్డి కోసుకురాబో తున్నాడు. మీరు కూడా వెళ్ళి నాన్నకు కాస్త సహాయం చేయండి. ఆవుపాలు మనంకూడా తాగుతున్నాంగా ! !

"అలాగే"

భార్య పురమాయించిన పని భర్తకు ఏమంత ఆహ్లాదం కల్గించలేదు.

కోడి కూయకముందే సిలాంతీపెత్రోవిచ్, ప్యోడార్ అడవికి బయలుదేరారు. ఎట్లాలేదన్నా అడవి ఆమడన్నర మైళ్ళ దూరం వుంది.

అడవిలో నడుస్తూ, ముళ్ళపొదలు గడుస్తూ, ఎట్టకేలకు మామ, అల్లుడు ఏపుగా పెరిగివున్న బీడుకు చేరారు. ఇంతవరకు వారిద్దరిలో ఎవరూ నోరు విప్పలేదు. ముక్కూ, మొఖం ఎరగని వాళ్ళకుమల్లే వాళ్లిద్దరూ మౌనముద్ర వహించి, ఒకరి వెనుక మరొకరు నడుస్తూ వచ్చారు. చిన్న కాలువ దాటవలసి వచ్చి నప్పుడు మాత్రం సిలాంతీప్రెత్రోవిచ్ నోరు విప్పాడు: "ఈ తాగాడి ఇద్దరిని మోసేటట్టులేదు. కాస్త, నన్ను దాట నియి. తర్వాత నీవు వద్దువుగాని" అంతే మళ్లీ వాళ్లిద్దరూ మాటాడుకోలేదు.

గడ్డి దట్టంగా పెరిగి వుందేమో, చకచక కొడవలితో కోస్తున్నారు. గడ్డిపనలు బారులుతీరుతున్నాయి.

తూర్పుదిశనుంచి సూర్యభగవానుడు నెమ్మదిగా పశ్చిమాద్రికి పయనిస్తున్నాడు. వంచిన నడుం ఎత్తకుండా గడ్డి కోస్తున్నారు. మామ, అల్లుళ్ళు అలసిపోయారు. రెండు మూటలైంది. ఇద్దరికీ దాహం వేస్తోంది. ఒకరి కొకరు పోటీ పడుతూ పనిచేస్తున్నారు. ఎవరి మునుం తొందరగా పూర్తి అవుతుందా అన్న పట్టుదలతో గడ్డికోస్తున్నారు.

రెండు మునుములు పూర్తి అయ్యాయి. కాళ్ళలో సత్తువ ఉడిగిపోతోంది కాళ్ళీడ్చుకొంటూ వాళ్ళిద్దరూ యింటికి తిరిగొచ్చారు. హాయిగా వేన్నీళ్ళ స్నానం చేసి, సహపంక్తి భోజనం చేస్తూ -

"మరొక వారం రోజులు పోతే, గడ్డి బాగా ముదిరి, ఎందుకూ పనికిరాకుండా పోయేది" అన్నాడు ప్యోడార్.

"నిజమే, ఆవునోటికి అలిమి కాకుండా ముదిరిపోయేది. అబ్బాయ్, ఏమాటకు ఆమాటే చెప్పుకోవాలి. నామునుంకన్నా నీ మునుమే పెద్దది, అయినా నాకన్నా నీవే గడ్డికోతను ముందు పూర్తిచేశావ్."

"దానికేమొచ్చిలే"

కాస్తదూరాన నిలబడి. పాలు త్రాగుతున్న స్తేషా నాన్న, భర్త కలసి భోంచేయటం చూస్తూ, ఆనంద పారవశ్యం పొందింది. ఇంట్లో కీచులాటలు సమసిపోయాయి. శాంతి తిరిగి నెలకొన్నది.

# 14

మరుసటి రోజు ఉదయానే ఫిదోత్ నొసావ్ సిలాంతీ యింటికొచ్చాడు. పొడుగ్గా, బక్కపల్చగా వుంటాడు. సగం పడిదాటుతోంది: అతను ఒక ఠౌనుకు నాయకుడు. తరచు సిలాంతీ యింటికొస్తుంటాడు. సిలాంతీ, నొసావ్‌ల సంబంధాలు చాలా విచిత్రంగా వుంటాయి. వాళ్ళిద్దరూ మిత్రులో, శత్రువులో కూడా ప్యోడార్‌కు అర్థం కావటంలేదు.

ఒక్కొక్కప్పుడు కస్సుబుస్సుమంటూ యింట్లో కాలు పెట్టిన ఫిదోత్ నొసావ్ కూర్చోమన్నా కూర్చోకుండా ఏవో నాలుగు మాటలు అనేసి తిరిగి పోతాడు.

మరికొన్ని సందర్భాలలో పిలవని పేరంటానికి వచ్చిన ముత్తయిదులాగా సరాసరి యింట్లోకివచ్చి, బల్లపై కూర్చొని, విడిచిన బూట్లను బల్లక్రిందకు నెట్టి. లోకాభిరామాయణం ప్రారంభిస్తాడు. వృద్ధ స్నేహితులిద్దరూ మద్యం సేవిస్తూ కులాసాకబుర్లు చెప్పుకొంటూ కాలక్షేపం చేస్తుంటారు.

ఇవాళ ఎందుచేతనోగాని ఫిదోత్ నొసోవ్ గదిలో మధ్యలోనే నిలబడి, తాను చెప్పదల్చుకున్న నాలుగు ముక్కలు చెప్పేశాడు.

"సిలాంతీ, రేపు గడ్డికోతకు పోవాలి. అందుకు తయారుగా వుండు."

"అలాగే. నలుగురితోపాటు నారాయణ" తడుము కోకుండా సమాధాన మిచ్చాడు సిలాంతీ పెట్రోవిచ్,

"ఈ సంవత్సరం నీవు వంటపని చేయవీల్లేదు. ఇది వర్వారా ఉత్తరువు. వంటపనిని క్లావిద్యాకు అప్పచెప్పుతారట. పాపం, ఆమె ఆరోగ్యం అంత బాగాలేదు. అందుచేత కాస్త తేలికపని పురమాయిస్తున్నారు. మీఆవుకి సంవత్సరం పొడుగునా సరిపడ్డ గడ్డిని నీవే కోసుకొస్తున్నావుగా. అయినప్పుడు సమిష్టి వ్యవసాయ క్షేత్రం పనికూడా కాస్త చేసిపెట్ట లేవేమిటి ?"

"మీకు సిగ్గులేమూ? కాటికి కాళ్లారజాపిన ముసలాడిచేత బండచాకిరి చేయిస్తారా? ఏదో తప్పక, నానా అవస్థలో పడుతూ మా ఆవుకి గడ్డికోసి, తెచ్చుకుంటున్నానే అనుకో, అది చాలక ఈ తద్దినం ఒకటూ? వీల్లేదు. మామూలు ప్రకారం నేను వంట మాత్రమే చేస్తాను"

"నా కెందుకొచ్చిన గొడవ, వర్వారా చెప్పుతున్న మాటలు నీతో చెప్పాను. పోతున్నా" అంటూ ఫిదోత్ వెను దిరిగి, ఎక్కడ తగులుతుందోనని, మాడు ఎక్కడ పగులుతుందో నని తల బాగా వంచుకొని బయటకు వెళ్ళిపోయాడు.

"వర్వారా ఉత్తర్వులట! ఉత్తర్వులు! తన ముసలాడిని మాత్రం పొయ్యిదగ్గరనుంచి కదపదు, ఎదటివాళ్ళు తేరగా వున్నారు! పెదోత్ వచ్చి, కొయ్యలాగా నిలబడివున్నప్పుడే అను కొన్నారు ఏదో మూడుబోతుందని. వేసవికాలమంతా వళ్లు హూనమయ్యేటట్టు మీచేత పని చేయిస్తారు. దానికి ముట్టజెప్పే ప్రతిఫలం ఏమిటి? నోరు తెరచుకొని, పడిగాపులు పడివుంటే, ఏదో ఇంత మా మొఖాన పారేస్తారు"

పెళ్ళాంగొణుగుడుకు అడ్డం తగులుతూ సిలాంతీ పెట్రోవిచ్ అన్నాడు:

"అంతటితో చాలించు మన బ్రతుకులకు ఇదే తెరువు. ఎలాగోలాగ బండిలాగక తప్పదు. సరేగాని, ఇంట్లో సారాయి ఏమన్నా వుందా?"

"సారా....సారా....ఎప్పుడూ అదే రంది. ఇదేమన్నా సారాకొట్టు అనుకొన్నావా?"

మళ్ళీ సాయంత్రం టీమునాయకుడు ఫిదోత్‌నొసొవ్ వచ్చాడు. ఈ దఫా అతని తీరు, తరహా వేరుగావుంది వచ్చీ రావటంతోనే బల్లపై కూలబడ్డాడు. నెత్తిపై టోపీ తీసి చేతితో జుత్తు సవరించుకొన్నాడు. అప్పుడు ప్రసంగం ప్రారంభించాడు; స్నేహపూర్వకంగా, కొంచెం మందలిస్తూ:

"సిలాంతీ, వయస్సు సాకుచూపి, పనిపాటలు చేయకుండా తప్పించుకోటంలో నీవు సిద్ధహస్తుడివి. నామాట విని యీనాడు బుద్ధిమార్చుకో. నీకు ముసలితనం వచ్చినమాట నిజమే. అయినా నాశరీరం యింకా యినపకట్టేలా వుందారొ. ఎంతబండ పనినైనా సునాయాసంగా చేయగలవు. క్లావిద్యా వయస్సులో నీకన్నా చిన్నదైనా, ఆమె రోగిష్టిది. పాపం, పని పాటలు చేయలేని మనిషి."

ఈ సంభాషణ చివరకు ఎలా ముగుస్తుందో ప్యోడార్‌కు పూర్తిగా తెలుసు. అందుచేత విసుగుచెంది, వెళ్ళి పడకగదిలో పడుకొన్నాడు. తర్వాత కొద్దిసేపటికి స్తేపా గదిలోకి వచ్చింది.

"ఏమండీ, మీరు ఇలావచ్చేస్తే ఏం బాగుంటుంది ? లేచి రండి. కొత్తవాళ్లున్నప్పుడు యిలా వచ్చేయటం మంచిదికాదు."

ఫ్యోడార్ గోడవైపుకు ముఖంతిప్పి పడుకొన్నాడు.

"నేను రానులే వెళ్లు."

స్తేషా ఒకక్షణంసేపు అలాగే నిలబడి, ఇక లాభంలేదని తిరిగి వెళ్ళిపోయింది.

మరుసటి రోజు ఉదయాన ఎప్పటి మాదిరిగానే సిలాంతీ పెట్రోవిచ్ మళ్ళీ వంటపనిలో నియుక్తుడయ్యాడు. ఇది ఎవరికీ ఆశ్చర్యం కల్గించలేదు,

ఎలాంటి గొడవ జరగలేదు. అరచుకోటాలు, తిట్టుకోటాలు లేవు. పొద్దుగూకగానే యింట్లో రభస జరగటంలేదు. అయినా సిలాంతీ ర్యాప్కిన్ ఇంట్లో పరిస్థితులు ఇంతకుపూర్వం మాదిరిగానే యథాతథంగా వున్నాయి.

మళ్లీ స్తేషా భర్త కంటపడకుండా, దూరంగా వుంటూ సాధ్యమైనంత వరకు తప్పించుకు తిరుగుతోంది. ఫ్యోడార్, సిలాంతీ మళ్ళీ ఎడమొఖం, పెడమొఖంగా వుంటున్నారు. ముసల్ది మళ్ళీ గొణుగుడు ప్రారంభించింది "అరి భగవంతుడా! ఎలాంటి అల్లుడిని తెచ్చిపెట్టావురా ? ముసలితనంలో వున్న మాకు రేయింబవళ్ళు వళ్ళు హోనం చేసుకొంటూ కాయకష్టం చేస్తుంటే, అల్లుడుగారు పనిపాటలు లేకుండా వూరట్టుకు తిరుగుతున్నాడు· అన్నిపనులు మానెత్తినే పడేసి పెత్తనాలు వెలగబెట్టుతున్నాడు" ఈసాధింపులు ఫ్యోడార్ చెవినపడితే, మరుసటి రోజు ఉదయాన ఇంటిపనులకు సిద్ధమవుతాడు. కాని, రెండు రోజులు గడిచిన తర్వాత మళ్లీ పరిస్థితి యథాస్థితే.

సాధ్యమైనంతవరకు యింటికీ, యిల్లాలికీ దూరంగా వుండాలని ఫ్యోడార్ ప్రయత్నిస్తున్నాడు. పొద్దున్నే పనికి

బయలుదేరి వెళ్ళి, మళ్ళీ రాత్రి పొద్దుపోయిన తర్వాత యింటికి తిరిగొస్తున్నాడు. ఎక్కడ వీలైతే అక్కడ కాంటీన్‌లోనో, తోటి డ్రైవర్లతో కలిసో-భోంచేస్తున్నాడు. అందుచేత జీతంలో కొంతభాగం ఖర్చయిపోతోంది. ఇంతకు ముందులాగా జీత మంతా మూటగట్టి భార్యకు ఇవ్వలేక పోతున్నాడు. ఈ విష యం అత్తకు తెలిస్తే, ఇంకేమన్నా వుందా? స్తేషాకు నూరి పోస్తుంది: "చూడమ్మా, నీమొగుడు ఏంచేస్తున్నాడో? తాగి తందనాలాడుతున్నాడు. కుటుంబం ఏమైపోయినా, ఆయనకు అక్కర్లేదు. నిన్ను రాసి రంపాన పెడుతున్నాడే తల్లీ."

పగలల్లా పనిచేసి. ఇంటికి తిరిగొస్తుంటే, వళ్ళు నొప్పులు కాళ్ళనొప్పులు ఎక్కడలేని అలసట ఆవహిస్తాయి. పని చేస్తు న్నంతసేపు అలసట కానరాదు - పెట్రోలు సంపాదించటం లోను, ఇతర టీమునాయకులతో అరుస్తూ వాదించటంలోనో, "స్పేర్ పార్టులు" త్వరగా పంపించమని టెలిఫోనులో గొంతు చించుకోటంలోనో పగలంతా గడిచిపోతుంది సాయంత్రమయ్యే సరికి వంట్లో సత్తువ కాస్త హారతికర్పూరంలాగా హరించుకు పోతుంది.

అతను వూళ్లోగుండా కాళ్ళీడ్చుకొంటూ యింటికొస్తాడు వెంటనే మంచంపై మేనువాల్చి, నిశ్చింతగా నిద్రపోదామను కొంటాడు. కాని మనసు కలతచెందుతూనే వుంటుంది. హృదయంలో వేధిస్తూనేవుంటుంది. యింట్లో అడుగు పెడుతూనే మీరు నిర్మించిన మెట్లు ఎక్కుతున్నాను. గదిలో కాలిడుతూనే స్తేషా శుభ్రపర్చిన ప్రాంతంలో పాదం పెడుతున్నాను? మంచంపై మేను వాల్చుతూనే భార్య అమ

ర్చిన పడకపై పడుకొంటున్నాను. అని అతని మనస్సులో పీడి స్తుంటుంది. ఇంట్లో ప్రతీవస్తువు అదే విషయం పదేపదే గుర్తు చేస్తుంటాయి - తిన్న యింటివాసాలు లెక్కపెట్టుతున్నావు సుమా! ఇది న్యాయంకాదు!! కొన్ని సంవత్సరాలలో చివరకు గట్టిగా గాలి పీల్చటానికికూడా అతను సాహసించేవాడు కాదు. చివరకు ఆ యింట్లో గాలికూడా తనదికాదు; ఆ గాలిపైకూడా తనకెట్టి హక్కులేదు,

స్త్రేషా బాగా చిక్కిపోయింది: పాలిపోయింది మూగ దానివలె నోరు మెదపకుండా, కంటతడి పెట్టుకుంటూ ఫ్యోడార్ ముందు ప్రత్యక్ష మవుతూండేది. ఈ దృస్యం మరీ దారుణం. దుస్సహం. అంతేకాదు. ఏమిటి? ఏంజరిగింది? ఎందుకు అంత విచారంగా వున్నావు? ఏం కష్టమొచ్చింది? అని అడిగేందుకు కూడా ఫ్యోడార్ నోచుకోలేదు అసలు ఆ ప్రశ్న అడగవలసిన అవసరం లేకుండా అంతా అవగతమవుతోంది. అసలు వారి జీవితమే దుఃఖభాజనమైంది అందుకే ఆమె విలపిస్తోంది; పరిత పిస్తోంది. ఆమె మనస్సులో చిచ్చుపెట్టినదెవరు? ఇంకెవరు? అతనే; తన భర్త - అదే ఆమె నిశ్చితాభిప్రాయం. అయినప్పుడు అడిగి ప్రయోజనమేమిటి? అలా అని అడగకుండా మిన్నకుండ టమూ అంత తేలికైన విషయం కాదు. ఇంతకన్నా ఈ ఇంట్లో నుంచి లేచిపోయి, ఏపుట్టప్రక్కనో, ఏ చెట్టుక్రిందనో రాత్రులు గడిపేస్తే ఎంతో బాగుంటుందిగదా? కాని, అలా చేయటం సంభవమా? సమంజసమా? ఇష్టమున్నా లేకపోయినా, కష్ట మైనా ఒకే మంచంపైై పెళ్లాంతోపాటు పడుకోక తప్పదు.

లేకపోతే లోకం మెచ్చదు. పైగా కోడై కూస్తుంది. ఆడి పోస్తుంది.

అందుకే యథాప్రకారం మార్పులేకుండా రోజులు గడిచి పోతున్నాయి.

ఇలా కలకాలం కొనసాగ వీల్లేదు. ఎప్పుడో ఒకప్పుడు, ఎప్పుడో ఒకదానికి అంతం వుండాలి. అదెంత త్వరగా వస్తే అంత మంచిది. అది దుఃఖాంతమే కావచ్చు; శోచనీయమైన సంగతేకావచ్చు. ఈమానసిక క్షోభకన్నా దుఃఖాంతమేమెరుగు. ఒక ఏడ్పుపడ్చి వూరుకోవచ్చు.

ఈ విధంగా జీవించటం దుస్సహం.

అసంభవం - అయినా రోజులు అలాగా దొర్లిపోతు న్నాయి ఫ్యోడార్ ఊళ్లో, వీధుల్లోగుండా కాళ్ళీడ్చుకుంటూ సిలాంతీ పెట్రోవిచ్ యింటికి చేరుకొంటూనే వున్నాడు.

# 15

ఫ్యోడార్ వద్ద ఒక నోట్ బుక్ వుంది. రోజూ ట్రాక్టర్లు దున్నినభూమి వివరాలు, ఖర్చుఅయిన పెట్రోలు అంకెలు అతను అందులో వ్రాస్తుంటాడు చెమటతో తడిచి, చితికి పోయిన ఆ నోట్ బుక్ ఎప్పుడూ అతని చొక్కా జేబులోనే వుంటుంది ఒకనాడు పొరపాటున విడిచిన చొక్కా జేబులోనే ఆ పుస్తకం వదిలిపెట్టి, పొలానికి వచ్చేశాడు.

ఆ నోట్ బుక్ కోసం ఫ్యోడార్ మళ్ళీ యింటికి తిరిగి వచ్చాడు. ఇంటి ఆవరణలో అడుగు పెట్టగానే "మేఁ, మేఁ" అంటూ ఆక్రోశిస్తున్న మేక అరుపులు అతని చెవినిబడ్డాయి. ఇంటివెనుకవైపునుంచి ఆ అరుపులు విన్పిస్తున్నాయి. సిలాంతీ ర్యాప్కిన్ యింట్లో మేకలు లేవు. అది ఎవరిదో అయివుంటుంది. తప్పించుకుని ఈదొడ్లోకి వచ్చి వుంటుంది. దొడ్లో ప్రవేశించిన ఆ మేకను బయటకు తరుముదామని ఫ్యోడార్ ఒక కర్రపుల్ల తీసుకొని యింటి వెనుకవైపు దొడ్లోకి వెళ్ళాడు.

తీరా వెళ్ళితే ఫ్యోడార్ కు కన్పించిన దృశ్యం ఏమిటి? స్తేషా, ఆమె తల్లి మేకను పట్టుకొని చావబాదుతున్నారు.

ఫ్యోడార్ మనస్సు చివుక్కుమంది. ఇంత దారుణమా అనుకొన్నాడు,

తాపులబాధ భరించలేక ఆమేకవిలవిస్తూ అరుస్తోంది. చూస్తేఎవరికైనా జాలివేస్తుంది.

ఇంత ఘోరమా? ఫ్యోడార్ తల అవమానభారంతో వంగిపోయింది,

నోట్ బుక్ మాటకూడామరచిపోయి ఫ్యోడార్ అక్కడనుంచి తిరుగుముఖం పట్టాడు. పొలం వెళ్ళాడు.

ఒకవేళ ఆమేక దొడ్లో ప్రవేశించి, మొక్కలను నాశనం చేస్తే, కర్రపుల్లతో ఒక దెబ్బవేసి బయటకు తోలాలి కాని, దానిని అలా చిత్రహింసల పాల్జేయటమా? ఆ జంతువు అలా గిలగిలా తన్నుకుంటూ అరుస్తోంటే తల్లీ, కూతురు ఎలాసహించగలిగారు? ఇది వాళ్ళిద్దరి మానసిక ప్రవృత్తికి తార్కాణమా?

అవసరమొస్తే చివరకు మానవులను నిలబెట్టి, చర్మాలు వలవడానికైనా వారు వెనుదీయరు! ఛీ. ఎలాంటి మనుష్యులు!! చివరకు స్త్రేషాకూడా ఇలా తయారైందే?

ఇదా అతిసాధారణమైన సంఘటన. దొడ్లోపడి మొక్కలు మేస్తున్న మేకను కొట్టటం ఎక్కడైనా జరిగేదే. ఈ ఘటన వల్ల తన మనస్సుకు బాధ కల్గిందని ఫ్యాడార్ అంటే, అంతా నవ్విపోతారు. "నీకు పిచ్చేమన్నా పట్టిందా?" అని హేళన చేస్తారు. ఈ గొడవ మర్చిపోవటం ఉత్తమం అనుకొన్నాడు. మర్చిపోదామని ఎంతగా ప్రయత్నించినా మర్చిపోలేకపోయాడు ఇక ఆ యింటికి వెళ్ళటమంటేనే ఎక్కడిలేని అసహ్యం పుట్టుకొచ్చింది. ఏమైనా సరే ఇక ఆగడప తొక్కకూడదని తీర్మానించుకొన్నాడు.

కాని, త్వరలో తానొక బిడ్డతండ్రి కాబోతున్నానన్న విషయం మళ్ళీ అతనికి గుర్తుకొచ్చింది.

అయినా తాను చేయగల్గిందేమిటి?...పుట్టబోయే బిడ్డకోసం అత్తమామలు చెప్పినట్లల్లా నోరు మూసుకొని వినటమా? ఆ నరక కూపంలో జీవితం గడపటమా? ఆత్మాభిమానం చంపుకోటమా?

అసంభవం. తాను ఆ పనిచేయలేడు. తెగతెంపు చేసుకోవలసిన తరుణం వచ్చింది. పాడు కొంపను వదిలిపెట్టక తప్పదు.

*　　　*　　　*

అడవి సరిహద్దుల్లో, పొదల చాటున ఇలాతలాన్ని బద్దలుచేస్తూ, రణగొణ ధ్వనితో ట్రాక్టరు ముందుకు సాగుతోంది.

ఫ్యోడార్ సరాసరి ఆ ట్రాక్టర్ వద్దకు వెళ్ళాడు. చిజోవ్ దానిని నడుపుతున్నాడు. ఫ్యోడార్ రాకను గమనించిన చిజోవ్ ట్రాక్టరును ఆపుచేసి. క్రిందకు దిగివచ్చాడు.

"ఏం ? ఫ్యోడార్, పెట్రోల్ తెప్పించే ఏర్పాట్లు చేశావా?"

"లేదు, నోట్ బుక్ ఇంటిదగ్గర మర్చిపోయాను."

"వెళ్ళి తీసుకురాక పోయావా ?

ఫ్యోడార్ క్షణంసేపు మౌనంగా నిలబడ్డాడు. ఏమీ సమాధానం చెప్పలేదు. కాస్త తేరుకొని అన్నాడు.

సరేగాని, నీవు పోయి ఆ నోట్ బుక్ కాస్త తెచ్చి పెట్టవా?"

"నీవే వెళ్ళి రావచ్చుగా?"

"ఏం ? ఆ మాత్రం వెళ్ళిరాలేవా?"

"సరే, ఈ ట్రాక్టరు నడుపుతూవుండు. ఆఘమేఘాల మీద వెళ్ళి పట్టుకొస్తా."

చిజోవ్ ప్రయాణ మయ్యాడు, కాని, ఫ్యోడార్ అతని చొక్కా పట్టుకొని, ఆపాడు. ప్రక్కకు తీసుకెళ్ళాడు.

"నీతో ఒక విషయం చెప్పాలి:"

వాళ్ళిద్దరూ పొదచాటున నీడలో కూర్చున్నారు: పాత మనస్పర్ధలు చాలాకాలం క్రితమే మర్చిపోయినప్పటికీ, ఫ్యోడార్

తన యింటి గొడవలు గురించి చిజోవ్‌కు ఎన్నడూ చెప్పలేదు. ఇంటి గుట్టును రచ్చకీడ్చటం అతనికి యిష్టంలేదు. అందులోను చిజోవ్‌కు తన గృహ చ్ఛిద్రాల విషయం చెప్పటం అతనికి మరీ నామోషి, కాని ఇప్పుడు అతనికి ఆ బాధలేదు. ఇవాళ కాకపోతే రేపైనా వాస్తవం అందరికీ తెలీకమానదు. ఎందుకొచ్చింది? ఇప్పుడే స్వయంగా చెప్పేయటమే మంచిదనుకొన్నాడు ప్యోడార్.

ప్యోడార్ చెప్పాలనుకొన్నాడేగాని చెప్పలేకపోతున్నాడు. సిగరెట్ కాల్చుతూ అలాగే వుండిపోయాడు. ప్యోడార్ ఏమి చెప్పుతాడా అని చిజోవ్ ఆసక్తితో నోరు తెరచుకొని ఎదురు చూస్తున్నాడు. గాలికి వూగుతున్న పొద రెమ్మలు వాళ్ళ నెత్తిపై చిందులాడుతున్నాయి.

"ఇంతకీ విషయ మేమిటో త్వరగా చెప్పేయ్" చిజోవ్ ఉండబట్టలేక అన్నాడు.

"మరేఁ, ఇంటిదగ్గర చేప్పేసిరా...." చెప్పలేక మధ్యలోనే ఆగిపోయాడు. "దిగజారిపోయిన సంకల్పాన్ని మళ్ళీ పుఁజుకొని" వాళ్ళతో చెప్పిరాలేను ఇక నాజన్మలో ఆగడప తొక్కనని చెప్పు నా సామానుఅంతా సర్ది పంపించమను. ఒక్క వస్తువుకూడా మిగల్చవద్దని చెప్పు. నేనుకూడా వచ్చి నీతోపాటే జీవిస్తాను"

"నీకేమన్నా పిచ్చెత్తిందా! మతిభ్రమణం కల్గిందా?"

"సాయంత్రం వచ్చి నా వస్తువులన్నీ పట్టుకెళ్ళుతానని నీవు యింటిదగ్గర స్పష్టంగా చెప్పి మరీరా"

"ఫ్యోడార్ నీవు చెప్పేది నాకు బొత్తిగా బోధపడకుండా వుంది"

"ఇందులో అర్థం కాని విషయం ఏముంది? ఆకొంప నా పాలిట నరకకూపంగా తయారైంది. ఆ కొంపలో ఇక నేను జీవించలేను అంతే"

"ఇంతకీ నీకు వచ్చిన ఇబ్బంది ఏమిటో....?"

"అదంతా అర్థమయ్యేటట్లు విడమర్చి చెప్పాలంటే, చాలాసేపు పడుతుంది. అదీ కాక మాటల్లో విడమర్చటం అంత తేలికకూడా కాదు. స్వయంగా అనుభవించిన నాకు తెలుసు. వాళ్ళు కఠినాత్ములు, కర్కోటకులు. వాళ్ళతో కలిసి జీవించటం నావల్లకాదు. ఏమిటని మళ్ళీ అడగబోకు నన్ను వేధించకు చెప్పినట్టుచెయ్యి అసలే నామనస్సు బాగాలేదు. పైగా లేని పోని ప్రశ్నలు వేసి మరింత చికాకుపర్చకు"

చిజోవ్ కాసేపు నిర్విణ్ణుడై నోరు మెదపలేకపోయాడు ఫ్యోడార్ కూడా మాట్లాడలేదు. చిజోవ్ సందేహిస్తూ లేచి నిలబడ్డాడు. తలగోక్కుంటూ ప్రయాణమయ్యాడు. నెమ్మదిగా ముందుకు సాగాడు.

ఫ్యోడార్ సిగరెట్ పీకను అవల పారేసి, ట్రాక్టరు వైపు నడిచివెళ్ళాడు.

ఫ్యోడార్ ట్రాక్టరు పైకెక్కి దానిని నడపసాగాడు,

చిజోవ్ చాలా త్వరగా తిరిగొచ్చాడు.

"వాళ్ళతో చెప్పావా? చెప్పమన్నదంతా చెప్పావా?"

"అంతా చెప్పేశాను. ఒక్కమాట కూడా వదిలిపెట్టకుండా, పూసగుచ్చినట్లు నీవు చెప్పినదంతా చెప్పాను."

"వాళ్లేమన్నారు."

"ఏమంటారు? స్త్రేషా భోరున ఏడ్చింది. కొంతసేప యినాక కోపంపట్టలేక నిన్ను తిట్టిపోసింది. నిన్నే కాదు; నన్ను కూడా తిట్టిందిలే. నా మీదపడి రక్కుతుందేమోనన్నంత భయ మేసింది... ...ఆరోజుల్లో ఆమె ఎంత అందంగా వుండేది."

చిజోవ్ నోటినుంచి వెలువడిన ఆఖరి వాక్యంతో ప్యోడార్‌కు మునుపటి స్త్రేషా రూపు రేఖలు కళ్ళలో మెరి శాయి; ఆమె అందచందాలు హృదయంలో మెదిలాయి.

అలాంటి స్త్రేషా ఈనాడు అంత వికారంగా తయా రైంది. ముఖం పాలిపోయింది. కోపతాపాలతో. ఆవేశ కావే షాలతో ఆమె ముఖం భీకరరూపం తాల్చింది. ఇంకా ఆ మొఖానికి అంతమేమిటి ?

ఇప్పుడు ప్యోడార్ అంటే చిజోవ్‌కు అసూయలేదు. పూర్వం అయితే, అందమైన యువతులంతా ప్యోడార్‌పై ఎగబడేరోజుల్లోఅసూయపడితేఅర్థంపర్థంవుంది.ఇంకాఇప్పుడెందుకు అసూయ? ప్యోడార్ స్థితినిచూసి చిజోవ్ అసూయ చెందలేదు; అతనికి నిజంగా జాలివేసింది.

వేసవికాలమేమో, సూర్యరశ్మితో భూమి వేడెక్కింది.

నేలపై బోర్లా పడుకొని బోరుబోరున ఏడ్వాలని ప్యోడార్‌కు అనిపించింది. తనజీవితమంతా మట్టిపాలై పోయింది.

యమయాతనలను కూడా అభిమానం జయిస్తుంది. చిత్ర హింసలు సహించినా, అవమానం భరించటం కష్టం. ప్రాణ హాని కన్నా మానహాని దుస్సహం.

చిజోవ్ ప్రక్కనే నిలబడివున్నాడు. అతను చూస్తుండగా పడ్వటం తలవంపు అని ప్యోడార్ భావించాడు. అందుకే పొర్లుకొచ్చిన దుఃఖాన్ని ప్యోడార్ దిగమింగుకొన్నాడు.

# 16

అది అతి సాధారణమైన పూరిల్లు. దుంగలతో, వాసాలతో, రెల్లుగడ్డితో నిర్మించినకొంప. వున్న కిటికీలన్నీ చిన్నవే. ఆ యింటి దొడ్డో పెద్ద బాదంచెట్టు, ఇంకొంచెం ఆవల చిన్న పెడ్డు వుంది. దొడ్డినిండా గడ్డి దట్టంగా పెరిగింది. ప్రహరీలేదు, అయితే చుట్టూ కొయ్యముక్కలు దట్టంగా నాటి, దొడ్డి రక్షణకు దడి ఏర్పాటు చేశారు.

అది మామూలీ కుటీరం. ఆ కుటీరంలో విశేషమేమీ లేదు. ఊళ్లోవున్న అనేక పూరికొంపలలో అదొకటి అంతే. అన్ని కొంపలకూ ఉన్నట్టే; ఆ కొంపకు కొయ్యముక్కల దడి వున్నది. ఇందులోనూ ప్రత్యేకత ఏమీలేదు. ఆ దడి ఎత్తు పదడుగులన్నా లేదు. బయటనుంచి పిల్లి కూడా దూర సందులేనంత దట్టంగా వుంది ఆ దడి. చిన్న రక్షణదుర్గం వంటిది.

ప్యోడార్ ఇక అక్కడ వుండలేకపోయాడు. ఆ ఇల్లు విడిచి వెడలిపోయాడు.

*　　*　　*

అతను ఇల్లు విడిచి వెళ్ళిపోయిన తర్వాత వారంరోజులకు స్త్రేషా పుట్టినరోజు పండగ వచ్చింది. అది 20 వ, పుట్టినరోజు పండుగ. యథాప్రకారం ఆమె తల్లి దండ్రులు ఆరోజున ఆమెకు ఖరీదైన దుస్తులు కొన్నారు. పెద్ద పండగ జరిపినట్లు పిండివంటలవీ చేశారు. ఆమె తండ్రి అలవాటు ప్రకారం మధ్యం కూడా తెచ్చాడు. చిన్న గ్లాసులో మధ్యం పోసి ఆమె తల్లికి ఇచ్చాడు. "మా వరహాల మూట, మా అందాల మాల, మా చిట్టి చిట్టితల్లికి ఆయురారోగ్యాలు కలగాలని దేవుడిని ప్రార్థిస్తూ" వాళ్ళిద్దరూ మధ్యం సేవించారు.

సిలాంతీపెట్రోవిచ్ మీసాలు సవరించుకొన్నాడు. అన్నీ యథాలాపంగా, యథాప్రకారం జరిగిపోయాయి. పోతే లోపించినదీ, కరువైనదీ ఒకడే.

ఆనందం, సంతోషం.

స్త్రేషా ఇంతప్పటినుంచి పుట్టినరోజు పండుగలు చేసుకొంటున్నది. ఇన్నేళ్ళుగా పుట్టినరోజు పండుగలో పొందిన ఆనందానుభూతి ఎందువల్లనో ఈయేడు ఆమె పొందలేక పోయింది. మళ్ళీ అన్నీ మామూలుగా జరిగిపోయాయి. ఎక్కడా ఏ లోపమూ జరగలేదు.

పోడ్యార్ ప్రస్తావనే రాలేదు.

చివరకు ఆ ముసల్ది ఉండబట్టలేక, కూతురుతో అన్నది.

"చిట్టితల్లీ. వాడినిగురించి బాధపడకు. పోతేపోయాడు ఎందుకుకొరగాని కుంక. పీడ విరగడైంది. ఇకనన్నా హాయిగా వుండొచ్చు."

స్త్రీషా హృదయంలోనుంచి దుఃఖంపొర్లుకొచ్చింది; కట్టలు త్రెంచుకొని ప్రవహించింది. కన్నీరు మున్నీరుగా విలపిస్తూ, గబగబా పడక యింట్లోకి వెళ్ళి, మంచంపై బోర్లా పడుకొని. భోరు భోరున దుఃఖించింది.

గత కొలది వారాలుగా ఆమె కడుపు చెరువు చేసుకుంటూ, కుమిలిపోతోంది.

నిజంగా ఈ కొంప నరకకూపమా? అతనికి ఎంతకష్టం తెచ్చిపెట్టాం? ఏం యిబ్బంది కల్గించాం? నా తల్లిదండ్రులంటేనే ఎందుకు అతను అలా మండిపడతాడు? ఏం పాపం చేశారని? నేనేం చేశానని నాకిన్ని కష్టాలు తెచ్చిపెట్టటం? మొదటి రోజుల్లో అతను ఎంతో హుషారుగా, సరసాలాడుతూ, నన్ను ఎగతాళిచేస్తూ, ముద్దు ముచ్చటలు గొల్పుతుండేవాడు. అలాంటి వాడు చివరకు ఇలా తయారవుతాడని ఎవరు ఊహించగలరు?....ఆనాడు వర్వారా యింటికి వెళ్లాడు. ఏం జరగాలో అదే జరిగింది. నేను అరిచాను. కీచులాడాను. అమ్మ తిట్టింది. కాని ఇప్పుడు ఎవరూ ఏమీ అనటంలేదుగా. ఆయన ఇంట్లో వున్నంతసేపు అమ్మ కూడా నోరు మెదపటంలేదు. ఒకవేళ నోరు విప్పినా, దూరంగా పోయి గొణుక్కుంటోంది. అతను ఎక్కడ అలిగిపోతాడోనని ఇంట్లోవాళ్ళంతా మారుపలికితే ఒట్టు.ఇదిరాక ఎక్కడకు పోతుందిలే; చంకక్కంతా నాకొక్కంటూ వెంటపడుతుందిలే అని ఆయన అనుకొంటున్నాడేమో. అది కలలో మాట.

స్త్రీషా పొర్లుకొచ్చిన దుఃఖాన్ని దిగమింగటానికి యత్నించింది. అయినా లాభం లేకపోయింది. కడుపు తరుక్కు

పోయేటట్లు ఏడ్చింది. కడుపులో బిడ్డ కోపంతో లేతచిగుర్లువంటి కాళ్ళతో తన్నాడు.

ఆమె సంకల్పం సడలింది.

ఫ్యాక్టరీనుంచి ఇంటి కొస్తుంటే, దారిలో అతను కంట పడ్డాడు. ఆఫీసు ఎదుట ఒక ట్రాక్టరు నిలిచివుంది. వర్వారా స్తెపనోవా, మరికొందరు డ్రైవర్లు ఏదో విషయమై బిగ్గరగా గొంతులు చించుకుంటూ చర్చించుకొంటున్నారు. వర్వారా సరసనే నిలబడిన ఫ్యోడార్ నవ్వుతున్నాడు. తాను మొదట చూచినప్పుడెలా వున్నాడో ఇప్పుడు ఫ్యోడార్ అలాగేవున్నాడు అతని శరీరంలో ఎలాంటి మార్పులేదు మరి తాను ఎంతగా మారిపోయింది? అనుకొంటూ ఆమె నెలలు నిండిన తనకడుపు చూసుకొంది; తన ముఖం అందవికారంగా తయారైంది. అద్దంలో చూసుకొంటేనే డోకొచ్చేంత అసహ్యంగా తయారైంది.

ఇంట్లో అడుగు పెట్టీ, పెట్టగానే స్తేపా కుర్చీలో కూలిపోయింది. కాలుతీసి కాలు వేయలేకపోయింది కళ్ళు తిరిగినట్టనిపించింది. కడుపులో బిడ్డ గొడవ చేస్తున్నాడు. ఆమెలో ద్వేషాగ్ని రగులుతోంది. నన్ను వదిలేస్తాడా? నన్ను మర్చిపోతాడా? నలుగురిలో నిలబడి నవ్వుతాడా? సిగ్గు లేకపోతేసరి! ఇంత ఘోరకలా?

స్తేపా కుర్చీలోనే చాలాసేపు కూలబడివుంది. చీకటి కమ్మింది. ఆ స్థితినిఆమె యింకెంతమాత్రం భరించలేకపోయింది. అంతులేని ఆలోచనలు, వింత వింత భావాలు ఆమె హృదయాన్ని పట్టి వేధించాయి. కుర్చీలోనుంచి చివాలున లేచింది.

ద్వారంవైపు పరుగెత్తింది. బయట విపరీతమైన చలిగాలి వీస్తోంది. చలికి గడగడ వణికిపోయింది. అయినా వెనుతిరగ లేదు. పళ్ళ బిగువుతో ముందుకే సాగింది. ఆ చలిగాలికి తన లోని ద్వేషాగ్ని ఎక్కడ చల్లారిపోతుందోనని ఆమెభయపడింది. ఏమైనా అతని మొఖాన్న నిప్పులుచెరిగి మరీ తిరిగి రావాలన్న పట్టుదలతో ప్రయాణం కొనసాగించింది.

ట్రాక్టరు డ్రైవర్లంతా ఒక పెద్దయింట్లో వుంటున్నారు. వారందరికీ యెరిమెలేనా అనే ముసల్ది వంటచేసి పెడుతోంది. ఆ ఇంట్లోనుంచి అనేక గొంతులగోల విన్పిస్తున్నది. వారంతా భోజనాలు చేస్తున్నారు. కార్యరూపం ధరించిన స్త్రేషా సరాసరి తలుపుదగ్గరకెళ్ళి, తలుపు తట్టింది. చిజోవ్ వచ్చి తలుపు తీశాడు; నోట్లోముద్ద నములుతూనే వచ్చి తలుపు తీశాడు. స్త్రేషాను చూసి గబాలున వెనుతిరిగిపోయాడు.

స్త్రేషా కాళ్ళు తేలిపోతున్నాయి. ఎక్కడ తూలిపోతానో నని భయపడికాబోలు, గోడకు వాలిపోయింది.

ఫ్యోడార్ వచ్చాడు. అతని వైఖరిలో ఎలాంటి మార్పు లేదు. ఇంటిదగ్గర ఎలాంటి దుస్తులు ధరించాడో అలాంటిదుస్తులే ఇక్కడా వేసుకొన్నాడు, అతని ముఖం పాలిపోయింది. జుట్టు అసహ్యంగా నుదుటిపై పరుచుకొంది....ఎంత లేదన్నా అత నిప్పటికీ ఆమె భర్తేగదా? అతను ఎంత కాదన్నా ఆమెకు ఆప్తుడేగా. ఆ మొఖమూ, ఆ చేతులూ అన్నీ ఆమెకు ప్రియతమమైనవే....కాని, అతను కులాసాగా కాలక్షేపం చేస్తు న్నాడు, జీవితాన్ని ఆషామాషిగా ఎంచుతున్నాడు. పుట్టబోయే బిడ్డవిషయం పూర్తిగా మరచిపోయావు.

స్తేపా అడుగు ముందుకు వేసింది.

"ఏం? అలా నేలవంక చూస్తావెందుకు ? కళ్ళెత్తి ఇటు చూడు, నేనెలా వున్నాను? అందంగా వున్నానా? ఆ బెదురు చూపులేల? కడుపులో బిడ్డను చూసి హడలిపోతున్నావా?" అంటూ ఆమె నిప్పులుచెరిగే చూపులు విసరింది.

"ఇంటికి రమ్మని చెప్పటానికే వచ్చావా? నేను తిరిగి ఆ యింట్లో కాలుపెట్టటంకల్ల"

"ఏం? నేనొచ్చి నీపాదాలమీద వాలి, సాష్టాంగ ప్రమాణంచేసి, ప్రార్థన చేయాలా?"

"స్తేపా"

"ఇంతకీ చెడిపోయింది నేనుగాని నీవుకాదు"

"స్తేపా, ఆ యింటినుంచి వచ్చేయి. నామాట విను. మనిద్దరం వేరే హాయిగా జీవిద్దాం. గతాన్ని మరచిపోదాం."

"ఆ యింటినుంచి వచ్చేయి, వచ్చేయి....ఎప్పుడూ ఇదే పాటగా? అయినా మా అమ్మా నాన్నా నీకేం అన్యాయం చేశారు? ఎన్నడూ నీకు కష్టం కల్గించలేదే? అయినా నీవు వాళ్ళనెందుకు అంతగా ద్వేషిస్తావ్ ? ఎప్పుడూ మనస్సాక్షి, మనస్సాక్షి అంటూంటావు, అదెక్కడవుందో, అది ఎలాంటిదో చూపెట్టు? నీకు అసలు హృదయం అంటూ వుంటేగా" స్తేపా దీర్ఘశృతిలో, తీవ్రధ్వనిలో కంఠం విప్పి, నిప్పులు కక్కుతోంది. ఇంట్లోవున్న డ్రైవర్లంతా తన కేకలు విని బయటకొచ్చి, నిలబడి, ఎగబడి చూస్తున్నా స్తేపా లక్ష్యపెట్టలేదు,

"నీవొక రాక్షసుడివి. బేతాళుడివి. నాజీవితాన్ని సర్వ నాశనం చేశావు"

"ఎందుకలా నోరు పారేసుకొంటావు? బజారుకెక్కి ఏమిటా మాటలు? సిగ్గు లేకపోతేసరి"

"సిగ్గా? నాకా? ఎందుకు? ఏ మొఖం పెట్టుకొని ఆ ప్రశ్న లేస్తున్నావ్? సిగ్గులేని నీచుడా" అంటూ స్తేషా కాంద్రించి వుమ్మేసింది. ఫ్యోడార్ గుండెలపై చేయవేసి, చొక్కా కాలర్ పట్టి ఆమె గుంజుతోంది. అతను ఆమె మణి కట్టులో పట్టుకొని, ఆత్మరక్షణ చేసుకొంటున్నాడు.

"స్తేషా, స్తేషా, కాస్త ఆగు, తమాయించుకో శాంతించు పదిమందిలో ఇలా ప్రవర్తించటం భావ్యమా?"

ఫ్యోడార్ పిడికిలిపట్టునుంచి చేతులు విదిలించుకోనేందుకు ఆమె గింజుకొంది. మోకాళ్ళ మీద కూలబడింది. అతని చేతులను పళ్ళతో కసితీరా కొరకాలని ప్రయత్నించింది

"జనం...... లోకులు......ఎందరుంటే నాకేం? ఈ దృశ్యాన్ని కళ్లారా చూసి సంతోషించమనండి:"

అక్కడి వాళ్ళంతా వాళ్ళిద్దరిచుట్టూ మూగారు.

గింజుకుంటున్న స్తేషా చేతులు ఫ్యోడార్ గట్టిగా పట్టి వుంచాడు.

అమె ఉన్నట్టుండి అతని పాదాలపై కుప్పలా కూలి పోయింది. అతను ఆమె చేతులు వదిలేశాడు. పచ్చగడ్డిపై బోర్లా పడుకొని, కుములుతూ కుళ్ళుతూ, దుఃఖించింది. ఫ్యోడార్ నిశ్చేష్ఠుడై అలాగే నిలబడి వున్నాడు.

"చూస్తావేం? ఆమెను లేవదీయి, తక్షణం యింటికి తీసుకెళ్ళు, చోద్యం చూస్తున్న ఈ ప్రేక్షక మహాశయుల దృష్టి నుంచి, దూరంగా తీసుకుపో."

ఆ గొంతుకు వర్వారా స్తెపనోవాది. చుట్టూ జేరిన వల యాన్ని ఏర్పరచిన జనాన్ని చీల్చుకుంటూ, పడ త్రోసుకుంటూ ఆమె ప్రవేశించింది

చోద్యం చూడవచ్చిన వారిలో ఇద్దరు స్తెషాను జాగ్ర త్తగా నేలపై నుంచి లేవనెత్తారు.

"లే, అమ్మా, లే. ఇటుదారి. ఇలాగైతే ఎలాగమ్మా? భద్రంగా మీ యింటికి తీసుకెళ్ళుతాం పద. ఇటుదారి."

స్తెషా నెమ్మదిగాలేచి, నడుస్తోంది. అందరిలోను వర్వారా స్తెపనోవా వుండటం ఆమె చూసింది. వర్వారా కంటపడగానే ఆమెలోని ఆవేశం, ద్వేషం మళ్ళీ ప్రకాశించాయి.

"దీనికంతటికీ కారకురాలివి నీవే. పగపట్టిన పచ్చగడ్డిలో నక్కిన కాలసర్పానివి, ఎవేవో చెప్పి అతని మనస్సును మార్చావు; కలుషితంచేశావు. అసలు మేము ఈ లోకంలో బ్రతకటమే నీకు యిష్టంలేనట్టుంది. ఇంతకీ మేము నీకు చేసిన అపకార మేమిటి ? ఏమిటో చెప్పు?" అంటూ స్తెషా వర్వారా స్తెవనోవాపై సాదింపులు మొదలెట్టింది.

వర్వారా స్తెపనోవా మారుచెప్పలేదు. విచారగ్రస్తురాలై అలాగే నిలబడి, నివ్వెరపోతూ చూస్తోంది.

"ఏమిటమ్మా? అలా అంటావ్? అలాంటి మాటలనటం తగునా? వూరుకో అమ్మా. నామాట విని వింటికెళ్ళదాం పద. నోరు పారేసుకోటం మంచిదికాదు" అంటూ ఒక వృద్ధుడు స్తేషాను మందలించాడు.

"మీరంతా ఇంతే ఎప్పుడూ ఇంతే....ఎందుకు మీరంతా మా కుటుంబాన్ని ద్వేషిస్తారు? ఏం పాపం చేశామని? మేమె

న్నడూ పరులసొమ్ము తినలేదే? కాయకష్టం చేసి కడుపు నింపు కొంటున్నామే?"

వారంతా ఎలాగో నచ్చజెప్పి, స్తేషాను యింటికి తీసు కెళ్ళారు. ఆమె ఎక్కీఎక్కీ ఏడుస్తూ యింటి కెళ్ళిపోయింది.

* * *

ఆవాళరాత్రి పొద్దుపోయాక ఫ్యోడార్ వర్వరా స్తెప నోవా యింటికెళ్ళాడు. చిజోవ్ కూడా అతని వెంట వున్నాడు.

"నేను మరొక సమష్టి వ్యవసాయక్షేత్రానికి బదిలీ చేయించుకొంటాను. ఇంత జరిగాక ఇక ఈవూళ్లో తలెత్తుకు తిరగటం నావల్లకాదు. మెషిన్ ట్రాక్టరు స్టేషన్ కు ఇప్పుడే బయలుదేరి వెళ్లుతున్నాను. ప్రస్తుతానికి ఇతను నా స్థానం స్వీక రిస్తాడు" అంటూ చిజోవ్ వైపు తలతిప్పాడు. చిజోవ్ కాలుగా లిన పిల్లిలాగా ఏమీతోచక ఇటూ అటూ తచ్చిట్లాడుతున్నాడు.

అప్పుడు ఆమె ఏదో పుస్తకం చదువుకొంటోంది. నిమ్మకు నీరెత్తినట్లు టేబుల్ పై ఏదో వస్తువుకోసం వెతుకు తోంది. తాళపుచెవి తీసి, ఈ పుస్తకంలో పెట్టి, పుస్తకంమూసి, దానిని భద్రంగా ఒకప్రక్కకు పెట్టి, నిశ్చింతగా సమాధానం చెప్పింది.

"నీవు ఇక్కడనుంచి పోవటానికి నేను అనుమతించను"

"అనుమతించవలసినది నీవుకాదు. మెషిన్ - ఆవిషయం ట్రాక్టరు స్టేషన్ వారికి వదిలిపెట్టు. ఎవరెంత చెప్పినా నేనిక్కడ చచ్చినా వుండబోను. అవసరమొస్తే ఉద్యోగాన్నయినా వది లేస్తాను. ఏ మొఖం పెట్టుకొని ఈ వూళ్లో నలుగురితో తిరగ మంటావు? ఇంకా ఇక్కడ వుండటం ఎలాసాధ్యం?"

"నిజమే. నీవు చెప్పినదంతా నిజమే అయినా నేను నిన్ను వదిలిపెట్టేదిలేదు. ఏదో ఇప్పుడే కాస్త కష్టాలు గడిచి గట్టెక్కుతున్నాం మాకున్న అండదండల్లా నీ టీమే. పంటలు కోతతరుణం వచ్చి నెత్తిమీద కూర్చొంటోంది. ఇలాంటి సమయంలో టీము నాయకులను మార్చటం సనేమీ పనికిరాదు. ఆ వచ్చే టీమునాయకుడు ఎలాంటివాడో ఆ దేవుడికే తెలియాలి. మనం ఊహించలేంకదా? అయినా నీ యిష్టం కావాలంటే వెళ్ళి ప్రయత్నించిచూడు. కాని ఒకమాట గుర్తుంచుకో నీవెంట నేనూ బయలుదేరి వస్తాను, వాళ్లెలా ఒప్పుకొంటారో చూస్తాను. అవసరమొస్తే జిల్లా పార్టీ కమిటీదాకా పోతాను. నీవు ఎలా వెళ్ళిపోతావో చూస్తాను. ఆవేశం తగ్గించుకొని, ఆలోచించు. పరార్థై సాధించే పరమార్థం పూజ్యమని నీకే తెలిసివస్తుంది.

"లాభంలేదు. ఆలోచించి లాభంలేదు. ఎంత ఆలోచించినా ఇంతే, సెలవు. చిజోవ్‌తో అన్ని విషయాలు మాట్లాడాను. అవసరమనుకొంటే నీవుకూడా చెప్పు; ఏ ఏ పనులు చేయాలో?"

ఫ్యోడార్ గిరుక్కునతిరిగి, శరవేగంతో వెడలిపోయాడు

"నీకూ రేపో మాపో పెళ్ళి కాబోతోంది. ఏటికొకరు, కోటికొకరూలాగే భార్యాభర్తలు ఎంతోకాలం కలిసి జీవించలేరు, స్తేపా. ఫ్యోడార్ దాంపత్యజీవితం స్వర్గతుల్యం కావలసింది. కాని వారి మనస్తత్వాలు భిన్నమైనవి. అందుకే వారి జీవితాలు విచ్ఛిన్నమయ్యాయి. దీనినుంచి గుణపాఠం గ్రహించుకో. బ్రహ్మచారి వ్యక్తుల స్వభావాలను జాగ్రత్తగా పరిశీ

లించు" అంటూ వర్వరా స్టెపనోవా చిజోవ్‌కు బుద్ధులు గరప సాగింది.

"ఏమైనా అతనిని తిరిగి రప్పించలేవా?"

"ఎక్కడికి? మన వ్యవసాయ క్షేత్రానికి?"

"అవును. అతనిభార్య రేపోమాపో బిడ్డని కంటుంది."

"సిలాంతీ ర్యాప్కిన్ యింటికా? నేను ఆ సలహా చెప్ప లేను. చెప్పబోను. నీవే చూశావుగా, ఇవాళ ఎంత రాద్ధాంతం జరిగిందో? రోజూ యింట్లో నాలుగు గోడలమధ్య, ఇట్లాంటి రాద్ధాంతాలే జరుగుతాయి. వాటిని అతను భరించనూ లేడు; సహించనూ లేడు. అతను వెళ్ళిపోక తప్పదు. పోతే, స్తేషాను ఆయింటినుంచి తప్పించి, వెంట తీసుకుపోవట మంటావా అది వేరేవిషయం. కాని ఆమెను అక్కడనుంచి కదిలించటం అంత తేలిక కాదు. ఆ తల్లిదండ్రులనుంచి ఆమెను వేరుచేయటం మహా కష్టం. ఆ కుటుంబం మంచిచెడ్డలన్నీ నాకు పూర్తిగా తెలుసు."

"మరి పుట్టబోయే బిడ్డమాట?"

"అదొక్కటే ఆశారేఖగా కన్పిస్తోంది. బహుశా ఆబిడ్డే స్తేషాకు బుద్ధి తెప్పించవచ్చు; సరి ఇకనీవు వెళ్ళవచ్చు."

"మరి నేనేమి పనులు చేయాలో పురమాయించావు కాదు."

"పురమాయించాల్సిన పనిలేదు. మామూలుగా నీవు పనులు చూసుకుంటూ వుండు. ఎల్లుండీపాటికి ఫ్యోడార్ తిరిగి వస్తాడు."

"ఏమో, తిరిగి వస్తాడన్న నమ్మకం నాకులేదు. మొండి పట్టుపట్టాడు."

"సరే! ఎవరిపంతం నెగ్గుతుందో చూదాం. నీవుఆర్నెస్టీ ఇంటికి వెళ్లి నేనురమ్మన్నానని అతనితో చెప్పిమరీవెళ్లు. నేను రేపు ఆఫీసులచుట్టూ తిరగాలి. ఇక్కడ పనులన్నీ అతనికి అప్ప గించి వెళ్లాలి. ఇదంతా నీఫ్యోడార్ తెచ్చిపెట్టిన తిప్పలు."

ఆమె మళ్ళీ పుస్తకం తెరచింది.

# 17

వర్వరా పంతమే నెగ్గింది. ఫ్యోడార్ ఆవూళ్లోనే వుండి పోయాడు. ఇల్లరికపుఅల్లుడిని గురించిన వాదోపవాదాలు,చర్చలు దీర్ఘంగాజరిగాయి. కాని, తనవిషయం వూళ్లోవాళ్లుఅంతదీర్ఘంగా చర్చించారన్న సంగతి ఫ్యోడార్‌కు తెలియనే తెలియదు. జనం మొత్తం ఇంతకుపూర్వం మాదిరిగానే అతనిని గౌరవంగా చూస్తున్నారు.

కాని, స్తేషా పరిస్థితి వేరు. ఇంటినుంచి ఫ్యాక్టరీకి ఫ్యాక్టరీ నుంచి యింటికివస్తూ పోతూంటే ఆమెకు ఎంత బాధగా వుండేదో వూళ్లోవాళ్ళ కళ్ళన్నీ కేంద్రీకృతమై వున్నట్టు, తననే వెంటాడుతున్నట్టు భావిస్తున్నది. పరులచూపుల్లో ఏదో తెలుసు కోవాలన్న కుతూహలం, శత్రుత్వం ఆమెకు గోచరించాయి. అంతా తనను ఎద్దేవ చేస్తూ చూస్తారు కాబోలు అని ఆమె వ్యథ చెందుతోంది.

అనేకసార్లు ఆమె ఆలోచించింది. వీళ్ళంతా ఫ్యోడార్‌ను దండించక, నన్నెందుకు దండిస్తారు ? నన్ను వదిలేసి వెళ్ళి పోయింది అతనేగా. నన్ను నట్టేట వదలిపెట్టి మరిపోయాడు. కడుపుచేసి పారిపోయాడు. అయినా ఊళ్ళోవాళ్లు అతనిని దండించటం లేదు. నన్నే ఖండిస్తున్నారు, ఇదేమి న్యాయం ? అసలు ఈలోకంలో న్యాయానికి తావులేదు.

ఫ్యోడార్ వాలుమొఖం వేసుకొని తన వద్దకురాక ఎక్కడికి పోతాడులే అన్నఆశ స్త్రేషాకు ఇప్పుడు లేదు. పోనీ ఎక్కడో ఒకచోట కలుసుకోక పోతామా అనిమాత్రం ఆమె యింకా ఆశిస్తోంది.

ఒకసారి వాళ్ళిద్దరూ కలుసుకొన్నారు. అయితే అప్పుడు ఫ్యోడార్‌తోపాటు ఇతరులున్నారు. పాపం, అతను సిగ్గుపడుతూ బిడియపడుతూ "బాగున్నావా" అని స్త్రేషాను పలకరించాడు. కాని, స్త్రేషా సమాధానం చెప్పకుండానే, తప్పించుకుపోయింది. అటుతర్వాత కనీసం గంటసేపైనా పళ్ళు పటపట కొరికింది; పిడికిలి బిగించింది ఈసారి ఆమెలోని క్రోధం, ద్వేషం ఆమె హృదయంలోనే విలయంగా వర్తించాయి. అంతే బయటకు పొక్కలేదు. ఈదఫా భర్తను మాత్రమేకాక - అసలు ఈ లోకాన్నే సంఘాన్నే లోలోన తిట్టిపోసుకుంది చుట్టుప్రక్కల వాళ్ళు ఏమనిపోతారో అని అతనికి లేనిపోని అభిమానం. ఈఅభి మానమే ఇంతచేటు తెచ్చింది. అతనికి తన కుటుంబంకన్నా లోకులు ముఖ్యం. అందుకే లోకులంతా అతనికి ప్రక్కతాళం వేస్తున్నారు. న్యాయానికి తావెక్కడ? ధర్మానికి చోటేది?

శీతాకాలం వచ్చిపడింది. మంచు కురువటం ప్రారంభిం చింది. మెషీన్ ట్రాక్టరు స్టేషన్‌లో ఫ్యోడార్ చాలా రోజులు మకాం వేశాడు. ఇప్పుడు తన రాకకోసం ఎదురుచూస్తున్న వాళ్లెవరున్నారు? రేపోమాపో స్త్రేషా ప్రసవిస్తుంది. బిడ్డను కంటుంది; ఆమె అవివాహితా కాదు; విధవా కాదు; మొగుడు వదిలేసిన పెళ్ళాం;

సిలాంతీ పెట్రోవిచ్ నిర్వేద మౌనముద్ర వహించాడు. అతనిలో కరుకుతనం చాలావరకు కరిగిపోయింది. స్త్రేషా కుళ్ళి కుళ్ళి కుములుతూంటే, అతను తనకు చాతనైన రీతిలో సము దాయించేవాడు:

"ఫరవాలేదు తల్లీ; తనివితీరా దుఃఖించు. హృదయ భార మన్నా తగ్గిపోతుంది...నీ జీవితంలో అయిదోవంతు కూడా పూర్తికాలేదు. జీవించేకాలం చాలావుంది. మంచిరోజులు రాక పోవు. ఎల్లకాలం ఇలాగే వుండదు. మాతోపాటే నీవూ. జీవితం గడవకపోయిందా తల్లీ!

స్త్రేషాతోపాటుతల్లికృతికలిపి దుఃఖిస్తుంటుంది.నోటికొచ్చి నట్లల్లా ఆడిపోస్తుంటుంది, "వాడిని కోర్టుకు ఈడ్వండి. కోర్టులో నెత్తిన రెండు మొట్టికాయలు వేసి అతన్ని" యిక్కడకు పంపి స్తారు. అతనివద్ద మనవర్తి రాబట్టటం ఏమంత కష్టంకాదు; కాని ఆడబ్బుతో అపకీర్తిని కడిగేసుకోలేంగదా? అయినా అతనివద్ద ఏమంతడబ్బు వుండేడిసింది కనుక?" మరికొన్ని సందర్భాలలో ఇలా అంటుండేది:" ఎందుకమ్మా. వాడి సంగతి పూర్తిగా మర్చిపో, కొన్నాళ్ళు పోతే నీవే మళ్ళీ అందాలబరిణిగా మల్లి మొగ్గలాగా తయారవుతావు. మరొకనిని వీడికన్నా వేయిరెట్ల

మంచివాడిని - చూసి పెళ్ళి చేసుకోవచ్చు అయినా మేము వాడిని అంతంతమాత్రంగా వదిలిపెట్టలేం. బిడ్డ పెంపకానికి గోళ్లూడకొట్టి వాడిదగ్గర డబ్బు వసూలుచేస్తాం.

ఆలోచించగా ఆలోచించగా స్త్రేషాకు ఒక మార్గం తోచింది. తల్లిదండ్రులు సూచించిన పద్ధతేమీ ఆమెకు నచ్చలేదు కామ్సొమోల్ ఆమెకు గుర్తుకొచ్చింది. ఇంతకుముందు కామ్సొమోల్ అవసరం ఆమెకులేదు; అందుకే దానిని గురించి ఆమె పూర్తిగా మరచిపోయింది. ఇప్పుడు కామ్సొమోల్ తోనే పనివచ్చింది.

ఒకరోజున హఠాత్తుగా స్త్రేషా జిల్లా కామ్సొమోల్ కార్యాలయంలో ప్రత్యక్షమైంది. కూతురును జిల్లా కార్యాలయానికి సాగనంపుతూ తల్లి మరీమరీ చెప్పి పంపించింది. "వర్వారా విషయం మరచిపోకేతల్లీ అది అతనికి పురెక్కించి ఈపని చేయించిందని చెప్పు. వివరంగా చెప్పమ్మా"

సిలాంతీ పెట్రోవిచ్ గొణిగాడు:

"సరే, ఆ ప్రయత్నంకూడా చేసి చూడు"

* * *

జిల్లా కామ్సొమోల్ కమిటీ కార్యదర్శి కార్యాలయం పరిశుభ్రంగా, అందంగా వుంది. అంతేకాదు, ఆ గదిలోని అన్ని వస్తువులను మృదువైన హస్తాలు చక్కగా అమర్చినట్లు తోస్తున్నది, కిటికీ అంచులలో వుంచిన పూలమొక్కల కుండీలు అందాలు చిలుకుతున్నాయి. ఒకుండీలలో సిగరెట్టుపీకలవీ లేవు. పూలమొక్కలు ఏపుగా పెరిగి, దట్టమైన ఆకులతో, వికసించిన

పుష్పాలతో అలరారుతున్నాయి. మల్లెపూల తెల్లదనం వెదజల్లే చన్నని కర్టెన్‌లోనుంచి స్టాలిన్ గ్రంథాల సంపుటాలు కన్పిస్తున్నాయి.

జిల్లా కామ్యూనిస్టు కమిటీ కార్యదర్శి నీనా గ్లజిచేవా ఆమె చేతివ్రేళ్ళు సన్నగా, పొడుగ్గా బెండకాయలను పోలి వున్నాయి. దట్టమైన జుత్తు నుదిటిపై కొట్టొచ్చినట్టు కన్పిస్తున్న చార. స్తెపా గదిలో ప్రవేశించగానే, నీనా అత్యంత మర్యాద పూర్వకంగా ఆహ్వానించి కుర్చీ చూపించి, కూర్చోమని చెప్పింది.

"కూర్చోండి. ఏంపనిమీద వచ్చారు?" స్తెపా తనకథ చెప్పటం మొదలుపెట్టింది. నీనా అత్యంతశ్రద్ధగా వింటోంది. పొర్లుకొచ్చే దుఃఖాన్ని దిగమింగాలని స్తెపా ఎంతో ప్రయత్నించింది. కాని లాభం లేకపోయింది. కళ్ళంట కన్నీరుకట్టలు తెంచుకు ప్రవహించాయి. ఆమెగొంతు ఎండిపోయింది నీనా కుర్చీలో నుంచిలేచి కూజా వదకెళ్ళి, మంచినీళ్ళగ్లాసు తెచ్చి స్తెపాకిచ్చింది.

"చెప్పండి మీకధను పూర్తిచేయండి."

"ఆయనకు నా తల్లిదండ్రులంటే బొత్తిగా పడదు. ఎందుకో తెలియదు. ఆయింట్లోనుంచి వచ్చేయ్, నీతల్లిదండ్రులను గురించి పూర్తిగామర్చిపో, అప్పుడు నిన్ను ఏలుకొంటాను అంటారు ఆయన."

"తల్లిదండ్రులను మర్చిపోవాలా?....సరే. తర్వాత...."

"రేపోమాపో నేను ప్రసవిస్తాను. మీరే ఆలోచించండి. నేను ఈస్థితిలో ఇల్లు వదిలేసి, ఏదో అద్దెకొంపలో కాపురం పెట్టటమా? మాకు సొంతసామాన్లు అంటూ ఏమీలేవు....పైగా

బిడ్డను సాకటానికి ఒక ఆయన్ను పెట్టాలి. ఇదంతా మాసమిష్టి వ్యవసాయ క్షేత్రం అధ్యక్షురాలి ప్రేరణవల్లనే జరిగింది ఆమెకు నామీద ఇంతకక్ష ఎందుకో తెలియదు. అసూయ కావచ్చు; మరేమన్నా కావచ్చు." స్తేపా తలవంచుకొని నేలకేసి చూస్తూ తన కథనం కొనసాగించింది.

"అమానుషం." నీనా పెన్సిల్‌తో కాగితంపై ఏవో నాలుగు ముక్కలు గిలుగుతూ అంది.

నీనా హృదయం క్రోధావేశంతో అట్టుడికి పోతోంది. ఒక స్త్రీవచ్చి, తన సహాయం అర్థించినప్పుడు నీనా సహాయం చేయకుండా ఎలా వుండగల్గుతుంది. సహాయం చేయకపోవటం స్త్రీ ప్రవృత్తికే విరుద్ధం కాదా? స్తేపా మొఖంలో ఉట్టిపడుతున్న దిగులు, విచారం, ఆమె కళ్ళంట కారుతున్న కన్నీటిధారలు, నెలలునిండిన ఆమె కడుపుచూస్తే ఎవరికైనా జాలివేయక మానదు. 'కలకంఠకంటి కన్నీరొలికితే అరిష్టదాయకం' అన్న లోకోక్తి నీనాకు గుర్తుకొచ్చింది. రేపోమాపో బిడ్డతల్లి కాబోతున్న స్తేపాను ఈస్థితిలో ఇలావదిలేసి వెళ్ళటమా!

"నీవు చాలా మంచిపని చేశావమ్మా సరాసరి ఇక్కడకి వచ్చావు ఇక నీవు విచారించకు దుఃఖించకు. నీకిక మనస్తాపం మనోవేదన అక్కర్లేదు. ఈ వ్యవహారాన్ని మేము చక్కదిద్దుతాం. భయపడకు. ఫ్యోడార్ సొలోవికేవ్! మెషిన్ - ట్రాక్టరు స్టేషన్‌లో అత్యుత్తమ కార్యకర్త! చాలా విచిత్రంగావుంది"

కామ్సొమోల్ జిల్లాకమిటీ కార్యదర్శి నీనా స్తేపా చేయి పట్టుకొని, రోగిష్టిని జాగ్రత్తగా నడిపించినట్లు నడిపిస్తూ బయటదాకా తీసుకొచ్చి, సాగనంపింది, స్తేపా ఇంకా కుళ్ళి

కుళ్ళి ఏడుస్తూనే వుంది. తనకు పట్టిన దుర్గతి దానితోపాటు ఎదుటమరొకవ్యక్తి తనస్థితిచూసి జాలిపడుతోంది; ఎదుటివ్యక్తికి తన కృతజ్ఞతను స్తేపా కన్నీటితో వ్యక్తం చేస్తోంది.

"మీమేలును ఎన్నటికీ మరువలేను మీఋణాన్ని ఎలా తీర్చుకోను? ఇంతవరకు నన్ను సానుభూతితో అర్థంచేసుకొని, నన్ను ఓదార్చుతూ మాట్లాడినవారు మీరొక్కరేనమ్మా వూళ్లో, జనమంతా నన్ననేవాళ్లే; నన్ను ఆడిపోసుకోటమే వాళ్ళపని'

"దారుణం, ఈ రోజుల్లో ఇలాంటివి జరుగుతుండటం మహాదారుణం సరే. దీనిఅంతు మేము కనుక్కొంటాం. నీవేమీ ఆందోళన చెందకమ్మా. అన్ని వ్యవహారాలు త్వరలోనే చక్క బర్చుతాం"

స్తేపా వెళ్ళిపోగానే నీనా టెలిఫోనుదగ్గరకు వెళ్ళి ఫోనులో ఎవరినో పిలుస్తోంది:

మెషిన్ ట్రాక్టరు స్టేషన్‌తో మాట్లాడాలి....మాట్లాడు తున్నది కామ్సొమోల్ జిల్లాకమిటీ కార్యదర్శిని....ఒహో, ఘరవల్యోవ్ నీవేనా...వెంటనే ఫ్యోడార్‌ను వెంటనిడుకొని ఇక్కడకు వచ్చేయ్ మీకోసం ఎదురు చూస్తూంటాను" అంటూ రిసీవరు క్రిందపెట్టేసింది నీనా.

"అమానుషం" అని స్వగతం పలికింది.

ఫ్యోడార్ ద్రోహం చేశాడు. ప్రేమించిన వ్యక్తికి అన్యాయం చేశాడు. ఇంతకన్నా ఘోరం మరొకటి వుండదు. నెలలు నిండి త్వరలో ఒకబిడ్డకు తల్లి కాబోతున్న భార్యను వదిలేయటం తుంతవ్యం కాదు....అనుకొన్నది నీనా.

రెండేళ్లుగా నీనా కురిక దీవులలో వెస్టికింట్ గా పని చేస్తున్న యువకునికి ప్రేమలేఖలు వ్రాస్తున్నది; వారిద్దరిమధ్య ప్రేమకలాపం సాగుతోంది. నీనా తన ప్రియుడికి అనేక గ్రంథాలను బహుమతులుగా పంపుతోంది. ప్రతి పుస్తకం పైన ముచ్చటైనదస్తూరితో "ఈమాటలు గుర్తించుకో, ఎట్లా" అని వ్రాసి మరీ పంపుతున్నది. ఈమధ్య అతను బొత్తిగా జాబులు వ్రాయటమే మానేశాడు.

# 18

ఇదంతా చాలా తేలిక సమస్య అత్తమామలతో పూర్తిగా శాశ్వతంగా తెగతెంపులు చేసుకోవాలని అతను నిశ్చయించుకున్నాడు. సిలాంతీ పెట్రోవిచ్, అలెవ్తినాఇవనోవాలతో కలిసి ఒక యింటిలో నివసించటం అసంభవమని అతను గుర్తించాడు. స్తేషా తనకు తగిన అర్ధాంగికాదని అతను గాఢంగా విశ్వసిస్తున్నాడు. ఆమెను పెళ్లాడటమే పొరపాటు అనుకొంటున్నాడు. అయినప్పుడు తానింకా లేనిపోని చిత్రహింసలకు లోనుకానేల? వారితో తెగతెంపులు చేసుకున్నాడు. అంతే, గతమంతా పోకలగా భావించి, మరచి పోదామనుకొన్నాడు.

కాని ఫ్యోడార్ ఆపని చేయలేక పోయాడు. గత స్మృతులు పదేపదే అతని స్మృతిపథంలో మెరుస్తున్నాయి.

రాత్రి పూట సరిగా నిద్రపట్టటంలేదు. కన్నుమూయగానే స్తేషా కళ్ళల్లో మెరుస్తోంది, కలల్లో ప్రత్యక్ష మవుతోంది.

దాంపత్య జీవితమంతా - అందులోని మాధుర్యమూ, ప్రణయ కలహాలలో, తియ్యందనమూ, గృహకల్లోలాల్లోని మనోవేదన- అన్నీ సినిమారీలులాగా ఫ్యోడార్ మెదడులో వేగంగా గిర గిరా తిరుగుతున్నాయి.

ఆనాటి దృశ్యం కళ్ళకు కట్టినట్లగుపిస్తున్నది; ఆమె మణికట్టులను తానుగట్టిగా పట్టుకొన్నాడు. పట్టు విడిపించు కోటానికి ఆమె పెనుగులాడింది. గభాలున నేలజారింది; తన కాళ్లపై పడింది. తన మొఖాన ఆమె కాండ్రించి ఉమ్మివేసింది, ఆడిపోసింది. నలుగురిలోను తిట్టిపోసింది. అంత జరిగినా ఆమె అంటే తనకు కసి రేగలేదు. తనలో కసి ఎలా రేగుతుంది? ఏమైన ఆమె మానవ మాత్రురాలు. ఎన్నో కలలు కనివుంటుంది. జీవి తాన్ని స్వర్గధామం చేసుకోవచ్చునన్న ఊహాలతో స్వప్నలోకా లను నిర్మించుకొని వుంటుంది. కాని తా నొకటి తలిస్తే, తీరా జీవితంలో అంతా తారుమారే. పతిలేని పడతి అయిపోయింది. పైగా త్వరలో బిడ్డతల్లి కాబోతోంది.

అమెను తలచుకొంటున్నకొలదీ అతనికి జాలేస్తోంది. పాపం అనిపిస్తోంది. కాని ఇలాంటి విషయాలలో జాలి పనికి రాదని అతని నిశ్చితాభిప్రాయం. జాలిపడి మళ్ళీ ఆ యింటికి తిరిగి వెళ్ళడమా? అతి భయానకమైన ఆ వాతావరణంలో జీవించగల్గటం దుర్లభం; దుస్సహం ఆ ఇంట్లో అడుగుపెట్టట మంటే సర్వనాశనమే. ఆ గడప తొక్కితే తానెందుకూ పనికి రాని చవటగా మారిపోతాను అది ఖరారు.

అయితే మరి కింకర్తవ్యం?

ఈవూరును వీడి, దూరప్రాంతానికి, తననెవరూ ఎరుగని కొత్త ప్రాంతానికి వెళ్ళిపోతే బాగుంటుందని ఫ్యోడార్ భావించాడు. ఏ గొడవలూ లేకుండా అక్కడ హాయిగా జీవిస్తూ, స్తేపాకు ప్రతినెలా కొంతడబ్బు పంపిస్తూ.... కాని వర్వారా స్తైపనోవా పానకంలో పుడకలాగా వచ్చి అడ్డు తగి లింది.

ఫ్యోడార్‌ను బదిలీ చేయడానికి జిల్లా అధికారులు ససేమీ వీల్లేదన్నారు చివరకు గత్యంతరం లేక అతను ఆ వూళ్లోనే వుండిపోవలసి వచ్చింది.

చిజోవ్‌గానీ. వర్వారా స్తేపనోవాగానీ, ఇతర మిత్రులు గానీ ఫ్యోడార్‌తో ఎప్పుడూ స్తేపాను గురించి ప్రస్తావించలేదు స్తేపా ప్రస్తావన వస్తే అతనికి బాధ కలుగుతుందని వారికి తెలుసు.

జిల్లా కమిటీ కార్యాలయంనుంచి ఆకస్మాత్తుగా ఫ్యోడా ర్‌కు కబురు వచ్చింది: తక్షణం బయలుదేరి రమ్మని.

మెకానిక్ ఆర్కాడీ ఘురవ్యలోవ్‌తో కలిసి ఫ్యోడార్ జిల్లా కమిటీకార్యాలయానికి వెళ్లాడు ఏమి మూడనున్నదో నని అతని గుండెల్లో భయంగానే వుంది.

నీనా గ్లజిచేవా కొరకొరచూస్తూ, క్రోధం కక్కుతూ, ఎదురుగావున్న కుర్చీ చూసి, కూర్చోమని ఫ్యోడార్‌కు పురమా యించింది. పిలిపించిన విషయ మేమిటో ఆమె వెంటనే ప్రస్తా వించలేదు. ఏవో కాగితాలు తిప్పుతూ, చదువుతూ కూర్చుంది. "నా వాలకం చూసి, విషయప్రాధాన్యాన్ని గ్రహించుకో, నీకు కొంతటైమ్ ఇస్తున్నాను" అన్నట్టు ఆమె వ్యవహరించింది.

ఎట్టకేలకు నీనా ఫ్యోడార్ మొఖంలోకి సూటిగా చూస్తూ మాట్లాడసాగింది.

"కామ్రేడ్ ఫ్యోడార్, సరిగా ఒక అరగంట క్రితమే సరిగా నీవు కూర్చున్న కుర్చీలోనే నీ భార్య కూర్చున్నది"

కోపం ఉట్టిపడే క్రోరచూపు.నిశ్శబ్దం.ఫ్యోడార్ కదలలేదు మెదలలేదు. అతని ముఖం వాలిపోయింది; పాలిపోయింది.

"వదిలేశావ్! నెలలునిండిన పెళ్లాన్ని వదిలేశావ్. ఆమెకు నీవు మిగిల్చిందల్లా కన్నీరు! వ్యధలూ. బాధలూ నీవు ఇంత అవమానకరంగా, అమానుషంగా ప్రవర్తించటానికి గల కారణమేమిటో తెలుసుకోవచ్చా ఏం? మాట్లాడవేం ? మొఖమెత్తి చూడటానికి సిగ్గు పడుతున్నావా? ఆ నేలచూపులు, ఆ వాలు చూపులు ఏల ?

ఫ్యోడార్ నోరెత్తలేదు; మొఖం పైకెత్తలేదు. ప్రాణం లేని పాషాణ విగ్రహంలా కదలకుండా మెదలకుండా అలానే కూర్చుండి పోయాడు.

"ఏం? నీఅభిమానాని కేమన్నాఅఘాతం కల్గిందా ? మనస్సు వల్లటంలేదా? ముఖం చెల్లటంలేదా ? చెప్పు. ఇదేదో నీసొంత వ్యవహారమని అనుకొంటున్నావేమో ? ఇలాంటి విషయాలన్నీ సాంఘిక సమస్యలు. సమాజాని కంతటికీ సంబంధించినవి. నీవు చెప్పదల్చుకొన్నాదేమిటో త్వరగా చెప్పు ? నీవాదన వినటానికి ఎదురు చూస్తున్నాను."

"ఆగోడవ అంతా చెప్పాలంటే చాలా సేపు పడుతుంది."

"పరవాలేదు. ఎంత సేపు పట్టినా వినటానికి నేను సిద్ధంగానే వున్నాను. నాకు కావలసిందల్లా మీ భార్యాభర్తల నిద్దరినీ

మళ్ళీ ఏకం చేయటం. నీదుష్టవర్తనను మార్పించటం, అందుకోసం ఎన్నిరోజులు వెచ్చించటానికైనా నేను సిద్ధమే చెప్పు."

ఫ్యోడార్ మొఖమంతా ముచ్చెమటలు పోశాయ్. అత్యంతం అన్ని విషయాలు చెప్పాలి - అసలు తామిద్దరూ ఎలా కల్సుకొన్నారో, స్తేపా తనను ఎలా ఆకర్షించిందో, ఆనాటి సిల్కు ధరించిన స్తేపా తనకంటికి అప్సరసలాగా ఎలా కన్పించిందో. ఆదిగా గల విషయాలన్నీ సవివరంగా ఏకరువు పెట్టాలి తమ సాంసారిక జీవితం ఎలా ప్రారంభమైందో, వంటింట్లో పొయ్యి దగ్గరనుంచి వచ్చిన స్తేపాముఖం చూస్తుంటే ఎంత అందంగా, ఎంత ఆనందంగా వుండేదో ఎవరికి చెప్పాలి. ఆమె తండ్రిని గురించీ ఆనాటి గుర్రం గొడవగురించి అన్నీ పూసగ్రుచ్చినట్లు విడమర్చిచెప్పాలి. అయితే వీటన్నిటినీ వివరించి చెప్పటం ఎలా? ఈ రభసకంతకీ మూలం కీలకం ఏది ?

"అమె కుటుంబం మంచిది కాదు" విశ్వప్రయత్నంచేసిన పిమ్మట ఫ్యోడార్ నోటినుంచి ఆనాలుగు ముక్కలు బయటపడ్డాయి.

"ఎందుచేత మంచిది కాదు."

"వాళ్లు సమిష్టి వ్యవసాయక్షేత్రంలో సభ్యులై వుండి కూడా, వ్యవసాయ క్షేత్రంపై కత్తి కట్టారు; కక్షుబూనారు. ఇరవైనాలుగు గంటలూ ఒకటేగోల. ఆ గోలమధ్య జీవించటం కష్టం." జనాన్ని వాళ్లు సరిగాచూడరు. వాళ్ళకు అసలు కృతజ్ఞత అనేదిలేదు. వాళ్ళకోసం గొడ్లవలె, నడుములు విరగ్గొట్టుకొంటూ పనిచేయాలి." ఇదీవరస. ఈ సాధింపులన్నీ సమిష్టి వ్యవసాయ క్షేత్రాన్ని గురించే."

"అందుకా నిండు శూలాలిని నీవు వదిలేసింది! నీవు ఆమెకు నచ్చజెప్పి ఒప్పించాలి; విషయాలన్నీ విడమర్చి, వారిని సన్మార్గంలోకి మళ్ళించాలి. అంతేకాని కట్టుకొన్న భార్యను వదిలేసి పారిపోవటం కామ్సొమోల్‌కు తగునా?"

"చెప్పటం సులభం. చేయటం కష్టం. పెద్దల బుద్ధులు మార్చటం అంత తేలికా?" అన్నాడు ఫ్యోడార్. ఆమాటలన్నీ మరుక్షణం ఎందుకన్నానా అని నాలిక కరచుకొన్నాడు.

"నీవు చెప్పదల్చుకొన్నది అంతేనా?....నిస్సహాయతను ప్రకటించటంకన్నా, చేతకానితనం ప్రదర్శించటంకన్నా అవమానకరమైన విషయం మరొకటిలేదు. వాళ్ళ మనస్సు మళ్ళించటానికి, నచ్చజెప్పి ఒప్పించటానికి నీవెన్నడైనా ప్రయత్నించావా? చెప్పు. బహుశా నీవు ఆ పని చేసివుండవు"

ఇలా వాదించీ, వేధించీ లాభమేమిటి? వర్వారా స్త్రైపనోవాకు మాత్రం తెలియదూ? సిలాంతీ ర్యాష్కిన్ ఎలాంటివాడో? ఏమీ వివరించనక్కరలేకుండా వర్వారా ఫ్యోడార్‌ను పూర్తిగా అర్థం చేసుకొన్నది. కొన్నాళ్ళపాటు ర్యాష్కిన్ కుటుంబంతో కలిసి జీవిస్తూ వారికి విద్యాబుద్ధులు గరపమని ఈ ఆరిందను పంపిస్తే సరిపోతుంది; ఏమాత్రం సాధిస్తుందో చూడొచ్చు అనుకొన్నాడు మనస్సులో ఫ్యోడార్.

"మాట్లాడవేల? నీవు చెప్పగల్గిందేమీ లేదా? నీ భార్య కామ్సొమోల్ సభ్యురాలుగా చేరలేదు. ఆమెపట్ల నీ నిర్లక్ష్యానికి అదే నిదర్శనం. ఆమె ఎలాంటిదో నేను ఊహించగలను ఆమె మామూలు పిల్ల, నిష్కపటి; లోకం అంటే ఏమిటో ఎరుగని అమాయకురాలు. అలాంటి పిల్లను అభివృద్ధి చేయలేక

పోయావు. కామ్సొమోల్ సభ్యురాలుగా కూడా చేర్పించనే లేదు."

"ఆమె ఒకప్పుడు కామ్సొమోల్ సభ్యురాలే; నాలు గేళ్ళక్రితం తర్వాత ఆమె కామ్సొమోల్ సభ్యత్వాన్ని వదులు కొంది. మరి జిల్లాకమిటీ ఇంతకాలం ఏమిచేస్తున్నది?" అంటూ ఫ్యోడార్ ఎదురుప్రశ్న వేశాడు.

"ఓ! అలాగా; అది నాకు తెలియదులే.. కాని జిల్లా కమిటీని సంజాయిషీ అడిగే అధికారం, దుయ్యబట్టే హక్కు నీకులేదు. ఈ జిల్లాలో దాదాపు వేయిమంది కామ్సొమోల్ సభ్యులున్నారు. వారందరినీ వ్యక్తిగతంగా శ్రద్ధ తీసుకొని అభి వృద్ధి చేయటం జిల్లాకమిటీకి సాధ్యమయ్యే పనేనా? నీబోటి వాళ్లు ఇందుకు పూనుకోవాలి. జిల్లాకమిటీకి సాయపడాలి. ఆమె అభివృద్ధి నీవు చేసిందేమిటో చెప్పు? నెలలు నిండిన అర్ధాంగిని వదిలేశావు. చేయూత యివ్వకపోగా ఘోరమైన నేరానికి పాల్పడ్డావు"

నీనా చేస్తున్న ఆరోపణలను కాదనగల శక్తి అతనిలో లేకపోయింది. కళ్ళప్పగించి వింటూ కూర్చున్నాడు.

'మానవుడు' అన్న మాటకు మాక్సింగోర్కీ యిచ్చిన నిర్వచనమేమిటో, నికొలొాయ్ఆస్ట్రొవిస్కీ ఎలా ప్రేమించాడో చివరకు డిసెంబిరిస్టులవంటి లిబరల్సుకూడా తమ భార్యలకు నచ్చ జెప్పి, తమవెంట ప్రవాసానికి ఎలా తీసుకెళ్లారో నీనా ఫ్యోడా ర్‌కు పాఠం చెప్పింది. ఫ్యోడార్‌కు పాఠం చెప్పటం పూర్తి చేసిన పిమ్మట, ఆ గదిలో ఒకమూల జేరి కూర్చున్న ఆర్కాతే ఝురల్‌లోవ్ వైపు తిరిగి, నీనా దాడి ప్రారంభించింది.

"ఏమయ్యా, మెషీన్-ట్రాక్టరు స్టేషన్ కామ్సొమోల్ సెల్ కార్యదర్శిని నీవేగా? నీకళ్లు ఏమైపోయాయి? కామ్సొమోల్ సభ్యులు ఎలా జీవిస్తున్నారో తెలుసుకోవలసిన బాధ్యత నీదికాదా? ఇంతకాలం జిల్లాకమిటీకి నీవూ ఈవిషయం ఎందుకు తెలియ జేయలేదు?"

ఆర్కాపే ఝురల్‌లోవా బొద్దుగా కన్పిస్తూనా్న అతని మనస్సు మాత్రం వెన్నపూస వంటిది. ఫ్యోడార్ ఇంటిగొడవలను గురించి ట్రాక్టరు డ్రైవర్లు అనేక విషయాలు చెప్పగా అతను విన్నాడు. కాని, అతనికి గొంతు పెగలటంలేదు. నోరు ఆడటం లేదు. మాట రావటంలేదు. నీనా వాగ్ధాటికి నిశ్చేష్టుడై పోయాడు; దానితో అతనినోరు కట్టుడిపోయింది. పెద్ద పెద్ద వాళ్ళ నిర్వచనాలను నీనా ఉటంకిస్తున్నదామె. అలాంటప్పుడు అతను ఆమెతో వాదించటం ఎలాగా? తుపాను హోరుతగ్గి పోయేదాకా తలవంచటమే మంచిదన్న నిశ్చయానికి అతనువచ్చాడు.

నీనా బల్లపై పిడికిలితో గుద్దుతూ గద్దించింది:

"సరే. కామ్సొమోల్ సభ్యుడు చేయకూడని పనిని నీవు చేసినట్లు వెల్లడైంది. దీనిని గురించి కమిటీ మీటింగులో చర్చించాలి. కామ్రేడ్ ఫ్యోడార్, నీకు పదిరోజుల టైమ్ యిస్తున్నాను. ఈ పదిరోజులలోను నీప్రవర్తనను పూర్తిగా మార్చుకో కమిటీ సమావేశం నాటికి ఆపని చేస్తావని ఆశిస్తున్నాను."

ఫ్యోడార్ ఒంటరిగా తిరిగి తన గదికి వెళ్ళిపోయాడు. మెషీన్-ట్రాక్టరు స్టేషన్‌కు దగ్గరలోనే అతను ఒకగదిని అద్దెకు తీసుకొని వుంటున్నాడు. ఝురల్‌లోవా జిల్లా కార్యాలయం

వెలుపలిదాకా అతని వెంట వచ్చి, "చూశావా, ఏమి జరిగిందో" అని ఒకమాట అనేసి ఎక్కడికో వెళ్ళిపోయాడు.

నిజమే. ఎంత చెడ్డ విషయం. ఫ్యోడార్ అనేక సంవత్స రాలబట్టి కామ్సొమాల్ సభ్యుడుగా వుంటున్నాడు. అతనికిప్పుడు ఇరవై అయిదేళ్ళు. పార్టీలో చేరవలసిన వయస్సు కూడా వచ్చింది, ఇంతవరకు అతను ఎన్నడూ 'ఛీ' అనిపించుకో లేదు. ఇంతకాలం అతను ప్రశంసలనే పొందుతూ వచ్చాడు;మన్ననలనే అందుకొంటూ వచ్చాడు. సభ్యత్వరుసుం అన్నప్రకారం చెల్లిస్తూ వచ్చాడు. కాని తీరాపరీక్ష వచ్చేసరికి తాను అందులో నెగ్గలేక పోయాడు. కామ్సొమాల్ సభ్యులలో చెడ్డవాడుగా తయా రయ్యాడు. నిజమేకావచ్చు. కాని, తాను ఏమిచేస్తే బాగుం డేది? వాళ్ళకు నచ్చజెప్పాలనీ, వాళ్లను అభివృద్ధిచేయాలనీ..." నీనా ఏమేమో చెప్పింది. చివరకు డిసెంబరిస్టులదాకా కూడా పోయింది. కాని ఇంతకీ వాళ్లను ఎలా అభివృద్ధిచేయాలో మాత్రం చెప్పనేలేదు. వాళ్ళను అభివృద్ధి చేయాలి; అంతే.

కమిటీ మీటింగు జరుగుతుంది. అంతా చర్చిస్తారు: ఈగొడవ జిల్లా అంతటా గప్పుమంటుంది. అందరినోళ్ళలోను తనపేరు నానుతుంది. గొడవ మాసిపోయిందని తాను అను కున్నాడు. బాధలు పడ్డాడు. ఓర్చుకొన్నాడు. చివరకు ఆ నరక కూపంలోంచి బయట పడ్డాడు. మళ్ళీ ఈతద్దినం వచ్చిపడింది. పరిస్థితి విషమరూపం ధరిస్తోంది. అయినా చెడ్డచేనుకి రెండు మంచెలా? ఇంతకన్నా చెడిపోయేది ఏముంటుందిలే అనివూరట చెందాడు ఫ్యోడార్.

శీతాకాలం సంధ్యాసమయం. ఇంటింటా దీపాలు వెలిగాయి. దీపానికొక కుటుంబం; ప్రతివానికీ ఒక కుటుంబం; ప్రతివానికీ ఒకయిల్లు. కాని, ఫ్యోడార్ నీకోమరి? బ్రహ్మచారిగది, మూలనున్న పడక....అదే నీకు గతి...పాతికేళ్ళ వయస్సుగల యువకుడు కూడా ఒక్కొక్కప్పుడు దిక్కూమొక్కూలేని పసిపాపలాగా బాధపడుతుండటం కద్దు.

# 19

నెల రోజులబట్టి స్తేషా యిల్లువిడిచి అసలు బయటకు పోవటమేలేదు. అంతకుముందు ఆమె కనీసం ఫ్యాక్టరీకైనా రోజూ వెళ్ళుతుండేది. ఇప్పుడు ఆమెకు ప్రసవసెలవ మంజూరు చేశారు. అహర్నిశలు నాలుగుగోడలమధ్య కాలక్షేపం చేస్తోంది. ఉదయం లేచినప్పటినుంచి మళ్ళీ రాత్రి నిద్రపోయేదాకా ఆమెకు ఒకటే ఆలోచన. ఒకటే ఆవేదన. అదే విషయం పదేపదే తలపోస్తున్నది. దారీ తెన్నూ కానరావటంలేదు. కాగా పోగా మిగిలిందల్లా మనోవేదన మాత్రమే. జీవితంలో విసుగుదల...విరక్తి....వీటితోనే రోజులు దొర్లిపోతున్నాయి; కాలం గడిచిపోతోంది....అలాగే నిన్నకూడా ముగిసింది.

కాని ఆమె మనస్సులో ఆశాలేశం చావలేదు. జిల్లా కామ్సొమాల్ కమిటీ కార్యదర్శి చాలా మంచిది....తనకు న్యాయం చేకూరేటట్లు ఆమె తప్పక చూస్తుంది... అన్న విశ్వాసం స్తేషాకు ఏర్పడింది.

కొయ్యముక్కలతో, చెక్కలతో గది నింపివుంది. అంతా కంగాళీగా వుంది. గదిమధ్య ఇంకా పూర్తిగా తయారుకాని స్లెడ్జి ఒకటి పడివుంది. పచ్చికర్ర వాసన గదినిండా గుబాళిస్తోంది. ఆమెతండ్రి గొడ్డలి చేతబూని కర్ర చెక్కుతున్నాడు. స్లెడ్జిలు చేయటంలో అతను మేటి. అయితే అన్నిప్పుడల్లా అతను వాటిని చేయడు. అడపాతడపా మాత్రమే తయారు చేస్తుంటాడు. అతను తయారుచేసే స్లెడ్జిలను దూర ప్రాంతాలనుంచి మరీ వచ్చి కొనుక్కుపోతుంటారు. బేరానికి వచ్చినవాళ్ళతో మరీమరీ చెప్పి పంపిస్తాడు: "ఇదిగో అనవసరంగా ఎక్కడా అనకండి. ఇది నాదగ్గర కొన్నట్టు చెప్పకండి" ఇది వర్వరాకు తెలిస్తే స్లెడ్జిలు చేసే పనిని అతనికి పురమాయిస్తుంది. అది అతనికి భయం. వ్యవసాయ క్షేత్రానికి తాను స్లెడ్జిలు చేసిపెట్టితే, తనకు ముట్టేదేమిటి? నాలుగు జీతపురాళ్ళు. అంతేగా. తనుచేసిన స్లెడ్జిలను అమ్ముకొని వ్యవసాయ క్షేత్రం లాభాలు గడిస్తుంది. ఇలాంటి విషయాలలో సిలాంతీపెట్రోవిచ్ అవులిస్తే పేగులు లెక్కపెట్టే రకం.

కూతురు గదిలోపలికి రాగానే, ఆ వృద్ధుడు తన ముద్దుల కూతురువైపు ఒకసారి తేరిపారజూసి సంతృప్తి చెందాడు. మళ్ళీ తనపనిలో తాను నిమగ్నమైపోయాడు. గొడ్డలితో కర్రను నాజూకుగా చెక్కుతున్నాడు.

తల్లిమాత్రం ప్రశ్నల పరంపరతో స్తేపాను ముంచెత్తింది.

"ఏమి జరిగింది? చెప్పు తల్లీ. వాళ్లేమన్నారు?"

స్తేషా తలకు కట్టుకొన్న షాల్ ముడివిప్పుతూ, బెంచీ పైన కూలబడింది. కోటు అన్నా విప్పకుండానే ఆశాభావం ఉట్టిపడే కంఠస్వరంతో జరిగిందంతా హుషారుగా చెప్పింది. జిల్లా కమిటీ కార్యదర్శి తనను ఏవిధంగా సాదరంగా ఆహ్వానించిందో, ఎంత సహృదయంతో; సద్భావంతో తనతో మాట్లాడిందో, చివరకు బయలుదేరి వస్తున్నప్పుడు తామిద్దరూ చేతులు కట్టుకొని ఎలా గదివెలుపలిదాకా వచ్చారో....అన్ని విషయాలు సాకల్యంగా చెప్పింది.

సంతోషం పట్టలేక అలెవ్‌తీనా ఇవనోవా పెంకు ఎగిరిపోయేటట్లు అరిచింది:

"వాళ్ళు వాడిపని పట్టుతారులే. తిక్క వదుల్తుంది. వదలవలసిందే"

"ఆఁ అంతా ఒకటే మచ్చు. మాటలకేం వచ్చె? లేనిపోని ఆశలు పెట్టుకోకండి. వీళ్ళంతా ఒకమూసలో తయారైనవాళ్ళేగా? అంటూ సిలాంతీ పెట్రోవిచ్ నిరాశ వెలిబుచ్చాడు.

బహుశా స్తేషా జీవితంలో ఇది మొదటి సారికావచ్చు. తనతండ్రి మాటలు ఆమెకు బొత్తిగా రుచించలేదు. తండ్రిని చూస్తున్న కొలదీ ఆమెకు అసహ్యమేస్తోంది .... అగూని .... మొఖాన్ని కప్పుతున్న ఆతెల్లజుత్తు, ఆ బండముక్కు, మొద్దుబారిన ఆచేతులు - ఎందుకలా మాట్లాడతాడు? ప్రతి విషయంలోను, అందరినీ తప్పు పట్టటమే అతని పనిలాగున్నది. ప్రపంచంలో అంతా చెడ్డవాళ్లేనా? మంచివాళ్ళు లేరూ, తప్పకుండా వున్నారు, అనుకొంది స్తేషా.

"ఏమోలెండి, వట్టిమాటలు కాకపోవచ్చు; వాడికి బుద్ధి గరపనూవచ్చు" అంది మళ్ళీ అనుమానంలో పడిన స్తేషా తల్లి.

"సరే. వాళ్లు ఏదోఒకటి చెప్తారే అనుకొందాం. వాడిని చివాట్లు పెడతారే అనుకొందాం. వాడికి శిక్ష వేస్తారే అనుకొందాం - ఇంతకీ మన స్తేషాకు వరిగేదేమిటండి?"

అలెప్ తీనా ఇవనోవా మారుచెప్ప లేకపోయింది. స్తేషాకూడ నోరుతిప్ప లేకపోయింది. ఆమెలోతలెత్తిన ఆశాలతను పుటుక్కున త్రెంచివేశారు.

"పదిరోజుల టైమ్ ఇస్తున్నాను. ఈలోపల నీ ప్రవర్తనను చక్కదిద్దుకో. ఇదే నాసలహా"అనవసరమైన సలహా....పూర్తిగా పనిలో మునిగిపోయినడుపుమాత్రమే అతను ఈ గొడవ మరచి పోగల్గుతున్నాడు. రేయింబవళ్లూ ఒకటే ఆలోచన. అయినా అతనికి దారీతెన్నూ కన్పించలా. దిక్కు తోచలా.

కమిటీ సమావేశం ప్రారంభమైంది. మొదట సాంస్కృతిక కార్యకలాపాలను గురించి చర్చించారు. తర్వాత ఇతర విషయాలు చర్చిస్తున్నారు. ఫ్యోడార్ గుండెల్లో రైళ్లు పరుగెడుతున్నాయి. హృదయం బరువెక్కుతోంది. ఈచిత్రహింసఎప్పటికి ముగుస్తుందో?

ఎట్టకేలకు అసలుసమస్య చర్చకు వచ్చింది.

"కామ్రేడ్స్, ఇప్పుడు మనం ఫ్యోడార్ సమస్యను తీసుకొని చర్చించాలి" అంటూ నీనా ఒక ప్రకటన చేసింది.

అందరి మొఖాలలోను ఒకే రకమైన భావం మెరిసింది జిల్లాలోకల్లా పెద్ద కామ్సొమోల్ యూనిట్ అయిన "రైట్

రోడ్ కోల్ఖోయ్" శాఖ కార్యదర్శి స్త్యోపారొకవ్‌కోవ్ మాత్రం ఫ్యోడార్ వంక చూస్తూ "ఏం సోదరా, ఈ సమావేశంలో నిల బెట్టి చెవులు మెలిపేయటానికి నిన్నిక్కడకు తీసుకొచ్చారా?" అని ప్రశ్నించాడు.

నీనా కథనం ప్రారంభమైంది.

"కొద్దిరోజుల క్రిందటే ఫ్యోడార్ సతీమణి నావద్దకు వొచ్చింది...." అంటూ నీనా ఫ్యోడార్ కథను ప్రారంభించి,

"నిజం. మీరంతానమ్మండి. నేనేమీ పక్షపాతబుద్ధితో చెప్పటంలేదు. యదార్థ విషయాలను ఉన్నవిఉన్నట్టు మీముం దుంచాను" అంటూ ముగించింది.

ఆ కంఠస్వరం సభికుల మొఖాలలో క్రోధం పుట్టిం చింది. సభికులలో నుంచి ఎవరో అన్నారు;

"అవమానకరం"

స్త్రేపా రూపు రేఖలను, అవతారాన్ని, ముఖకవళికలను కళ్ళకు కట్టినట్లు చిత్రిస్తూ నీనా ప్రసంగించింది. నిండు శూలా లైన స్త్రేపాను ఫ్యోడార్ వదిలేశాడంటూ ఆరోపించింది.

క్లుప్తంలో చెప్పాలంటే ఇదీ అసలు సమస్య. అభియోగం లోని సారంశం. "కామ్రేడ్ ఫ్యోడార్, నీవు చెప్పుకొనేదే మన్నా వుంటే చెప్పుకో" అంది నీనా,

ఫ్యోడార్ లేచి నిలబడ్డాడు.

అభియోగంలోని సారాంశం ఇదా ? రెండు అభియో గాలున్నాయి. ఒకటి తనదీ; రెండవ అభియోగం స్త్రేపాది.

రెండవ అభియోగాన్ని మాత్రమే నీనా ఏకరువు పెట్టింది? తన అభియోగాన్ని ఆమె పూర్తిగా వదిలేసింది.

అతను మాట్లాడకుండా నిలబడ్డాడు. తలవంచుకొని, కాలి బొటనవ్రేలితో నేలను రాపాడిస్తూ నిలబడ్డాడు...... అసంభవం. అంతా విడమర్చి చెప్పటం సాధ్యం కానిపని. స్త్రేషా పక్షం వాదన అందరికీ చాలా తేలికగా నచ్చుతుంది. తన పక్షం వాదన ఇతరులకు నచ్చదు. అదీ కాక, కమిటీ కార్యదర్శి నీనాయే స్త్రేషా పక్షం వహిస్తూ మాట్లాడిందాయె.

"ఆలోచించుకో అని పదిరోజుల క్రితం నీవు చెప్పావు. ఈ పదిరోజుల బట్టీ ఆలోచిస్తూనే వున్నాను ఎంత ఆలోచించినా నాకు ఏమి పాలుపోవటం లేదు. ఆ యింట్లో నేను మళ్ళీ అడుగు పెట్టలేను. వాళ్ళకు విషయాలు ఎలా బోధించాలో నాకు తెలియటం లేదు. స్త్రేషాను ఆ యింట్లోనుంచి వచ్చెయ్యమనండి. మే మిద్దరం వేరే యింట్లో కాపురం పెట్టుకొంటాం; బహుశా ఆమెకు విషయాలు బోధించటం మాత్రం నాకు సాధ్యం అవుతుందేమో. అంతకు మినహా నాకు మరో మార్గం కన్పించటంలా.... నేను మనస్సు విప్పి చెప్పుతున్నాను." ఫ్యోడార్ మధ్యలో ఆగాడు. ఊపిరి గట్టిగా పీల్చాడు. వంచిన తల ఎత్తకుండానే కుర్చీలో కూలబడిపోయాడు. వెంటనే లేచి "నేను చెప్పగల్గిందింతే" అని చెప్పి మళ్ళీ కుర్చీలో కూలబడ్డాడు.

"నన్నొక మాట చెప్పనిస్తారా?" అంటూ స్త్యోపా రుకకోప్ లేచి నిలబడ్డాడు. ఫ్యోడార్ వైపు గుడ్లురుముతూ చూశాడు. "నీకు చిక్కు సమస్య ఒకటి ఎదురైంది. అయిన ప్పుడు దానిని నీవు ఎలా పరిష్కరించావు? దానికి ఒక నమ

స్కారం పెట్టి, పారిపోయావు అంతేగా? ఇదేనా కామ్సొమోల్ చేయవలసిన పని? సిగ్గుచేటు....కాని, కామ్రేడ్స్"

నీనా గ్లజిచేవా చెవులు నిగిడించి వింటోంది. స్త్యోపా రుకకోవ్ లోతుపాతులు ఆమెకు తెలుసు. ఒక వ్యక్తినిగురించి ప్రశంసలతో, ఆవ్యక్తి సద్గుణాలను గురించి రుకకోవ్ ప్రసంగం ప్రారంభించాడా చివరకు మంచె త్తేఖండనతో, నిశితమైన విమర్శతో ప్రసంగం ముగిస్తాడు. అలా కాక, ఉరుములతో, మెరుపులతో ఉపన్యాసం మొదలెట్టాడా చివరకు ఆ వ్యక్తిని వదిలి పెట్టాలని సూచిస్తూ ముగిస్తాడు' ఈ రెండింటిమధ్యవుంది రెండే రెండు ముక్కలు. "కాని, కామ్రేడ్స్....

ఈ విషయం నీనాకు బాగా తెలుసు.

ఈదఫా స్త్యోపా గాంభీర్యంచుతూ ఉపన్యాసం ప్రారంభించాడు కనుక, పర్యవసానం ఎలా వుంటుందో ముందుగానే, తేలికగానే నీనా ఊహించింది. అందుకే జాగ్రత్తపడుతోంది.

"కాని, కామ్రేడ్స్....పోద్దార్ సతీమణి ఒకప్పుడు కామ్సొమోల్ సభ్యురాలు అని నీనా చెప్పిన దానిసిబట్టి తేలుతోంది. ఆమె ఆ సభ్యత్వాన్ని విసర్జించింది, ఎందుచేత? అందుకు బాధ్యులు ఎవరు? జిల్లాకమిటీ, కాకలు తేరిన మనబోటి కామ్సొమోల్ సభ్యులం ఇంతకాలం ఏమిచేస్తున్నట్టు? ఇందులో స్తేపాది ప్రధాన భాధ్యత కదా?"

స్త్యోపా రుకకోవ్ కుదమట్టంగావుంటాడు. రాగిజుత్తు. "రైట్ రోడ్డు సమష్టి వ్యవసాయక్షేత్రంలోని ఆడపిల్లలంతా అతని మెరమెచ్చులు పొందటంకోసం, అతని హృద

యాన్ని ఆకర్షించటంకోసం నానా తంటాలు పడుతుంటారు. విమర్శలను తట్టుకోగల్గిన చేవగలవాడు. అని చూచి మాట్లాడ డాడు. అందుకే అతని మాటలకు అంత విలువ. .

"దీనంతటికీ కారకుడు ఫ్యోడార్ అంటూ నిందించి ప్రయోజనంలేదు. కాని పాపాలన్నింటినీ కట్టకట్టి అతని నెత్తినే రుద్దుతున్నారు....ఇదిమంచిదికాదు....నిజమే అతనుకూడాకొంత వరకు నిందార్హుడే కాదనను. అందుకే అతనిని గట్టిగామందలించి వదిలేస్తే సరిపోతుందని నా ప్రతిపాదన."

"కొంతవరకు మాత్రమే నిందార్హుడా? భార్యను వదిలే శాడు. అలాంటి వ్యక్తిని మందలించి వదిలేయటమా? మంద లించి వదలటం, నిరపరాధి అని వదిలివేయటమే అవుతుంది. కాక మరేమిటి?" అంటూ నీనా ఆవేశంతో చిందులు తొక్కింది.

"అతనిని బహిష్కరించాలి. నిజానికి ఆ శిక్షకూడా సరిపోదు." అంటూ ఒక మహిళామణి తీర్పుచెప్పింది. నీనాకు నచ్చనిమాట చెప్పటం ఆ తరుణీమణికి బొత్తిగా నచ్చదు,

వాదప్రతివాదాలు బయలుదేరాయి. ఫ్యోడార్‌ను గట్టిగా మందలించాలా? లేక ఒకమాదిరిగా మందలించివదిలేస్తే సరిపోతుందా? చర్చలు సాగుతున్నాయి. ఫ్యోడార్ కుర్చీలో కూలబడి, తలవంచుకొని కూర్చుని అందరి వాదనలు వింటు న్నాడు.

"ఎందుకొచ్చిన చర్చలు ఇవి. అసలు విషయం వదిలేసి ఏవేవో విషయాలకు పోతున్నారు. అతనిని మందలిస్తూ ఒక తీర్మానం వ్రాస్తే సరిపోతుంది, ఆ పని చేయటం చాలా

తేలిక. కాని అతని భార్య బాధపడుతోంది. అతనూ విచార పడుతున్నాడు. అతని మొఖం చూస్తేనే తెలుస్తుంది. అయితే మనం మాత్రం వారిద్దరి బాధలను కలంతోను, సిరాతోను కాగితంపై నయంచేయాలని ఆలోచిస్తున్నాము. అంతేగా అన్నాడు మరొక యువకుడు వ్యంగ్యోక్తిలో.

అతను నెమ్మదిగా, తాపీగా, ముఖంపై పడుతున్న జుట్టును చేతితో పైకి ఎగదోస్తూ మాట్లాడాడు. అసలు సమావేశాలలో మాట్లాడే అలవాటు అతనికి లేదల్లేవుంది.

"ఈ వేళ మన మిక్కడ ఎందుకు సమావేశమైనట్టు? కేవలం మందలించటానికేనా? కష్టాలలో చిక్కుకున్న ఒక వ్యక్తికి సహాయం చేయాలన్న దృష్టితో మన మిక్కడ కూడాం గదా''

"అవును. అందుకే మన మిక్కడ జేరింది!'' నీనా వికసించిన మొఖం పెట్టి అందుకొంది.

"అయితే ఎలాగా సాయపడటం? అదే మన ముందున్న సమస్య. నామట్టుకు నాకు ఏమీ పాలుపోవటంలేదు ఉన్న విషయం చెప్పుకోటం మంచిది. ఏమి చేయాలో నాకు తోచటంలేదు."

"కామ్రేడ్ ఫ్యోడార్ నీవు చెప్పు: మేము నీకు ఎలాంటి సహాయం చేయాలో చెప్పు. కావలసిన సహాయమంతా నీకు చేస్తాం" అంది జిల్లా కమిటీ నాయకురాలు నీనా

సహాయమా?....ఫ్యోడార్ చుట్టూ పరికించి చూచాడు? ఏమి చెప్పాలో అర్థంకాక స్తేపాను ఆయింటినుంచి బయటకు

తెప్పించమని అడిగితే? కన్నారింటినివదిలి భర్తదగ్గరకు వెళ్ళమని జిల్లాకమిటీ ఎలా ఆదేశించగలదు? ఒకవేళ ఆదేశించినా జిల్లా కమిటీమాట ఆమె వింటుందా?

"ఏమో నాకేమీ తోచటంలేదు" అంటూ ఫ్యోడార్ నిస్పృహ వెలిబుచ్చాడు.

ఎవరూ ఏమీ చెప్పలేకపోయారు. నీనా దృష్టి ఫ్యోడార్ పై నుంచి మరొకవైపుకు మళ్ళింది. ఏనిర్ణయానికి రాలేని దుర్బలుడు అనుకొంది.

"అతనికి ఎలాంటి సహాయం చేయాలో మనకే తెలియటంలేదు. అయినప్పుడు అతనిని మందలించాలనే ప్రతిపాదనలో అర్థం ఏమిటో చెప్పండి" అంటూ ఆ యువకుడు అసలు విషయం తేల్చాడు.

"అంటే ఫ్యోడార్ ప్రవర్తనకు శిక్ష అవసరం లేదన్న మాట?" అంటూ నీనా హుంకరించింది. ఆమె హృదయం భగ్గున మండిపోతోంది.

"ఒకవేళ మనం అతనిని మందలించామే అనుకోండి. దానివల్ల వరిగేదేమిటి? పరిస్థితి బాగుపడుతుందా? బాగుపడబోదు."

ఈ యువకుని మాటలతో మండిపోతున్న నీనా నిప్పులు చెరుగుతూ ప్రసంగం ప్రారంభించింది. ఇలాంటి మాటలు మాట్లాడే వారికి అసలు జిల్లా కమిటీ బాధ్యతలు ఏమిటో కూడా తెలియవని విసిరింది. ఫ్యోడార్‌ను గట్టిగా మందలిస్తూ తీర్మానించితే అది ఇతరులకు గుణపాఠంగా పనిచేస్తుందన్నది....ఇలా ఏమేమిటో చాలాసేపు మాట్లాడింది. సాహి

త్యంలో విషయాలు, ప్రముఖుల జీవిత చరిత్రల్లోని విశేషాలు ఏకరువు పెట్టింది. ఆమె ఉపన్యాసం పూర్తయ్యే సరికి, అభిశం సిస్తూ తీర్మానించాలా లేక మెత్తగా మందలిస్తే సరిపోతుందా అన్న అంశం చర్చనీయాంశమైంది. అభిశంసిస్తూ తీర్మానించాలనే నిర్ణయమైంది,

స్త్యోపా రుకకోవ్ గబగబా నడిచివెళ్ళి, ముందు పోతున్న ఫ్యోడార్‌ను వీధిలో కలుసుకొన్నాడు.

"ఆ యువకుడున్నాడు చూశావ్. బడిపంతులు, జోక్యం కల్పించుకొని, మాట్లాడకపోతే అభిశంసన తీర్మానం లేకుండా చేయగలిగేవని. ఆ పంతులు ఎన్నో గ్రంథాలు చదివాడు. సహృదయుడే, అయితే మాత్రం లాభం ఏమిటి? ఎప్పుడు ఎక్కడ ఎలా వ్యవహరించాలో బొత్తిగా తెలియదు పాపం" అని ఊరట కల్గించాడు రుకకోవ్.

"అభిశంసన అయినా మందలింపు అయినా నాకు ఒకటే మీకే మహారాజులు. ఈవాళ విషయం రేపు మరచిపోగలవారు ఇతరుల కష్టాలంటే మీకు చాలా తేలిక"

స్త్యోపా నిశ్చేష్టుడయ్యాడు: "అదేమిటి సోదరా? నీవు అలా భావించటం సరికాదు."

# 20

ఫ్యోడార్ పొద్దుపోయేదాకా మెషీన్-ట్రాక్టరు స్టేషన్ లోనే వుండిపోయాడు. తొందరపని వుండికాదు. గదిలో నాలుగు గోడలమధ్య ఏకాంతంగా వుండలేక, మనస్సు బాగాలేక మెషీన్-ట్రాక్టరు స్టేషన్ లోనే వుండిపోయాడు.

గది కొచ్చేసరికి బాగా పొద్దుపోయింది. ఇంటిముందు స్లెడ్జికి కట్టిన ఒక గుర్రం నిలబడివుంది. గదిలో ప్రవేశించగానే ఇగ్నాత్ తాత కన్పించాడు. ఆ ఇంటి యజమానితో ఏదో బాతాఖానీ వేస్తున్నాడు.

"ఏరా, బాబూ, ఇంతసేపు నీవు ఎక్కడెక్కడ చెక్కర్లు కొట్టివచ్చావ్? నీకోసం నేనిక్కడ పడిగాపులు పడి వున్నాను. మళ్ళీ ఇప్పుడు అమావాశ్య చీకట్లో యింటికి పోవాలి"

"ఏమిటి విశేషం? ఏం జరిగింది? నాతో ఏమైనా పనుండి వచ్చావా?"

"మాయింటి యజమానురాలు నీతో ఒక కబురుచెప్పి రమ్మని నన్ను పంపింది." అంటూ ఇగ్నాత్. ఇంటి యజమాని వైపు తిరిగి, "సరే, నీవు పదవయ్యా, ఏదో మేము కాస్త ఆంతరంగిక విషయాలు మాట్లాడుకోవాలి" అని ఆజ్ఞాపించాడు.

"సరే, పీ, రహస్యాలు నాకెందుకులే" అని గొణుక్కుంటూ యింటి యజమాని వెళ్ళిపోయాడు.

ఇగ్నాత్ తాత ఫ్యోడార్ వైపు తిరిగి రహస్యం బయట పెట్టాడు.

"ఆఁ ఏమీలేదు. ఇవాళ నేను సిలాంతీ కలిసి నీ భార్యను తీసుకెళ్ళి ఆసుపత్రిలో చేర్చాం, అదీ జరిగింది అంతే"

"ఏమిటన్నావ్?"

"ఏమీలేదబ్బా, పాప.... నెలలు నిండినవని నీకు తెలియదా ఏమిటి? ఈ కబురు నీ చెవినివేసి రమ్మని మా ముసల్ది చెప్పితే వచ్చాలే. అసలు సిలాంతీయే ఈ పనిని చేయొచ్చుననుకో కాని, అతను నాతో మాట్లాడటంలేదుగా. అందుకని నేను వచ్చాలే"

"స్తేపాను ఆసుపత్రిలో ఎప్పుడు చేర్పించారు?"

"ఈవేళ మధ్యాహ్నమే"

"అయితే ఈపాటికి ప్రసవించి వుంటుంది. పాప కేరింతలు కొట్టుతుంటుంది"

"ఆ విషయం నేను చెప్పలేనబ్బా అలాంటి విషయాలు మనకు బొత్తిగా అంతుబట్టనివి".

ఫ్యోడార్ ఎగిరి గంతేశాడు.

"ఇగ్నాత్ తాత నేను వెళ్లుతున్నాను. సరాసరి మెషీన్ ట్రాక్టరు స్టేషన్ కేవచ్చి ఈవార్త నా చెవిని పడేస్తే నీ సొమ్మేం పోయింది. ఇప్పుడే ఆఘమేఘాలమీద వెళ్ళి అక్కడ వుంటాను"

అంటూనే ఫ్యోడార్ గబగబా పరుగెత్తాడు.

ఇగ్నాత్ తల పంకించాడు. కోటుతీసి ధరించాడు. బయటకు సాగాడు.

వెళ్ళిపోతూ, వెళ్ళిపోతూ "ఏయ్ నిన్నే, ట్రాఫిమ్, తలుపు గడియవేయకు. అబ్బాయి మళ్ళీ యిప్పుడేతిరిగి వస్తాడు" అంటూ ఇగ్నాత్ ఇంటి యజమానికి చెప్పి మరీ వెళ్ళాడు.

పోృడార్ జాంబవంతుని అంగలేసుకొంటూ సాగిపోతు న్నాడు పరుగు లంకించుకొన్నాడు.

పరుగెత్తనేల? ఎందుకే ఆందోళన? స్త్రీషాపట్ల అతనికి గల ప్రేమ కష్టాల అట్టడుగునపడి అణగారిపోయింది. ఇక్కట్టుల ఇసుకరేణుల్లో కలిసి యింకి పోయింది. మరి ఇప్పుడా ఆరాట మెందుకు? పుట్టిన బిడ్డమీద ప్రేమ? ఆ బిడ్డను తానింతవరకు చూడనైనా లేదే? ఆ బిడ్డరూపు ఎలాంటిదో తాను ఊహించ నన్నా ఊహించలేదే? ఊహకు అందని దానిని ప్రేమించటం ఎలా సాధ్యం? అతనిలో ప్రేమానురాగం ఇంకా పూర్తిగా నశించిపోలేదా? ఏమో, అది కొనవూపిరితో వుండి, ఇప్పుడు నిండా జీవం పొందిందేమో? ఎవరు చెప్పగలరు?

ఊరికి వెలుపల, నిమ్మతోటలో ఆసుపత్రి వుంది. ఆసు పత్రి గేటుదాకా పరుగెత్తిన పోృడార్ హఠాత్తుగా ఆగి పోయాడు.

అక్కడిదాకా ఉరుకు్కంటూ పరుగెత్తుకొచ్చిన పోృడార్ గేటులో ఎందుకు ఆగిపోయినట్టు? ఆసుపత్రికి వెళ్ళనేల? ఆమెకు శుభాకాంక్షలు తెల్పటానికి? తన శుభాకాంక్షలతో ఆమెకు పనేమిటి? సంతోషమా? తీరా అక్కడిదాకా వెళ్ళితే, సంతో షమే ఎదురవుతోందో లేక విచారమే ప్రత్యక్షమవుతుందో? ఎవరు చెప్పగలరు? పోనీ యింటికెళ్ళి, దుప్పటి తన్ని హాయిగా నిద్రపోదామా? అసంభవం! అప్పుడు అతనికి గుర్తుకొచ్చింది.

సంతోష సమయాలలో బహుమతులు లేకుండా, రిక్తహస్తాలతో వెళ్ళటం ఏమి భావ్యం? ఇదిగో, రిక్తహస్తాలతో వచ్చాను అని ఆమెముందు నిలబడటం తలవంపుకాదు? వట్టిచేతులతో వెళ్ళకూడదు. ఏదైనా బహుమతి కొని, తీసుకెళ్ళాలి అని ఫ్యోడార్ నిశ్చయించుకొన్నాడు.

ఫ్యోడార్ తిరుగుముఖం పట్టాడు.

అర్ధరాత్రి కావస్తున్నది. షాపులన్నీ ఎప్పుడో మూసి వేస వుంటారు. కాని, పావ్‌లాపాక్‌లోనాషాపుమాత్రం యింకా తెరిచే వుండవచ్చు.

ఫ్యోడార్ గబగబా ఆ షాపుకు పరుగెత్తాడు అతను అక్కడికి వెళ్ళేసరికి లారీ డ్రైవర్లు చాలామంది షాపులో వున్నారు. తినుబండారాలు కొనుక్కొని తింటున్నారు. లారీలలో ఎక్కించుకొని వెళ్ళటానికి ప్రయాణీకులతో బేరాలు సాగిస్తున్నారు.

"ఫ్యోడార్"

వెనుకనుంచి ఎవరో పిలిచారు. ఫ్యోడార్ వెనుతిరిగి చూశాడు. ఫ్యోడార్ పూర్వమిత్రుడు వాస్యాల్యూచిమోవ్! వాస్యాల్యూచిమోవ్ గబగబావచ్చి ఫ్యోడారుతో కరచాలనం చేశాడు.

"పావ్‌లా పాక్‌లోనా, మరొకసీసా తీసుకురా. చాలా కాలానికి పాతమిత్రుడు కలిశాడు."

"వద్దు, వాస్యా. నీతోకలిసి సీసా ఖాళీచేయటం నాకు సంతోషదాయకమే. కాని, నేను త్వరగా వెళ్ళిపోవాలి. పుణ్యముంటుంది. నన్ను బలవంతపెట్టకు.

"అదేమిటిరా, మనిద్దరం కలుసుకొని సంవత్సరం పైగా అయింది. ఇన్నాళ్ళకు మళ్ళీ కలుసుకొన్నాం. విక్టరు సీసా ఖాళీ కావలిసిందే."

"ఇదిగో నామాటవిను, బాబుగా. అక్కడ నాభార్య ఆసుపత్రిలో వుంది. ఇవాళ ప్రసవించింది. ఆమెకు ఏదైనా బహుమతి పట్టుకెళ్ళుదామని ఇక్కడకు పరుగెత్తుకొచ్చా"

"అదావిషయం. సరే ఇప్పుడు అర్థమైందిలే. పో. త్వరగా వెళ్ళు. అదృష్టవంతుడవి సోదరా. బహుశా కొడుకే పుట్టివుంటాడు. ఏమంటావ్? ఏమైనా నీవే మొనగాడివిరా. మాఅందరినీ తలతన్ని ముందుకుపోయావు. నేనుకూడా పెళ్ళి చేసుకోవాలను కొంటున్నాలే."

వాస్యా సంతోషానికి పట్టపగ్గాలు లేకుండావుంది. వాస్యా హడావిడిచూసి, చుట్టూవున్నవాళ్ళు ఫ్యోడార్ వంక ఎగాదిగా చూస్తున్నారు.

ఈ గొడవేమీ తనకు పట్టనట్టు, ఫ్యోడార్ ముఖభావం ధరించి, స్వీట్లూ, చాక్లెట్లూ కొని, పొట్లాం కట్టించుకొని బయలుదేరాడు.

"ఫ్యోడార్, కనీసం ఒకసారైనా క్రోమ్‌స్తోవాకు రా. అక్కడివారంతా నీకోసం బెంగపడుతున్నారు. తప్పక వస్తావ్‌గా. నీకు కొడుకు పుట్టాడన్న వార్తను నేను అందరికీ చేరవేస్తాలే. సరే నీవువెళ్ళు. నిన్నుయింకా ఆపుచేయటం అంత బాగుండదు" అంటూ వాస్యా ఫ్యోడార్ వీపుపై చరుస్తూ సాగనంపాడు.

వాస్యాను కలుసుకోనేముందు ఫ్యోడార్ మనస్సు ఆందోళనాభరితమైవుంది. వాస్యా కేరింతలు, సంతోషమూ చూసిన తర్వాత అతనిలో మానసికాందోళన కొంత తగ్గింది. సంతోషమూ, ఆశాభావమూ అతని హృదయంలో పొడుచుకుపోయి తాను వట్టి అవివేకి; కాకపోతే, చిన్న విషయాలపై లేనిపోని ఆలోచనతో బుర్రను పాడుచేసుకొంటూనా అనుకొన్నాడు. కొండను త్రవ్వి ఎలుకను పట్టిన చందమైంది. జఠిలం అనుకొన్న సమస్య సునాయాసంగా పరిష్కారమైపోయినట్టుంది: పుట్టిన బిడ్డకు తాను తండ్రి; "స్త్రీషా, నీవు వచ్చి నాతోకలసి జీవించక తప్పదు" అని గట్టిగా కోరే హక్కు తనకు వుంది; తనమాటే చెల్లుతుంది; అన్ని విషయాలు చక్కబడుతాయి ఫ్యోడార్ నిశ్చయించుకున్నాడు.

నిర్మానుష్యమైన వీధులగుండా పరుగెత్తి, మళ్ళీ ఆసుపత్రికి చేరాడు.

అసుపత్రిలో ప్రసూతిశాఖ వెయిటింగ్‌రూమ్‌లో ఒకే వ్యక్తి కూర్చొనివున్నాడు. ఆవ్యక్తికి షుమారు 40 సంవత్సరాల వయస్సు వుంటుంది. అతను ఏదో ఆఫీసులో ఉద్యోగిలాగా కన్పిస్తున్నాడు. ఫ్యోడార్ గుండె వేగంగా కొట్టుకొంటోంది. అసలే హృదయంలో ఆందోళన, అందులోను పరుగెత్తుకొచ్చాడేమో, పాపం రొప్పుతున్నాడు. లోపల ఏమి జరుగుతున్నదోనని ఫ్యోడార్ భయపడుతున్నాడు. ఫ్యోడార్ వాలకం చూస్తేనే తెలిసిపోతుంది.

"ఇదే మొదటిసారికాబోలు" అని ఆ గదిలో కూర్చున్న వ్యక్తి అన్నాడు.

ఈమాట ఫ్యోడార్‌కు అర్థం కాలేదు.

"మీరంటున్నదేమిటి?"

"ఏమీలేదు; మీ భార్యకు మొదటికాన్పు ఇదేనా అని అడుగుతున్నాను"

"మీకెలా తెలుసు?"

"నిన్ను చూడగానే ఆ విషయం తెలిసిపోయింది. నేను ప్రతియేటా ఇక్కడకు వస్తుంటాను. ఇది ఆరోసారి."

లోపలినుంచి ఒకనర్సు వచ్చింది. ఆ వ్యక్తి ఏదోవస్తువు పొట్లాం అందించి వెళ్లిపోయింది.

"ఆందోళన చెందకు. అన్నీ సవ్యంగానే జరిగిపోతాయి కొడుకు కావాలని కోరుకుంటున్నావా? కూతురు కావాలని కోరుకుంటున్నావా?" అని ఆ వ్యక్తి ప్రశ్నించాడు.

"కొడుకే కావాలి"

"అయితే తప్పకుండా నీకు కూతురే పుట్టుతుందిలే."

"ఎందుకని?"

"అనుభవంలో తేలిన సత్యం. కూతురు కలగాలని ప్రతిసారీ నేను కోరుకోటం, ప్రతితడవా కొడుకే కలుగుతుండటం జరుగుతోంది." అంటూ అతను లేచి ప్రయాణమయ్యాడు.

మళ్ళీ నర్సు వెయిటింగ్ రూములోకి వచ్చి ఫ్యోడార్ వంక చూస్తూ, 'మీ పేరేమిటి?' అని ప్రశ్నించింది.

"ఫ్యోడార్"

"ఇక్కడ ఫ్యోడార్లు ఎవరూలేరు. స్తేషా మీ భార్యయేనా? ఆమె ఇవాళ ఆసుపత్రిలో చేరింది. ఆమెకు ఏవో

బహుమతులు పట్టుకొచ్చినట్టున్నారు. ఇలా ఇవ్వండి. వాటిని ఆమెకు అందజేస్తాను."

"ఇంకా ప్రసవించలేదా?"

"అనుకొన్నంత తొందరగా పనులు పూర్తికావు. మీరు వంటరిగా ఇంటికి తిరిగివెళ్ళండి. పోయి నిద్రపొండి. వెయిటింగు రూముకు ఏకబురు మేము మీకు తెలియపరుస్తాం."

"ఇక్కడే వుంటాలెండి."

"మీరు యింటికి వెళ్ళిపోవటం మంచిది. కొన్ని సందర్భాలలో మూడురోజులకుగాని బిడ్డ భూమిమీద పడటం జరగదు. మరి ఆ విషయం మన చేతుల్లో లేదుగా"

ఫ్యోడార్ చాలాసేపు ఆసుపత్రి ఆవరణలోనే కాలు కాలిన పిల్లిలాగా అటూ యిటూ తచ్చట్లాడుతూ కాలక్షేపం చేశాడు. మెటర్నిటీవార్డు కిటికీలదగ్గరకు వెళ్ళి, చెవులు ఆలకించి వింటూ నిలబడ్డాడు. స్త్రేషా నొప్పులు పడుతూంటుంది. ఆమె మూలుగులు ఏమైనా విన్పిస్తాయేమోనని అతని ఆశ. కాని లాభం లేకపోయింది. కిటికీల తలుపులు మూసివున్నాయి. ఎంత ప్రయత్నించినా లాభంలేదు.

ఆ విధంగా చాలాసేపు మంచులో తడిచి, తడిచి, ఫ్యోడార్ చివరకు గదికి బయలుదేరాడు.

ఆ రాత్రల్లా అతనికి అసలు నిద్ర పట్టనేలేదు.

తెల్లవారగానే, ఆసుపత్రికి ఫోన్‌చేసి కనుక్కొన్నాడు. ఆశాభంగం కల్గించే సమాధానం వచ్చింది. ప్రతిగంటకు ఒకసారి ఫోను చేస్తూనే వున్నాడు. ప్రతిసారీ "ఇంకాలేదు" అన్న జవాబే వచ్చింది.

సాయంత్రానికి గాని స్త్రేషా ప్రసవించలేదు.

# 21

నొప్పులు వచ్చినప్పుడల్లా స్త్రేషా గిలగిలా తన్నుకొంది. గగ్గోలు పెట్టింది. "నాకువద్దు. ఇది నాకువద్దు" అంటూ బాధతో అరిచింది. డాక్టర్లకు, నర్సులకు ఇలాంటి అరుపులు వినటం మామూలే. అందుకే ఈ మాటలను వారు అంతగా పట్టించుకోలేదు. వారు తమకు తోచినవిధంగా ఈ మాటలను అర్థం చేసుకొన్నారు. "నాకు వద్దు" అంటే "ఈ చిత్రహింస నాకు వద్దు" అని అర్థం చేసుకొన్నారు. స్త్రేషా మూలుగులు కేవలం బాధనుంచీ నొప్పులనుంచీ పుట్టుకొచ్చినవి మాత్రమే కాదు. పుట్టబోయే బిడ్డ 'నాకు వద్దు' అని ఆమె అంటోంది. మొగుడు వదిలేసిన ముండకు బిడ్డ ఎందుకు? ఇదీ ఆమె బాధ.

ఆమె ప్రసవించింది. నర్సు బిడ్డనుతీసికెళ్లి స్త్రేషాప్రక్కనే పడుకోబెట్టింది డాక్టర్లు, నర్సులు, చుట్టుప్రక్కలవాళ్లు అంతా సంతోషంతో నవ్వుతున్నారు. ప్రతివారు కరుణార్ద్రహృదయంతో ఆమెవంక చూస్తున్నారు. ఈ ప్రపంచంలోకి మరొక ప్రాణిపాదం పెట్టింది. అయినప్పుడు చూసి సంతోషించని వారెవరుంటారు?

ఆ పసికందు చిరుపెదవులు చంటిమొనను కరచుకొన్నాయి. స్త్రేషా దేహమంతా ఒక్కసారి పులకరించింది. అనిర్వచనీయమైన, ఎన్నడూ పొందని మధురానుభూతి ఆమె

యిప్పుడు పొందుతోంది. జాగ్రత్తగా పసిబిడ్డను తన దగ్గరకు తీసుకొని హత్తుకొంది. ఆమె కళ్ళలోనించి బాష్ప బిందువులు జలజల ఒలికాయి. అవి ఆనందబాష్పాలు, కొద్దిక్షణాల క్రితం దాకా ఈ పసిపాప "నాకువద్దు, వద్దు" అని ఎందుకు అన్నానా అని ఆమె సిగ్గుపడింది. తల్లి చంటిని గట్టిగాపట్టుకొని పాలు తాగుతున్న ఆ పసిపాపను చూసుకొని, మాతృహృదయం ఉప్పొంగింది.

బిడ్డకు పాలిస్తూ, తనబిడ్డ రూపురేఖలు ఎలావున్నాయో అని స్తేషా తదేకంగా చూస్తోంది. ఇంతలోకే ఎవరో వచ్చి అక్కడ నిలబడినట్టు ఆమె గ్రహించింది. కన్నెత్తిచూసింది. మంచం ప్రక్కనే ఫ్యోడార్ నిలబడివున్నాడు. అతని మొఖంలో సంభ్రమం, ఆందోళన మిళితమైవున్నాయి.

భార్యాభర్తలు పరస్పరం పలకరించుకోలేదు. మంచి చెడ్డలు అడగలేదు ఫ్యోడార్ మంచంపట్టిపై కూర్చున్నాడు. కొద్ది క్షణాలుసేపు మాటలు లేకుండానే గడిచాయి. చివరకు ధైర్యంచేసి ప్రస్తావన ప్రారంభించాడు

"నీకు ఏమున్నా కావలిస్తే చెప్పు. నీకోసం ఆపిల్ పళ్లు పట్టుకొచ్చాను."

స్తేషా కోపంతో, క్రోధంతో లేదని ఫ్యోడార్ గ్రహించాడు. ఆమె మొఖం తిప్పేసుకోలేదు. తనవంకే చూస్తున్నది. అతని మొఖంలో చిరునవ్వు మెరిసింది.

"కూతురుని కన్నావన్నమాట. అద్భుతం చాలా మంచి పని చేశావ్."

స్తేపా ఔననికాని, కాదనికాని అనలేకపోయింది. మన సులోమాత్రం నిజంగా అద్భుతమే అనుకొంది

"దీనికెప్పుడూ నిద్రే. పాలు తాగుతుంది. మళ్ళీ నిద్ర పోతుంది. చూడండి, అప్పుడే మళ్ళీ నిద్రపోయింది.''

ఫ్యోడార్ అట్టేసేపు అక్కడ వుండలేదు బిడ్డనుగురించే వాళ్ళిద్దరూ ముచ్చటించుకొన్నారు: పాప బరువెంతో, పాపకు ఎలాంటి చొక్కాగుడ్డలు కొనాలో చర్చించుకొన్నారు.

ఒకనర్సు వచ్చి నిలబడింది. పాపను చూసుకోటానికి ఒక నిముషం అనుమతిపొంది, ఫ్యోడార్ లోనకు వచ్చాడు. వచ్చి అప్పటికే పావుగంట గడచిపోయింది. నర్సు రాకలో అంతరార్థం గ్రహించిన ఫ్యోడార్ లేచి నిలబడ్డాడు. వెళ్ళబోతూ నిశ్చయం ధ్వనింపచేస్తున్న గొంతుకతో మృదువుగా చెప్పాడు: ''స్తేపా, ఇదిగో ఇప్పుడే చెప్పుతున్నాను. ఇక నీవు నాతోపాటు జీవించక తప్పదు, ఇక్కడా అక్కడా వీల్లేదుసుమా''

ఎందుచేతనోగాని ఫ్యోడార్ ఈవేళ స్తేపాకు అత్యంత ప్రియతమంగా గోచరించాడు. ఇంతగా ఇంతకుముందెన్నడూ అనిపించలేదు.

అయినప్పటికీ ఆమె బిడియపడుతూ తన అభ్యంతరం తెల్పకపోలేదు.

"ఫ్యోడార్, ఇంటిదగ్గర వుంటేనే మంచిది. పాపకు ఎలాంటి యిబ్బందిలేకుండా వుంటుంది మాఅమ్మ నాకు సాయ పడుతూ వుంటుంది.''

మరుసటిరోజు స్తేపా తల్లి కూతురిని, మనుమరాలిని చూడటానికి ఆసుపత్రికి వచ్చింది. స్తేపా అన్యుల కంటపడ

కుండా వెయిటింగ్ రూమ్‌లోకి వెళ్లింది. ఆమె బాగా చిక్కిపోయింది; తల దువ్వుకోనందున, జుత్తుఅంతా చెదిరిపోయి వుంది.

అలెవ్‌తినా ఇవనోవా కూతురు కనిపించగానే లబో దిబోమంటూ బిగ్గరగా గోల చేయసాగింది: "అయ్యో, ఎంత జరిగిందే. భగవంతుడికి మనమీద యింకా దయకల్గినట్లు లేదే." మనమడు పుట్టలేదని ఆమె దుగ్ధ.

కొంత సేపటికి ఇవనోవా శాంతపడింది. మామూలీ ధోరణిలో మాట్లాడసాగింది.

"భయపడకు తల్లీ. నీకు కావలసినవన్నీ నేను సిద్ధంచేసి పెట్టానులే. బిడ్డకు కావలసిన వస్తువులన్నీ తయారుగానే వున్నాయి. మీనాన్న ఉయ్యాలకూడా తయారుచేసి, సిద్ధంగా వుంచారు"

భయపడుతూ చెప్పింది.

"అమ్మా, మరేం? ఫ్యోడార్‌తో కలిసి నేను వేరే యింట్లో కాపురం పెట్టుకుంటాన్. ఆయన యివాళవచ్చి అడిగాడుకూడ."

"వచ్చి నిన్ను అడిగాడా? అంత అభిమానం పట్టి అతన్ని పీడిస్తోందా? పోనీలే, ఋమార్పణ కోరకుండానే వచ్చి మన యింట్లో వుండమనీ చెప్పకపోయావా?"

తల్లి భుజంపై వాలి కళ్ళతడి పెట్టుకుంటూ, స్తేపా ప్రాధేయ పూర్వకంగా అడిగింది:

"అమ్మా నీవేచెప్పు. భర్తను వదిలేసి, ఈ బిడ్డను పెట్టుకొని మన యింట్లో వుండటం ఎట్లాగమ్మా? నలుగురూ నవ్వి పోరూ? ఆయనేమో చచ్చినా మన గడప తొక్కడాయె."

"ఇదేమిటి? ఎవరు అనుమతించారు? నర్సులు ఏమను కొంటున్నారు? పచ్చివంటితో నిన్ను ఇక్కడకు ఎలా రానిచ్చారు? పదపద. వారంరోజులపాటు మంచంపై నుంచి కదల బోకు. తెలిసిందా?" గది ద్వారంవద్ద నిలబడిన లేడీడాక్టరు హుంకరించింది.

అలెవ్‌తీనా ఇవనోవా తనకూతురు తల నిమిరింది.

"విచారించకమ్మా, విచారించకు. పద; వెళ్ళి పడుకుం డువుగాని, పద. డాక్టరమ్మ ఎంత కోపంగావుందో చూడు."

రాత్రిపూట మంచు కురుస్తోంది. గాలిలో చెమ్మ హెచ్చుగావుంది. గ్రామమంతటినీ అప్పుడే నీటితో కడిగారా అన్నట్టుంది. ఇళ్ళ చూరుల్లోంచి వెలుగురేఖలు దూసుకువస్తు న్నాయి వంటిళ్ళల్లోంచి పొగరేగుతోంది. ఇగురుకూరల సువాసన నోరూరించేటట్లు గుమాయిస్తోంది, ఆసుపత్రి నుంచి అప్పుడే కొత్తయింట్లో ప్రవేశిస్తున్న కుటుంబం ప్రశాంతతతోను శుభసూచనలతోను తులతూగుతోంది.

పసిపాపకు ఉయ్యాలమంచం కొనే తీరికకూడా ఫ్యోడా ర్‌కు లేకపోయింది. దూలానికి చీరె వేలాడిగట్టి ఉయ్యాల తయారుచేశాడు. ఏదో తప్పిదంచేసిన వాడిలాగా అతను బాధ పడ సాగాడు.

"ఏమైనా యిప్పుడేగా మనం కొత్తసంసారం పెట్టు కున్నది, కొంతకాలంపాటు సామానుల కొరత తప్పదుగా మరి'

కొత్తకాపురం పెట్టే ప్రతివారు ఇలాంటి యిబ్బందులకు లోన వుతూనే వుంటారు. కొద్దికాలం పోతే అన్నీ అమర్చుకోవచ్చు. పూరిల్లు అయితేమాత్రమేం, కావలసినంత దొడ్డివుంది సొంతంగా కూరగాయలు పండించుకోవచ్చు. అవసరమనుకొంటే గేదెను కూడా పెట్టుకోవచ్చు, కోళ్ళను పెంచుకోవచ్చు. ఏమంటావ్?" అంటూ ఫ్యోడార్ తననుతాను సమర్థించుకొంటూ, స్తేషాకు నచ్చజెప్పాడు.

"ఔను"ని అన్నింటికి ఆమె తలూపింది. ఇది లేదు, అది లేదు అని సణగలేదు, గొణగలేదు.

ఆరోజున పాపపేరు నిర్ణయించేశారు: ఓల్గా.

మరుసటి రోజున ఆయింటికి తొలి అతిథి అరుదెంచారు. ఆ వచ్చిన వ్యక్తి ఫ్యోడార్‌ను చూడటానికిగానీ స్తేషాను పలకరించటానికిగానీ రాలేదు.

తలుపు తట్టిన చప్పుడు. ఇరవై సంవత్సరాల యువతి తలుపు త్రోచుకొంటూ, వచ్చి ద్వారంలో నిలబడింది. దుస్తులపై పేరుకొన్న మంచును దులుపుకుంటూ ఆమె ప్రస్తావన ప్రారంభించింది.

"శుభోదయం! ఓల్గా నివసిస్తున్నది ఈ ఇంట్లో నేనా?"

చాలాసేపు భార్యాభర్తలిద్దరూ నిశ్చేష్టులైపోయారు. సమాధానం చెప్పాలన్న విషయంకూడా మరచిపోయారు ఓల్గా నివసిస్తున్నది ఈ ఇంట్లోనే...ఆమె జీవితం పదిరోజుల క్రితమే ప్రారంభమైంది. నిన్నటినుంచే ఆమెకు ఓ పేరు అంటూ ఏర్పడింది. నిన్నటినుంచే ఈ ఇంట్లో జీవిస్తోంది.

"మరేనండి. లోనకు దయచేస్తారా?"

ఆ యువతి పై కోటును తీసి, మడత పెట్టింది. తన సూట్ కేసులోనుంచి తెల్లటి గుడ్డతీసి వేడినీళ్ళు కావాలని చెప్పి, తెప్పించుకొని, శుభ్రంగా చేతులు కడుక్కొంది.

"మీరు వెంటనే పాపకు ఉయ్యాలమంచం తెప్పించాలి. అది చాలా అవసరం."

ఆమె స్తేపాతోకూడా చాలాసేపు మాట్లాడింది. ఒక మోస్తరు వేడి నీటితోమాత్రమే పాపకు స్నానం చేయించాలనీ, టైమ్‌ప్రకారం పాలిస్తుండాలనీ, సకాలానికి నిద్రపుచ్చాలనీ, సాయంత్రంపూట కాస్త బయటకు తీసుకెళ్లాలనీ సలహాలిచ్చింది. స్తేపా కప్పుతో టీతెచ్చి అతిధి ముందుంచింది; తీసుకోమని బ్రతిమలాడింది. కాని, ఆమె నిరాకరించింది.

"నేను మీఒక్క యింటికేకాదుగా, అనేక యిళ్ళకు వెళ్లాలి; ఇలా ప్రతిచోటా టీ తాగుతూంటే, ఇక నా ఆరోగ్యం ఎలా వుంటుందో వేరే చెప్పాలా?"

ఆ యింటికి మొదట వచ్చిన అతిధి డాక్టరు. అటుపిమ్మట వచ్చేపోయే అతిధుల సంఖ్య పెరిగింది.

చివరకు వర్వరా స్తెపనోవా కూడా ఒక శుభముహూర్తాన అతిధిగా ఆ యింట్లో కాలుపెట్టింది.

కోటువిడిచి, ప్రక్కనున్న దండెంపై వేసింది. కొంగర్లుపోయిన చేతులవేళ్ళు విరుచుకొంటూ నిలబడింది.

ప్యోదార్ గబగబా పాపను తీసుకొచ్చి, వర్వరా స్తెపనోవాకు చూపించబోయాడు.

"ఆగబ్బా, కాస్త ఆగు. మంచులోనుంచి ఇప్పుడే వచ్చానా, కాస్త చేతులు వేడెక్కనియ్యి, అప్పుడు పాపను తీసుకొని, రూపురేఖలు తల్లివో, తండ్రివో చూసి చెప్పుతాను."

వెంటనే ఆమె తనవెంట తెచ్చిన పొట్లాం విప్పింది.

"ఇదిగోనమ్మా, ఈ బహుమతి నీకు. వ్యవసాయక్షేత్రం తరఫున ఈ బహుమతి తెచ్చాను. ఫ్యోడార్, అమ్మాయికి తిండీ అదీ సరిగా అమరేటట్లు చూసే బాధ్యత నీది. పిల్ల పాలతాగుతున్నదన్న విషయం గుర్తుంచుకో. స్తేపా, ఇటు రా అమ్మా....పిచ్చిదానా, లేనిపోని శంకలు మనస్సులో పెట్టుకోకు. ఎందుకలా మూగదానిలా నిలబడతావు. మనిద్దరిమధ్య తగవులేమిటమ్మా. మనిద్దరం స్నేహితులుగా వుండాలి. ఇలారా. ఇదిగో ఈ దుప్పటి నేనుబహుమతిగా నీకు యిస్తున్నాను జాగ్రత్తగా యిల్లు చక్కదిద్దుకో"

వర్వారా స్తెపనోవా ఇంత దయార్ద్రహృదయం కల వ్యక్తి అని స్తేపా ఊహించలేకపోయింది. వర్వారా మాటలు వింటూ ఆమె నిశ్చేష్టురాలైంది.

"ఇదేమిటమ్మా, ఉయ్యాలమంచం ఇంకా కొనలేదా? సరేలే, నేను వెంటనే వడ్రంగితో చెప్పి తయారు చేయిస్తాలే. రేపీపాటికి యింటికి పంపిస్తాను"

దానితో స్తేపా హృదయం కరిగి నీరై పోయింది.

వర్వారా పాపాయిని ఎత్తుకొని, కాసేపు పరికించి చూసింది. పాపాయి గొల్లున ఏడుపు ప్రారంభించింది. పసిపాపను ఆడిస్తూ—

"చూడగా గొంతుకంచుదిలా వుంది. ఫ్యోడార్ అన్నా నీ పోలికలే సుమా"

వర్వారా వెళ్ళిపోయిన తర్వాత చిజోవ్ వచ్చాడు నీటుగా తయారై వచ్చాడు. వారు ముగ్గురు కలిసి టీ తాగారు. ఎంత బలవంతంచేసినా చిజోవ్ బిస్కట్లు తిననేలేదు.

అందరివంతూ అయిపోయిన తర్వాత సిలాంతీ పెట్రొవిచ్, అలెవ్ తినా ఇవనోవా అరుదెంచారు. ఫ్యోడార్ సకల మర్యాదలతో అత్త మామలను సత్కరించాడు. మామకోసమని 'వోడ్కా' సీసా ఒకటితెచ్చి యింట్లో దాచాడు.

అమ్మమ్మ, తాత అంత ఆనందం పొందలేరు; ఫ్యోడార్ స్నేహాలకు సంతోషం కలగలేదు.

సిలాంతీ పెట్రొవిచ్ వోడ్కా తాగటానికి తీరిక లేదంటూ నిరాకరించాడు. గుర్రాన్ని అప్పగించటం కాస్త ఆలస్యమైతే వర్వారా స్టెపనోవా తనచర్మం వలిచేస్తుందని చెప్పాడు.

అలెవ్ తీనా ఇవనోవా నోరు మూసుకొని, ఒకమూల కూర్చున్నది జాగ్రత్తగా ఇల్లంతా కలయచూస్తోంది. ఆమె చూపుల్లోనే భాధను వ్యక్తం చేస్తోంది: ఎందుకొచ్చిన నటన ఇది. మాకు తెలియదనుకొంటున్నారా? మీరు సౌఖ్యంగా జీవిస్తున్నారంటే మేము నమ్ముతామా? పేదరికం అనుభవిస్తున్నారు నికృష్టమైన బ్రతుకు వెళ్ళబుచ్చుతున్నారు .... అని వెక్కిరిస్తున్నాయి ఆమె చూపులు.

ఆమె అల్లుడువంకమాత్రం కన్నెత్తి చూడలేదు.

ఆ ముసలివాళ్ళిద్దరూ అయిదు నిమిషాలసేపు మాత్రం కూతురితో మాట్లాడారు. లోకులు ఏమనుకొని పోతారోనని అరగంటసేపు ఆ యింట్లో వుండిపోయారు; మాటా మంతీ లేకుండా గడిపారు,

ఆ అరగంటసేపు ఫ్యోడార్‌కు గతస్మృతులన్నీ గుర్తు కొచ్చాయి. మళ్ళీ నరకకూపంలో పడిపోయినట్టనిపించింది.

స్త్రేషాకూడా అత్తమామల వలెనే కన్నెత్తికూడా తన వంక చూడలేదు. అతని హృదయంలో అగ్నిజ్వాల రేగింది.

మామ అడిగినప్రశ్న లన్నింటికీ ఫ్యోడార్ ముక్తసరిగా జవాబులిచ్చాడు. జీతం ఎంతో, అధికారులు యింటిని ఎప్పుడు మంజూరు చేస్తారో ఇత్యాదిప్రశ్నలు వేయగా, అన్నింటికీ సమాధానం చెప్పాడు.

తల్లిదండ్రులు వెళ్ళిపోగానే స్త్రేషా మళ్ళీ మామూలు మనిషిగా మారిపోయింది. నిజానికి ముసలాళ్ళు త్వరగా వెళ్ళిపోయినందుకు ఆమె ఎంతో సంతోషించిందికూడా,

కామ్సొమోల్ జిల్లాకమిటీ కార్యదర్శి నీనా గ్లజిచేవా అనుకోకుండా ఆ యింట్లో ఊడిపడింది. ఫ్యోడార్ ఆశ్చర్యపోయాడు; స్త్రేషా విస్మయురాలైంది నీనా ఆట్టేసేపు అక్కడ కూర్చోలేదు.

"కూర్చునేందుకు వీలులేదు నేను త్వరగా వెళ్ళిపోవాలి మీయిద్దరూ కలిసి జీవిస్తున్నారని తెలిసిఒకసారిచూచిపోదామని వచ్చాను, ఇలా హాయిగా కలిసి జీవించాలి. అందాలుచిలికే

చందమామనుబోలిన పసిపాప! ఈ పాపకు ఉజ్వల భవిష్యత్తు చేకూర్చవలసిన బాధ్యత మీ యిద్దరిదీని. తెలిసిందా" అని ప్రబోధించి, నీనా తుర్రున వెళ్ళిపోయింది.

తన కూతురిసి నీనా పొగుడుతుంటే, స్త్రేషాకు సిగ్గేసింది. స్త్రేషా కృతజ్ఞతాపూర్వకంగా నీనావైపు చూస్తూ మారు పలకలేదు. ఫ్యోడార్ కూడా కొద్దిగా సిగ్గుపడ్డాడు.

ఆ విధంగా వేరే కాపురం పెట్టిన తర్వాత తొలిరోజులు హాయిగా గడిచిపోయాయి.

# 22

ఫ్యోడార్ కు కూతురు పుట్టినదన్న వార్త పాతదై పోయింది. అతిధుల రాక తగ్గిపోయింది. వేడుకలు ముగిసిపోయినాయి.

మామూలీ జీవితం ప్రారంభమైంది. స్త్రేషా మొదటిసారిగా తల్లిదండ్రులకు దూరంగా, వేరేచోట కాపురం పెట్టి జీవిస్తోంది.

ఇంటి యజమానికి కూడా ఫ్యోడార్ కుటుంబం అంటే అమితమైన అభిమానం. కలకాలం తన యింట్లోనేఉండిపొమ్మని కూడా అతను అనేకసార్లు ఫ్యోడార్ తో అన్నాడు యజమాని ఎంత యిదిగావున్న అద్దెకొంప అద్దెకొంపేగా, స్త్రేషాకు అలాగే అనిపిస్తున్నది.

ఒకరోజు రాత్రి ఫ్యోడార్ పొద్దుపోయి యింటికొచ్చాడు స్తేషా యింకా అప్పటికి నిద్రపోలేదు. కన్నారింటిపై గాలిమల్లి కుళ్ళి కుళ్ళి ఏడుస్తూ కూర్చున్నది. భర్త కాళ్ళు కడుక్కొని, పీటేసుకొని, భోజనానికి కూర్చున్నాడు. స్తేషా కంటతడి పెట్టు తుండటం చూసి, అతను గబాలున పీటపైనుంచి లేచి వెళ్ళి పోయాడు. స్తేషా పశ్చాత్తాపపడింది. కాసేపున్న తర్వాతఫ్యోడార్ నెమ్మదిగా భార్యదగ్గరకు వచ్చి "స్తేషా" అంటూ ముద్దులొలికే గొంతుకతో పలకరించాడు. స్తేషా కళ్లెత్తి భర్త కళ్ళల్లోకి మురిపాలొలికిస్తూ చూసింది.

"మంచికబురు ఒకటి చెప్పమంటావా?"

"మంచికబురా! చెప్పండి"

"త్వరలో మనం ఇల్లు కట్టుకోబోతున్నాం. ట్రాక్టరు డ్రైవర్లకు ప్రత్యేకంగా ఒక పేట నిర్మించాలని మెషీన్ట్రాక్టరు స్టేషన్ తరఫున ఇవాళ నిర్ణయించారు. మనకు ప్రత్యేకంగా ఒక చిన్న యిల్లు నిర్మిస్తారు. ఇదిశుభవార్త కదా! మనకూ సొంత యిల్లంటూ ఏర్పడబోతున్నది. చుట్టూ దొడ్డి, దొడ్లో తోట, కిటికీలప్రక్కనే పూలమొక్కలు....

"ఎంతకాలం పట్టుతుందంటారు?"

"ఎంతకాలమా? మాస్కోనగరం ఒక్కరాత్రిలో వెలియ లేదుగదా? ఏమంటావ్? అమ్మాయి కాస్త ఆడటం మొద లెట్టగానే మనిద్దరం మళ్ళీ చదువు ప్రారంభిద్దాం. నీలాగే నేనూ స్కూల్ఫైనల్ అన్నా పూర్తిచేయలేదు. మనిద్దరం కాలేజీ చదువైనా పూర్తి చేయగలిగామా ఎంత బాగుంటుందో ఆలో చించు."

"సరే, విద్యార్థిమహాశయా! భోజనం పూర్తిచేసి పడుకొందాం పదండి. పొద్దుపోయింది."

ఆమె పడకపై మేనువాల్చి ఎన్నెన్నో కలలు కన్నది. సొంతయింటిని ఊహాపదంలో చిత్రించుకొని మురిసిపోయింది. ఆలోచిస్తున్న కొలది ప్రియునిమీద ప్రేమ ఆమెలో ఇతోధికమైంది. కలలుకంటూనే మైమరచి నిద్రపోయింది.

# 23

స్త్రేషా తల్లివచ్చింది. తల్లి రావటంతో మళ్ళీ గతమంతా ఒకసారి గుర్తుకొచ్చింది. మొగుడిమాటలకు మురిసిపోతున్నప్పటికీ కన్నారింటిని మరిచిపోవటం స్త్రేషాకు సాధ్యంకాలేదు. తల్లిదండ్రులను తలచుకొని ఆమె కంటతడి పెట్టుకొంటుంది. తన తల్లి దండ్రులంటే ఫ్యోడార్‌కు బొత్తిగా యిష్టంలేకపోవచ్చు. కాని, ఎంతలేదన్నా వారు తన తల్లిదండ్రులు గదా. ప్రతిరోజు ఉదయాన తల్లివచ్చి తనను బుజ్జగించి చెప్పి మరీ వెళ్లుతుండేది: "అప్పుడే లేచావే." పడుకోఅమ్మా, పడుకో. అప్పుడు స్త్రేషా అనిర్వచనీయమైన ఆనందం పొందుతుండేది.

స్త్రేషా తల్లి వచ్చినప్పుడు ఫ్యోడార్ ఇంటివద్ద లేడు. తల్లికి ఎలా మర్యాదలుచేయాలో స్త్రేషాకు తోచలేదు. ఎప్పుడైనా అతిధులకు మర్యాదలుచేసే అలవాటు వుంటేగా?

అలెక్సీనాఇవనోవా టీ త్రాగుతూ కూతురుని పరామర్శించింది;

"ఏమే తల్లి, నీ మొగుడు నిన్నెలా చూస్తున్నాడు."

"పువ్వుల్లో పెట్టి పూజిస్తున్నాడమ్మా, వారి హృదయం వెన్నపూస వంటింది."

"అబ్బో, అలాఅని వేరే చెప్పాలా? చూస్తుంటే కనపడటంలా? నాచిట్టితల్లి ఇలా చిక్కిపోవలసిన కర్మ పట్టింది గదా?"

అమ్మా కూతుళ్ళిద్దరూ కలిసి కన్నీరు మున్నీరుగా ఏడ్చారు. పరస్పరం ఓదార్చుకొన్నారు. వారు ఈకార్యక్రమంలో ఉంటే, ఈ లోపల టీ కాస్తా చల్లారిపోయింది.

ఆవాళ సాయంత్రం ఫ్యోడార్ ఇంట్లో అడుగు పెడుతూండగానే స్త్రేషా మొదలెట్టింది.

"ఈ విధంగా నేనిక్కడ ఇక వుండలేనండి. ఇంటికి వెళ్ళిపోతున్నాను.... కొంతకాలం అక్కడ వుంటాను. నెల కావచ్చు; రెండు నెలలు కావచ్చు."

ఆమె మాటల్లో కొత్తగొంతు విన్పించింది. ఆగొంతులో పగ ధ్వనించింది. ఆమెకళ్ళు నేల వాలాయి.

"నిన్ను మళ్ళీ ఆ యింటిలో అడుగు పెట్టనివ్వజాలను. స్త్రేషా, నీవు వెళ్ళటానికి వీల్లేదు. కావాలంటే నాలుగు రోజుల్లో కొత్తయిల్లు అద్దెకు తీసుకొని, అందులో ప్రవేశిద్దాం. నర్సును ఏర్పాటు చేస్తాను. అంతేకాని, నిన్ను మళ్ళీ కన్నారింటికి పంపటం కల్ల ఆ పాడుకొంపలో నీకు అడుగు పెట్టిన మరుక్షణంలో నీ మనస్సు పాడై పోతుంది. విషం కలిపిన పాలులాగా విరిగి పోతుంది.

"విషం మీ మనస్సులోనే వుంది. మా కన్నారినిగిరించి అనవసరంగా ఆడిపోయకండి"

మొగుడిని పట్టుకొని మొఖం ఎదశే కడిగేద్దామను కొన్నది; కొత్తయింటినిగురించి చెప్పిన కబుర్లన్నీ కేవలం కట్టు కథ అనేద్దామనుకొంది. మన బ్రతుకు ఎప్పుడూ యింతేలే అని చెప్పేద్దామనుకొంది. కాని మాటలు పెగలలేదు. నాలిక చివరి దాకా వచ్చి ఆగిపోయాయి. కన్నారింటిలో ఉండటమే తనకు ఎంతో హాయిగా వుంటుంది.

ఇంతలోకి పిల్ల గొల్లున ఏడ్పు ప్రారంభించింది.

స్తేషా గబగబా ఉయ్యాలమంచం దగ్గరకు పరుగెత్తి కెళ్ళి, పాపను తీసుకొని, హృదయానికి హత్తుకొంది:

"ఇంతేలే తల్లీ, మన బ్రతుకులు ఇంతేనమ్మా, మన ఆలనా పాలనా చూసేవాళ్లే లేరు. మీ నాన్నకు మన బాగోగులకన్నా ట్రాక్టర్లగొడవ ముఖ్యం"

సరిగ్గా సిలాంతీ ర్యాప్కిన్ యింటిలోని విషతుల్యమైన వాతావరణం మళ్ళీ ప్రత్యక్షమైంది. నోరు మూసుకుని ఊరు కొనేందుకు వీలులేదు; నోరుతెరిచి మాట్లాడిప్రయోజనం లేదు. ఏమైనా అంటే రభసతప్పదు అనుకొని, ఫ్యోడార్ మూగనోము పట్టాడు.

మరుసటిరోజున ఫ్యోడార్ మెషీన్ ట్రాక్టరు స్టేషన్ నుంచి సరాసరి షాపుకువెళ్ళి ఏవో సరుకులు ఖరీదుచేసి యింటికి వచ్చాడు.

తీరా ఇంట్లోకివెళ్ళి చూశాడుగదా, ఇల్లంతా బావురు మంటోంది. ఇంట్లో ఎవరూవున్నట్టు కన్పించదు.

వర్వారా స్త్రెపనోవా పంపిన ఉయ్యాలమంచం ఖాళీగా వుంది. స్త్రేషా ఓల్గాను భుజాన వేసుకొని కన్నారింటికి వెళ్ళి పోయింది. చెప్పనయినా చెప్పకుండా వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళిపోయింది....ఆమెను ఇంకా చదివిద్దామను కొన్నాను. దాంపత్య జీవితనాటకం దుఃఖాంతం కాక తప్పదు. ఎంత ప్రయత్నించినా సుఖాంతం చేయటం దుర్లభమని తేలి పోయింది. ర్యాష్కిన్ యింటికి వచ్చి తనను బ్రతిమాలుతానని అనుకొన్నదేమో? అది కల్ల. జిల్లాకమిటీ వచ్చి చెప్పినా, చచ్చినా వినను. ఆ స్త్రేషాను అభివృద్ధి చేయటం నాతరంకాదు. దీనికి ఇదే అంతం....

"చివరకు నా ఓల్గాను కూడా తీసుకుపోయింది...."

* * *

పాప నిద్రపోతోంది. ముసలివాళ్ళు యిద్దరూ ప్రశాం తంగా హాయిగా, నిశ్చింతగా నిద్రపోతున్నారు.

కాని, స్త్రేషాకు నిద్రపట్టలేదు. ఆలోచనలహోరుతో ఆమెబుర్ర వేడెక్కిపోయింది. ఆమె జీవితం బుగ్గిపాలైంది. కడుపుచించుకొంటే కాళ్ళమీదపడటం తప్ప ప్రయోజనం ఏముంది? జీవితం భారంగా ఘోరంగా తయారైంది.

సమిష్టి వ్యవసాయక్షేత్రం ఆఫీసు ప్రక్కనగల క్లబ్ కోలాహలంగా వుంది. కొత్తగా విద్యుచ్ఛక్తి వచ్చిందేమో, లైట్లు బ్రహ్మాండంగా వెలుగుతున్నాయి. అందులోను ఆరోజు సం|క్రాంతి పండగ. పంటలు యింటికితెచ్చిన పండుగ.

స్తేషా ఒంటరిగా చీకటిలో కూర్చొని, క్లబ్‌లో ఏమి జరుగుతున్నవో ఊహిస్తోంది.... చీకుచింతా లేని ఫ్యోడార్ హాయిగా అందరితో కలిసి డ్యాన్సు చేస్తుంటాడు.

అతను ఆమెకు డబ్బుపంపించాడు. బహుశా తనకూతురు గుర్తుకొచ్చి ఆపని చేసివుంటాడు. కాని, భార్య సంగతి మరచి పోయాడు. అతను డ్యాన్సు చేయగలడు; పదిమందితో కలిసి విరగబడి నవ్వగలడు; పైలాపచ్చీస్‌గా తిరగగలడు. అతను పూర్తిగా స్వేచ్ఛాజీవి. పిల్లాపీచూ బెడద అతనికి లేదు.... జనంకూడా అతన్నే మెచ్చుకొంటారు కాని తన స్థితో.. స్తేషా తదేకంగా ఆలోచిస్తోంది.

ఈ ప్రపంచానికి మా కుటుంబం అంటే ఇంత కక్ష ఎందుకో?"....అనేక వందలసార్లు తనకుతాను స్తేషా ఆప్రశ్న వేసుకొంది. కాని సరియైన సమాధానం ఇంతవరకు దొరకనే లేదు.

"ఏమితల్లీ, ఒంటరిగా చీకట్లోకూర్చొని ఏంటి ఆలోచిస్తు న్నావు?

ఇంకా నిద్ర పోలేదేం? అంటూ ఆ గదిలోకి తల్లి ప్రవే శించింది. "ఉండమ్మా దీపంఅన్నా వెలిగిస్తాను" అంటూ స్తేషా తల్లి దీపందగ్గరకు వెళ్ళింది.

"చూశావా, విద్యుచ్ఛక్తి విషయంలోకూడా పలపక్షమే కొందరికి యిచ్చారు; మరికొందరకు రానేలేదా"

"అమ్మా"

స్తేషా బిగ్గరగా, కోపంతో అరిచింది.

"ఆఁ" అంటూ అలెవ్ తీనా ఇవనోవా విస్మయురాలైంది. ఈమధ్య తన కూతురు బొత్తిగా మారిపోయింది; పూర్తిగా చెడిపోయింది ఎప్పుడూ ఒకటేఏడ్పు. ఒకటే కసురుకోటం.

"అమ్మా....ఊళ్లో వాళ్ళందరికి మనం ఎందుకు గిట్టకుండా పోయామో చెప్పగలవా?"

"అసూయ తల్లి, అసూయ. అసూయనుంచే నిందలు బయలుదేరుతాయమ్మా,"

"అయితే ప్రతీవారూ మనలను చూసి ఎందుకుఅసూయ చెందుతున్నారు? వూళ్లోవాళ్ళంతా మనలను వెలివేశారు. మనసిచ్చి మాట్లాడేవారు లేరు. కూపస్థ మండూకాలవలే మనం నాలుగు గోడలమధ్య గూడు కట్టుకొని జీవించవలసిన దుర్గతి పట్టింది"

"ఏమిటోకి, నీవు చెప్పుతున్నది నాకు బొత్తిగా బోధ పడకుండా వుంది"

"ఎందుకు బోధ పడుతుంది? నాకు పెళ్ళయింది. నాభర్త యిల్లరికం వచ్చాడు. ఆయనను వేధించుకు తిన్నారు. యింట్లో నుంచి వెళ్లిపోయేదాకా ఊరుకోన్నారుకాదు. అందరి యువతులవలెనే నేనూ జీవించాలని కోరుకొన్నాను. కాని నాసంసారంలో మీరు నిప్పులు పోశారు. వేరే యింట్లో కాపురం పెట్టుకొన్నాం అయినా మీరు మమ్మల్ని వదిలిపెట్టలేదు. అక్కడికి వచ్చి నాకు ఏమేమో చెప్పారు ఆయనమీద లేనిపోని మాటలు చెప్పి, నన్ను పురెక్కించారు. ఆయన మాటలు నమ్మవద్దని చెప్పారు. చివరకు నన్నిలా తయారు చేశారు"

"అరి భగవంతుడా, చివరకు కన్నకూతురిచేత మాటలు పడాలని రాసిపెట్టావ్ గదరా?"

ఈ పెడబొబ్బలతో ముసలాడు నిద్రనుంచి లేశాడు.

"మళ్ళా మొదలెట్టావా స్త్రేషా? నీకు బుద్ధి చెప్పకపోతే ఇక లాభం లేనట్టుంది"

"ఇప్పటిదాకా మీరు గరపిన బుద్ధి చాలు. మీ బుద్ధుల వల్లనే నా సంసారం బుగ్గిపాలైంది."

"నీవు మాకడుపున చెడపుట్టావ్. వంశమర్యాదకే కళంకం తెచ్చావ్. ర్యాప్కిన్ వంశంలో ఎన్నడూ గృహచ్ఛిద్రాలు లేవు. కాని ఇప్పుడు ఈ యిల్లు కీచులాటలకు, మొత్తుకోళ్ళకు, ఏడ్పులకు నిలయమైపోయింది."

"ఇదంతా వాడిపుణ్యమే. దీని మొగుడు తెచ్చిపెట్టిన తద్దినమే. దీని మనస్సును వాడు విషకలుషితం చేశాడు. వాడొక కాలస్వరం. మనలను నలుగురిలో నవ్వులపాలు జేశాడు. బిడ్డను కని మనమొఖాన పారేసి పారిపోయాడు. ఇదంతా వాడి చలువే"

"మీరు నా జీవితాన్ని పాడుచేశారు. నా జీవితాన్ని మట్టిపాలు జేశారు."

ఇదేసమయంలో అక్కడ క్లబ్ లో యువకులంతా ఫ్యోడార్ చుట్టూచేరి డ్యాన్సు చేయమని బలవంతంచేస్తున్నారు. ఆ పోరుపడక చివరకు అతను డ్యాన్సు ప్రారంభించాడు.

అతని చేతులు కొద్దిగా వణుకుతన్నాయి. ముఖంపై పడిన జుట్టును చేతితో పైకి ఎగదోస్తూ అతను డ్యాన్సు చేస్తు న్నాడు.

స్నేహా క్లబ్‌కుచేరింది. డ్యాన్సుచేస్తున్న భర్తను చూస్తూ అనిర్వచనీయమైన ఆనందానుభూతి పొందుతూ నిలబడి పోయింది.

